శ్రీః

మహాకవి శ్రీపండితరాజజగన్నాథకృతా

# గంగాలహరీ

(యమునాలహరీ సమేతా)

అమృతధారావ్యాఖ్యా

గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ



ప్రకాశకులు

రామానంద ట్రస్ట్

వాడరేవు, చీరాల - 523 157

శ్రీః

మహాకవి శ్రీ పండితరాజ జగన్నాథకృతా

# గంగాలహరీ

(యమునాలహరీసమేతా)

అమృతధారావ్యాఖ్యా - గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ


ప్రథమముద్రణ : *07-09-2017*

ప్రతులు : *500*

పేజీలు : *100*

వెల రూ. : *30-00*





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
**Andhra Pradesh.**
Cell : 9440115411



*D.T.P. by :-*
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

*Printed at -*
**Karshak Art Printers,**
**HYDERABAD**

శ్రీః

మహాకవి శ్రీపండితరాజ జగన్నాథవిరచితా

# గంగాలహరీ

శ్లో॥ సమృద్ధం సౌభాగ్యం సకలవసుధాయాః కిమపి త -
న్మహైశ్వర్యం లీలాజనితజగతః ఖణ్డపరశోః ।
శ్రుతీనాం సర్వస్వం సుకృతమథ మూర్తం సుమనసాం
సుధాసౌన్దర్యం తే సలిలమశివం నః శమయతు ॥ 1

## అమృతధారావ్యాఖ్యా

కం॥ శ్రీమత్పుష్పగిరీశ
స్వామి పదాబ్జములు గొలిచి పండితరాజ
శ్రీమద్గంగాలహరికి
శ్రీమదమృతధార నాఁగఁ జేసెద వ్యాఖ్యన్.

తే॥గీ॥ అల జగన్నాథ గంగాల-హరికృతికిని
జెలఁగి పీయూషలహరి ర-చించి నట్టి
శ్రీసదాశివభట్టుని -హృదిఁదలంతు
వ్యాఖ్య విరచించు వేళ నా-కండ గాఁగ.

**అవతారిక :** జగన్నాథకవి ఢిల్లీవల్లభు నాశ్రయించి తత్కుమారి యగు లవంగిని జేపట్టి యవనీసంసర్గదోషమును బొంది యా పాపమును బాపుకొన నెంచి గంగాతీరము చేరి యేఁబది రెండు మెట్ల క్రింద నున్న గంగను బైకి రప్పించి తత్స్పర్శనస్నానాదులచే నాత్మశుద్ధిని గోరిన వాఁడై

శ్లో॥ కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే ।
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే ॥ (కా.ప్ర.)

కావ్యమువలనఁ గీర్తి, ధనము, వ్యవహారదక్షత, యశుభనాశనము, చదివిన వెంటనే పరమానందము, కాంతాసమ్మితముగా నుపదేశము మొదలగునవి సిద్ధించు నను శ్రీమమ్మటాచార్యుని వచనము ననుసరించి **గంగాలహరి**యను స్తోత్రకావ్యము నారంభింపఁ దలఁచిన వాఁడై

శ్లో॥ ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్ (కావ్యదర్శ- 1.14)

అను దండ్యాచార్యు నుపదేశమును దలఁచి ప్రారిప్సితకావ్యవిఘ్నవిఘాతమునకై వస్తునిర్దేశాత్మక మగు మంగళము నాచరించుచు స్వాభిమతమును బ్రార్థించుచున్నాఁడు.

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా! సకల = సమస్తమైన; వసుధాయాః = భూమికి; సమృద్ధమ్ = విరివియైన; సౌభాగ్యమ్ = మహాభాగ్యసంపద యైనది; లీలా = విలాసముగా; జనిత = పుట్టించిన; జగతః = లోకముగల; ఖండపరశోః = శివునకు; కిమపి = చెప్పలేని యనిర్వచనీయమైన; తత్ = ప్రసిద్ధమైన; మహా + ఐశ్వర్యమ్ = పరమవైభవ (విభూతి) మైనది; శ్రుతీనామ్ = వేదములకు; సర్వస్వమ్ = సమస్తస్వరూప మైనది లేక సమస్తధనము నైనది; అథ = ఇంకను; సుమనసామ్ = దేవతలకు లేక మంచిమనస్సుగలవారికి, మూర్తమ్ = రూపు కట్టిన; సుకృతమ్ = పుణ్యమైనది; సుధా = అమృతమువలె; సౌందర్యమ్ = ఒప్పిద మైనది యగు; తే = నీయొక్క; సలిలమ్ = జలము; నః = మాయొక్క; అశివమ్ = అశుభమును; శమయతు = శమింపఁ జేయుఁగాక! పోఁగొట్టుఁగాక. లేక **'కిమపి తన్'** అనునది ప్రత్యేకపదము. అనిర్వచనీయమైన మోక్షప్రాప్తి రూపఫలమును విస్తరించు నీ సలిల మని యన్వయింపవచ్చును. 'తను-విస్తారే' యను ధాతువునకు క్విప్ ప్రత్యయము చేరి **కిమపి-తన్** అను రూప మేర్పడును.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! సమస్తభూలోకమునకు సమగ్రమైన సౌభాగ్యమును గూర్చునది, హేలగా జగములను సృష్టించు శివున కైశ్వర్యము కలిగించునది, నాలుగు వేదములకుఁ దత్త్వస్వరూపమైనది మఱియు దేవతలకు, మంచిమనస్సు గల మానవులకు, విద్వాంసులకుఁ బుష్పములకు రూపు దాల్చిన పుణ్య మైనది, యమృతము వలె సుందర స్వరూపము గలది, యనిర్వచనీయ మైన (చెప్పుటకు వీలు కాని) ముక్తిని విస్తరించునది యగు నీ నీరు మా యొక్క యశుభములను నాశనము చేయుఁగాక! యని భావము.

**విశేషములు : 'సుధాసౌందర్యమ్'** అనుచోట **'సుధాసౌదర్యమ్'** అను పాఠాంతర మున్నట్లు పీయూషలహరీవ్యాఖ్యను రచించిన శ్రీ సదాశివభట్టు సూచించినాఁడు. వ్రాఁతలో సౌందర్య-సౌదర్య' శబ్దములకు దగ్గఱ సంబంధముండుట సహజమే. అప్పుడు సుధాసౌదర్యమ్ = అమృతమునకుఁ దోఁబుట్టువైన యనఁగా నమృతముతో సమానమైన జల మని యర్థము చెప్పుకొనవలయును. ఇక్కడ **'సుధామాధుర్యమ్'** అను పాఠ మున్నచో నింకను రమణీయముగా నుండెడిది. గంగాజల మమృతము వలెఁ దియ్యనైన దని యర్థము వచ్చును.

స్తోత్రకావ్యములలో లహరీసంప్రదాయమునకు శ్రీకారము చుట్టిన వారు శ్రీశంకరభగవత్పాదులు. వారు రచించిన సౌందర్యలహరి శివానందలహరి సుప్రసిద్ధములు. జగన్నాథుని గంగాలహరి ననుసరించి కృష్ణాలహరి, గోదావరీలహరి మొదలగు స్తోత్రకావ్యము లుదయించినవి. వీనిలో శివానందలహరి తప్పఁ దక్కిన లహరీకావ్యము లన్నియు శిఖరిణీవృత్తబద్ధము లగుట విశేషము.

ఈ గంగాలహరిలో **'శరచ్చంద్రశ్వేతామ్'** (48) అను శ్లోకము వఱకు నన్నియు **శిఖరిణీ**వృత్తములు. **'రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ'** అని వృత్తరత్నాకర లక్షణము. శిఖరిణిలోఁ బ్రతిపాదము నందును 'య–మ–న–స–భ–లగ' యను గణము లుండును. శిఖరిణిలో మొట్టమొదటి దగు యగణము జలదేవతాక మగుట చేతను గంగామాత జలస్వరూపిణి యగుట చేతను జలస్పర్శరూపాభిమతఫలసిద్ధికై జగన్నాథకవి తక్కినవృత్తములను విడిచిపెట్టి శిఖరిణి నెన్నుకొనుటకుఁ గల కారణ మని వృత్తస్వారస్యమును శ్రీసదాశివభట్టు వివరించినాఁడు. యగణమున కధిదేవత జలము.

శ్లో॥ పృథ్వీ జల శిఖి వాయుః గగనం సూర్యశ్చ చంద్రమా నాకః ।
ప్రస్తారక్రమవశతో దేవా జ్ఞేయా యథాసంఖ్యమ్ ॥

(1) మగణమునకు భూమి (2) యగణమునకు జలము (3) రగణమున కగ్ని (4) సగణమునకు వాయువు (5) తగణమున కాకాశము (6) జగణమునకు సూర్యుఁడు (7) భగణమునకుఁ జంద్రుఁడు (8) నగణమునకు స్వర్గము నధిదేవతలు.

శ్లో॥ **మో** భూమిః శ్రియ మాతనోతి **య** జలం వృద్ధీ ర వహ్నిర్మృతిం
**సో** వాయుః పరదేశదూరగమనం **త** వ్యోమశూన్యమ్ ఫలమ్ ।
**జః** సూర్యో రుజమాదధాతి విపులాం భేందుర్యశో నిర్మలం
**నో** నాకం సుఖమీప్సితమ్ ఫలమిదమ్ ప్రాహుర్గణానామ్ బుధాః ॥

అని యగణమునకు జలము, వృద్ధి ఫలితములు.

కావ్యాదిని సవర్ణమును బ్రయోగించుటవలన సౌఖ్యము గలుగును.

శ్లో॥ **యో** లక్ష్మీం **ర**శ్చ దాహం వ్యసనమథ లవౌ శః సుఖం షశ్చ ఖేదమ్ ।
సః సౌఖ్యం హశ్చ ఖేదం విలయమపి చ ళః క్షః సమృద్ధిం కరోతి ॥

అని కావ్యాదివర్ణములకు ఫలితములు ఛందశ్శాస్త్రములోఁ జెప్పఁబడినవి. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణి చ భవంతి, ఆయుష్మత్పురుషాణి చ. అధ్యేతారశ్చ వృద్ధియుక్తా యథా స్యురితి' అను

మహాభాష్యకారుల వచనము ననుసరించి యీ కావ్యాదినిఁ బ్రయోగించిన 'సమృద్ధ–సౌభ్యాగ్య' శబ్దములు గ్రంథకర్త యగు జగన్నాథకవికిఁ గావ్యమును జదువు పఠితలకు, వినెడి శ్రోతలకుఁ గూడ సమృద్ధసౌభాగ్యములను గూర్చుచున్నవి. పతంజలి మహర్షి చెప్పినది శాస్త్రవిషయము గదా! యిది కావ్యము గదా! దీనిని మంగళాదిగా నారంభించుట యెందుల కని శంకింపఁ గూడదు. కావ్యము కూడఁ గాంతాసమ్మిత మగు శాస్త్రమే.

ఈ శ్లోకములో గంగాసలిలము సకల వసుధకు సౌభాగ్య మని యీ విధముగా నారోపించుటచే రూపకాలంకారము. సుధాసౌందర్యమను చోట సుధవలె సౌందర్యము గల దని పోల్చుటచే వాచకలుప్తోపమాలంకారము. ఇట్లు రూపకోపమాలంకారములకు సంకరము.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి రూపకాలంకారప్రకరణములో నుదాహరింపఁబడినది –

అయమేవానుక్తో యథా – సమృద్ధం సౌభాగ్యం... ... ...

అత్ర సౌభాగ్య–భాగీరథ్యోః స్వాభావవ్యాపకదౌర్భాగ్యత్వపరమోత్కర్షాధాయకత్వాది–రనుపాత్తః ప్రతీయమానో ధర్మః ఏవమీశ్వరాసాధారణధర్మత్వపరమగోప్యత్వ – నిరతిశయసుఖజనకత్వాన్యాపామరసకలజనజరామృత్యుహరణక్షమత్వం చోత్తరోత్తరారోపే ష్వనుగామీతి. సాధారణధర్మముపమాలకారమునందు వలెనే రూపకము నందుఁ గూడ (1) నొకచోట ననుగామి (2) ఒకచోట బింబప్రతిబింబభావముతోఁ గూడినది (3) ఒకచోట నుపచరితము (ఆరోపితము) (4) ఒకచోటఁ గేవలశబ్దాత్మగాను నుండును. కేవల శబ్దాత్మ యగు సాధారణధర్మము' కూడ (1) ఒకచోట శబ్దముచే నుపాత్తమైనది (2) వ్యజ్యమానమై శబ్దముచే నుపాత్తము గానిది రెండు విధములుగా నుండును.

శబ్దముచే నుపాత్తము కాకుండ ననుగామి యగు ధర్మమునకీ శ్లోక ముదాహరణము.

ఇక్కడ – సౌభాగ్య–భాగీరథీజలములకు నెక్కడ గంగ యుండదో యక్కడ దౌర్భాగ్య ముండు నను పరమోత్కర్షాధాయకధర్మము శబ్దముచే నుపాత్తము కాక పోయినను ధ్వనించుచున్నది. అట్లే యైశ్వర్య – గంగా జలములకు నీశ్వరమాత్రవృత్తి గల సాధారణధర్మము చెప్పక పోయినను ననుగామిత్వముచే ధ్వనించుచున్నది. అట్లే శ్రుతిసర్వస్వ – గంగాజలము లకు నతిగోపనీయత్వమను ననుగామిసాధారణధర్మము శబ్దముచేఁ జెప్పఁబడక పోయినను ధ్వనించుచున్నది. అట్లే సుకృత–గంగాజలములకు

సర్వాధిక సుఖజనకత్వమను ననుగామి యగు సాధారణధర్మము చెప్పఁబడక పోయినను ధ్వనించుచున్నది. అట్లే యమృతసామ్రాజ్య-గంగాజలములకు సకలప్రాణి జరామరణ హరణసమర్థత్వ మను ననుగామి ధర్మము శబ్దోపాత్తము కాకపోయినను బ్రతీయమాన మగుచున్నది. కాఁబట్టి యీ శ్లోకము శబ్దానుపాత్తమగు ననుగామి సాధారణధర్మమున కుదాహరణము, అలంకారము రూపకమే.

ఇక్కడ రసగంగాధరములో 'సుధాసౌందర్యం తే' యను దానికి 'సుధాసామ్రాజ్యమ్' 'సుధాసోదర్యమ్' అను పాఠాంతములు గలవు.

**అవతారిక :** ఇక్కడ గంగాజలప్రవాహము నాకు సంపదల నిచ్చుఁగాక యని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ దరిద్రాణాం దైన్యం దురితమథ దుర్వాసనహృదాం**
**ద్రుతం దూరీకుర్వన్ సకృదపి గతో దృష్టిసరణిమ్ ।**
**అపి ద్రాగావిద్యాద్రుమదళనదీక్షాగురురిహ**
**ప్రవాహస్తే వారాం శ్రియమయమపారాం దిశతు నః ॥ 2**

**ప్రతిపదార్థము :** సకృత్ అపి = ఒక్కమాఱైనను; దృష్టిసరణిమ్ = దర్శనమార్గమును; గతః = పొందినదై; దరిద్రాణామ్ = దరిద్రులయొక్క, దైన్యమ్ = లేమిని; అథ = తరువాత (ఇంకను); దుర్వాసనహృదామ్ = చెడ్డవాసనలతోఁ గూడిన హృదయము గల వారి యొక్క; దురితమ్ = పాపమును; ద్రుతమ్ = వేగముగా; దూరీకుర్వన్ = దూరము చేయునది; అపి = మఱియును; ద్రాక్ = శీఘ్రముగా; ఆ అవిద్యా = సమస్తాజ్ఞానములనెడు; ద్రుమ = చెట్లను, దళన = చీల్చుటయను; దీక్షా = వ్రతములో; గురుః = ఆచార్యరూపమైనది (గొప్పది) యగు; తే = నీయొక్క; వారామ్ = నీళ్ళయొక్క; అయమ్ = ఈ; ప్రవాహః = ప్రవాహము; అపారామ్ = అంతులేని; శ్రియమ్ = లక్ష్మిని; నః = మాకు; దిశతు = ఇచ్చుఁగాక!

**తాత్పర్యము :** తల్లీ! గంగా! ఒక్కమాఱు చూచినంత మాత్రముననే బీదవారి లేములను, దుర్వాసనలతో నిండిన హృదయము గల వారి పాపములను దూరము చేయునది, శీఘ్రముగా నజ్ఞాన మనెడి చెట్లను గూల్చివేయుటలో నాచార్యత్వము వహించునది యగు నీ నీళ్ళ ప్రవాహము మా కపారమైన సంపదల నొసఁగుఁ గాక!

**విశేషములు :** ఇక్కడ దుర్వాసన లనఁగాఁ బూర్వజన్మకర్మములు. సామాన్యజలములు బాహ్యముగా నున్న దుర్గంధమును మాత్రమే పోఁగొట్టును. గంగాజలములో మనస్సులో నున్న పూర్వజన్మదుర్వాసనలను గూడ దూరముగా నెట్టి వేయును. అవిద్య యనఁగా

మాయ. మాయలు బహువిధములుగా నుండు ననుటకు **"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"** యను శ్రుతివాక్యము ప్రమాణము. గంగాప్రవాహ మొక్కమాఱు చూచినంతనే యింత ఫలితము నిచ్చుచున్న దనఁగా నింక దానిలో స్నానము చేసిన వారికి నానీటిని బానము చేసిన వారికిఁ గలుగు ఫలితము చెప్ప నలవి గాదని భావము. ఇక్కడ– **'అపి ద్రాగవిద్యాద్రుమదలన'** యను శ్రీయమునారామత్రిపాఠిగారి **'చాతకప్రియా'** పాఠము సరియైనది కాదు. ఛందోభంగము.

**అవతారిక :** ఇప్పుడు గంగాతరంగములను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ ఉదఞ్చన్మార్తణ్డస్ఫుటకపటహేరమ్బజననీ–**
**కటాక్షవ్యాక్షేపక్షణజనితసంక్షోభనివహాః ।**
**భవన్తు త్వఙ్గన్తో హరశిరసి గఙ్గాతనుభువ–**
**స్తరఙ్గాః ప్రోత్తుఙ్గా దురితభయభఙ్గాయ భవతామ్ ॥ 3**

**ప్రతిపదార్థము :** ఉదంచత్ = ఉదయించుచున్న; మార్తండ = సూర్యుని వలె – ఇది పార్వతీకటాక్షములకు విశేషణము. స్ఫుట = స్పష్టముగా; కపట = నెపము (మిష) తోనున్న; హేరంబ = వినాయకునకు; జననీ = తల్లియైన పార్వతియొక్క; కటాక్ష = క్రేగంటి చూపుల యొక్క; వ్యాక్షేప = ప్రహారములచే (దెబ్బలచే); క్షణ = క్షణకాలము; జనిత = పుట్టిన; సంక్షోభ = భయముయొక్క; నివహాః = సమూహములు గలవి; హర = శివునియొక్క; శిరసి = తలపై; త్వంగంతః = నృత్యముచేయుచుఁ గదలునవి; గంగా = గంగానదియొక్క; తను = శరీరమునుండి; భువః = పుట్టినవి; ప్ర ఉత్ తుంగాః ప్రోత్తుంగాః = మిక్కిలి యెత్తైనవి యగు; తరంగాః = కెరటములు, భవతామ్ = మీ యొక్క; దురిత = పాపముల వల్లఁ గలిగిన; భయ = భీతిని; భంగాయ = భంగము చేయుటకై; భవంతు = అగుఁగాక!

**తాత్పర్యము :** గంగానది సవతి యగుటచేఁ బార్వతి స్పష్టముగాఁ గపటముతోఁ గూడిన క్రీఁగంటి చూపులతోఁ గోపముగాఁ జూచుచున్నది. కోపముతో నున్న పార్వతి చూపు లుదయించుచున్న సూర్యబింబమువలె మిక్కిలి యెఱ్ఱగా నున్నవి. ఆ చూపులకు భయపడిన వేమో యన్నట్లుగా గంగాతరంగములు కొంచెముసేపు కలఁతలను జెందినవి. మఱియు శివుని శిరస్సుపై నర్తించుచుఁ గదలుచున్నవి. గంగానది దేహము నుండి పుట్టినవి యెత్తుగా నెగసిపడుచున్నవి యగు కెరటములు మీయొక్క పాపముల వలనఁ బుట్టిన భయమును నాశనము చేయుఁగాక! లేక మీ పాపములను భయములను గూడఁ బోఁగొట్టుఁగాక!

**విశేషములు :** ఇక్కడ– **'ఉదంచన్మార్తండ'** యను దానికి బదులుగా **'ఉదంచన్మాత్సర్య'** యను పాఠాంతర మున్న దని శ్రీ సదాశివభట్టు సూచించినాఁడు. అప్పుడు గంగానది సవితి యగుటచేఁ బార్వతీదేవి యుదయించుచున్న మాత్సర్యముతోఁ జూచుచున్న దని యర్థము చెప్పుకొనవలయును.

**అవతారిక :** ఇప్పుడు నేను గర్వముతో దేవతల నందఱను దృణప్రాయముగాఁ జూచితిని. నీవు నన్నుఁ గరుణింపనిచో నెవరి ముందు మొఱ పెట్టుకొందు నని చెప్పుచున్నాఁడు–

**శ్లో॥ తవాలమ్బాదమ్బ! స్ఫురదలఘుగర్వేణ సహసా**
**మయా సర్వేఽవజ్ఞాసరణిమథ నీతాః సురగణాః ।**
**ఇదానీమౌదాస్యం భజసి యది భాగీరథి! తథా**
**నిరాధారో హా! రోదిమి కథయ! కేషామిహ పురః ॥ 4**

**ప్రతిపదార్థము :** అంబ = తల్లీ!; భాగీరథి = భగీరథుని కొమార్తె వైన గంగా!; తవ = నీ యొక్క; ఆలంబాత్ = చేయూఁత యున్న దను తలంపుచే; స్ఫురత్ = ప్రకాశించుచున్న; అలఘు = తక్కువ కాని, గర్వేణ = అహంకారముతో, అథ= పిమ్మట; సహసా = విచారింపక; మయా = నా చేత; సురగణాః = గుంపులుగా నున్న దేవతలు; సర్వే = అందఱు; అవజ్ఞా = చులకన భావముతోఁ గూడిన; సరణిమ్ = మార్గమును; నీతాః = పొందింపఁబడినవారు; ఇదానీమ్ = ఇప్పుడు; ఔదాస్యమ్ = ఉదాసీనత్వమును; యది భజసి = నీవు చూపినచో; తదా = అప్పుడు; నిరాధారః = ఏ యాధారము లేని వాఁడనై; ఇహ = ఇక్కడ; కేషామ్ పురః = ఎవరి యెదుట; రోదిమి = ఏడ్చువాఁడను; హా = అయ్యో!; కథయ! = చెప్పుము!

**తాత్పర్యము :** అమ్మా! భాగీరథీ గంగా! నీ యొక్క యాలంబన మున్న దను తలంపుతో హెచ్చిన గర్వముతో నేమియు విచారింపక దేవతల నందఱ నవహేళనగాఁ జూచితిని. నిన్నే నమ్ముకొన్న నన్నిప్పుడు నీవే తటస్థురాలవై తిరస్కారవైఖరితోఁ జూచినచో నయ్యో! యిప్పుడెవరి ముందు మొఱ పెట్టుకొనుచు నిక్కడ రోదింతునో నీవే చెప్పుము. గంగా భక్తుఁడ నగు నన్నే నీవు విడిచి పెట్టినచో నా కేమి గతి యున్నదని భావము.

**విశేషములు :** ఈ శ్లోకము రసగంగాధరములోఁ గావ్యలింగప్రకరణములో నుదాహరింపఁ బడినది –

**"అత్ర నిరాధార ఇత్యాదినాభివ్యక్తే వక్తృనిష్ఠసకలకర్తృకద్వేషే ఆత్మకర్తృకావజ్ఞాపుర పథనయనరూపః సుబన్తార్థవిశేషితస్తిఙన్తార్థ ఉపపాదకః"** ఈ శ్లోకము నందలి రెండవ పాదములోని **'సరణిమథ నీతాః సురగణాః'** అను దానికి– **'పురపథమనీయన్త విబుధాః'**

అను పాఠము రసగంగాధరమునఁ గలదు. ఇక్కడ 'నిరాధారుఁడ'నను దానిచే నభివ్యక్త మైన కవినిష్ఠమగు సకలదేవకర్తృకద్వేషమునందు నాత్మకర్తృకమైన యవజ్ఞాపురపథనయన రూపమగు సుబంతార్థవిశేషము– 'అనీయంత' యను తిఙంతార్థమున కుపపాదక మగుచున్న దని భావము. ఇక్కడ దేవత లందఱు తన్ను ద్వేషించుటకు హేతువు వారి నవజ్ఞాన్వితదృష్టితోఁ జూచుట యని చెప్పుటచేఁ గావ్యలింగమలంకారము.

ఇక్కడనీ సుబంతార్థ – తిఙంతార్థవ్యవహారము వ్యాకరణశాస్త్రమునకు సంబంధించినది. రసగంగాధర మలంకారశాస్త్రమే యైనను వ్యాకరణశాస్త్రచర్చ లెక్కువగాఁ గలవు. సకలశాస్త్రసంప్రదాయరహస్యములు గలవు. పైఁగా లక్షణపరిష్కారములో జగన్నాథకవి నవ్యన్యాయశైలి నాశ్రయించినాఁడు. సాహిత్యమీమాంసాగంధము, కవితావాసన లేని కేవలవైయాకరణులకు, శుద్ధతార్కికులకు నీగ్రంథ మవగతము గాదు. ఈ రసగంగాధరవాక్యములు లఘువివరణములకు లొంగవు. పూర్వాపరసందర్భము పూర్తిగాఁ దెలియనిచో విషయ మంతయు సమగ్రముగా నాకళింపునకు రాదు. లహరీశ్లోకములకు రసగంగాధరముతో నున్న సంబంధమును దెలిపి యభిరుచి కలిగించుటకై యీ వాక్యములను వివరణాత్మకముగాఁ గాక గ్రంథవిస్తర భీతిచే యథాతథముగా ననువదించుచున్నాను. వివిధిషువులగు పాఠకులు సవ్యాఖ్యానముగా రసగంగాధరమును దిలకింతురుగాక!

**అవతారిక :** ఇప్పుడు గంగాజలములు తన పాపములను బోఁగొట్టవలె నని ప్రార్థించుచున్నాఁడు–

**శ్లో॥ స్మృతిం యాతా పుంసామకృతసుకృతానామపి చ యా**
**హరత్యన్తస్తన్ద్రాం తిమిరమివ చన్ద్రాంశుసరణిః ।**
**ఇయం సా తే మూర్తిః సకలసురసంసేవ్యసలిలా**
**మమాన్తః సన్తాపం త్రివిధమపి పాపం చ హరతామ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** ఓ గంగా!; యా = ఎవ్వతె; చంద్ర = చంద్రునియొక్క, అంశు = కిరణములయొక్క; సరణిః = పద్ధతి; తిమిరమ్ ఇవ = చీఁకటినివలె; అకృతసుకృతానామ్ = పుణ్యములు చేయని; పుంసామ్ = పురుషులయొక్క; స్మృతిమ్ = స్మరణమునకు; యాతా = వచ్చినదై; అంతః = లోపల నున్న; తంద్రామ్ = నిద్రను; అపి = కూడ; హరతి = పోఁగొట్టుచున్నదో; సా = ఆమె; సకల = సమస్త; సుర = దేవతలచే; సంసేవ్య = బాగుగా సేవింపఁదగిన; సలిలా = జలముగల; ఇయమ్ = ఈ; తే = నీ యొక్క; మూర్తిః = స్వరూపము; మమ = నాయొక్క; అంతః = లోపలనున్న; సంతాపమ్

= దుఃఖముల వేఁడిమిని; త్రివిధమ్ = మూఁడు విధములుగా నున్న; పాపమ్ = పాపమును; అపి = కూడ; హరతామ్ = హరించుఁగాక!

**తాత్పర్యము :** ఓ గంగా! చంద్రుని కిరణముల పంక్తి చీఁకటిని నాశనము చేసినట్లుగా నెవ్వతె స్మరించినంతనే పుణ్యములు చేయని వారి యంతర్నిద్రను గూడ హరించుచున్నదో యట్టి నీయొక్క సర్వదేవతాపూజ్యమైన జలముగల స్వరూపము నాయొక్క హృదయ సంతాపమును మూఁడు విధములుగా నున్న పాపమును గూడ హరించుఁగాక! యని భావము.

**విశేషములు :** ఇక్కడ **"(త్రివిధమ్"** అను దానిని సంతాపమునకుఁ బాపమునకుఁ గూడ విశేషముగా నన్వయింప వచ్చును. తాప మనఁగా దుఃఖము (1) ఆధ్మాత్మికము (2) ఆధిభౌతికము (3) ఆధిదైవికము నని దుఃఖము మూఁడు విధములు. దీనికే తాపత్రయ మని పేరు.

శ్లో॥ దుఃఖత్రయాభిఘాతాజ్జిజ్ఞాసా తదపఘాతకే హేతౌ ।
దృష్టే సాఽపార్థా చేన్నైకాన్తా త్యన్తతోఽభావాత్ ॥

అని శ్రీమదీశ్వరకృష్ణముని సాంఖ్యకారిక.

'దుఃఖానాం త్రియం దుఃఖత్రమ్ । తత్ ఖలు – ఆధ్యాత్మికమాధిభౌతిక–మాధిదైవికం చ. తత్రాధ్యాత్మికం ద్వివిధం శారీరమ్ మానసం చ. శారీరం వాతపిత్త–శ్లేష్మణాం వైషమ్యనిమిత్తమ్, మానసం కామక్రోధలోభమోహభయేర్ష్యావిషాదవిషయవిశేషా దర్శన నిబన్ధనమ్. సర్వం చైతదాన్తరోపాయసాధ్యత్వాదాధ్యాత్మికం దుఃఖమ్. బాహ్యోపాయసాధ్యం చ దుఃఖం ద్వేధా. ఆధిభౌతికమ్, ఆధిదైవికం చ. తత్రాధిభౌతికమ్ – మానుషపశు సరీసృపస్థావరనిమిత్తమ్. ఆధిదైవికం యక్షరాక్షసవినాయకగ్రహావేశ–నిబన్ధనమ్' – అని శ్రీవాచస్పతిమిశ్రుల సాంఖ్యతత్త్వకౌముది.

(1) ఆధ్యాత్మికము (2) ఆధిభౌతికము (3) ఆధిదైవికము నని దుఃఖము మూఁడు విధములు. ఆధ్మాతికదుఃఖము (1) శారీరము (2) మానసము నని రెండు విధములు. వాతపిత్తశ్లేష్మముల వైషమ్యము వలన నేర్పడు జ్వరాదులు కుఱుపులు పుండ్లు మొదలగునవి శారీరదుఃఖములు. కామము, క్రోధము, లోభము, మోహము, భయము, ఈర్ష్య, విషాదము మొదలగునవి మానస దుఃఖములు. మనుష్యులు, పశువులు, మృగములు, పక్షులు, పాములు, కీటకములు మొదలగు వాని వలనఁ గలుగు దుఃఖ మాధిభౌతికము. గ్రహావేశము, అగ్ని, వాయువు, ఎండ, వాన మొదలగు వాని వలనఁ గలుగు దుఃఖమాధిదైవికము. ఈ త్రివిధసంతాపములను గంగామాత పోఁగొట్టవలయు

నని భావము. మనస్సుచే వాక్కుచేఁ గర్మములచేఁ బుట్టు మూఁడు విధము లగు పాపములను గంగమ్మతల్లి నాశనము చేయవలెనని తాత్పర్యము. కర్మము లనఁగా దేహమువలనఁ బుట్టునవి.

శ్లో॥ యోగేన చిత్తస్య పదేన వాచామ్
మలం శరీరస్య చ వైద్యకేన ।
యోఽపాకరోత్తమ్ ప్రవరమ్ మునీనామ్
పతఞ్జలిమ్ ప్రాఞ్జలిరానతోఽస్మి ॥

శరీరముచేఁ జేయు పాపములను వైద్యశాస్త్రము, వాక్కులచేఁ జేయు పాపములను వ్యాకరణశాస్త్రము, మనస్సుచేఁ జేయు పాపములను యోగశాస్త్రము పోఁగొట్టును. ఈ మూఁడు శాస్త్రములు నక్కఱ లేకుండఁగనే గంగాజలము త్రివిధపాపములను హరించు నని వ్యంగ్యము.

**అవతారిక :** ఇప్పుడు గంగాజలపానము వలనఁ గలిగెడి యానందమహిమను వర్ణించు చున్నాఁడు –

**శ్లో॥ అపి ప్రాజ్యం రాజ్యం తృణమివ పరిత్యజ్య సహసా**
**విలోలద్వానీరం తవ జనని! తీరం శ్రితవతామ్ ।**
**సుధాతః స్వాదీయః సలిలభరమాతృప్తి పిబతాం**
**జనానామానన్దః పరిహసతి నిర్వాణపదవీమ్ ॥ 6**

**ప్రతిపదార్థము :** జనని = తల్లీ! గంగా!; ప్రాజ్యమ్ = విశాలమైన; రాజ్యమ్ అపి = రాజ్యమును గూడ; తృణమ్ ఇవ = గడ్డిపోఁచవలె; సహసా = ఆలోచింపకుండ; పరిత్యజ్య = విడిచి పెట్టి; విలోలత్ = ఊఁగుచున్న; వానీరమ్ = వేతసవృక్షములుగల; తవ = నీయొక్క; తీరమ్ = ఒడ్డును; శ్రితవతామ్ = ఆశ్రయించినవారును; సుధాతః అమృతము కంటెను; స్వాదీయః = రుచికరమైన; సలిలభరమ్ = బరువైన నీటిని (ఎక్కువ నీటిని); ఆతృప్తి = తృప్తి కలుగునంత (దప్పిక తీరు) వఱకు; పిబతామ్ = త్రాగువారు నగు; జనానామ్ = జనుల యొక్క; ఆనందః = ఆనందము (సంతోషము); నిర్వాణపదవీమ్ = మోక్షపదమును; పరిహసతి = పరిహసించుచున్నది.

**తాత్పర్యము :** గంగమ్మతల్లీ! విశాలముగా సముద్రపర్యంతము గల రాజ్యమును గూడ గడ్డిపఱక వలె విచారము లేకుండఁ బరిత్యజించి గాలి కూఁగుచున్న ప్రబ్బలిచెట్లు గల నీ తటము నాశ్రయించి యమృతము వలె రుచిగా నున్న నీ జలము నెక్కువ సంతృప్తి గలుగునట్లుగాఁ గడుపు నిండఁ ద్రావిన జనుల యొక్క యానందము కైవల్యపదవిని

జూచి వేళాకోళము చేయుచు నవ్వుచుండును. సామ్రాజ్యపదవి కంటెను సాయుజ్యపదము కంటెను గంగాజలపానమే యెక్కువ యానందమును గల్గించు నని భావము.

**అవతారిక :** ఇప్పుడు గంగాస్నానమహిమను వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ ప్రభాతే స్నాతీనాం నృపతిరమణీనాం కుచతటీ–**
**గతో యావన్మాతర్మిలతి తవ తోయైర్మృగమదః ।**
**మృగాస్తావద్వైమానికశతసహస్రైః పరివృతా**
**విశన్తి స్వచ్ఛన్దం విమలవపుషో నన్దనవనమ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! గంగా! ప్రభాతే = వేఁకువ జాములో; స్నాతీనామ్ = స్నానము చేయుచున్న; నృపతిరమణీనామ్ = రాజపత్నులయొక్క; కుచతటీగతః = స్తనతటములపై నున్న (గుబ్బల పై భాగమునఁ బూసికొన్న); మృగమదః = కస్తూరి; తవ = నీయొక్క; తోయైః = నీళ్ళతో; యావత్ మిలతి = ఎప్పుడు కలియుచున్నదో; తావత్ = అప్పుడే; మృగాః = కస్తూరి మృగములు; విమలవపుషః = నిర్మలమైన దేహము గలవియై; వైమానికశతసహస్రైః = దేవతాకోటులచే; పరివృతాః = చుట్టఁబడినవై; నందనవనమ్ = స్వర్గలోకమునందలి నందన మను నుద్యానవనము లోనికి; స్వచ్ఛందమ్ = స్వతంత్రముగా; విశంతి = ప్రవేశించుచున్నవి.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! ప్రాతఃకాలములో స్నానము చేయుచున్న రాజకాంతల స్తనములందున్న కస్తూరి యింకను నీ నీళ్ళలోఁ గలిసినదో లేదో యప్పుడే యా కస్తూరి జింకలు దివ్యదేహములను ధరించి నూఱు వేల దేవతల చుట్టుముట్టి కొలుచుచుండఁగా నందనోద్యానములో స్వేచ్ఛగాఁ బ్రవేశించుచున్నవి.

**విశేషములు :** ఇక్కడ **'విమలవపుషః'** అను దానికి **'విమలమతయః'** అను పాఠాంతర మున్నట్లు సదాశివభట్టు పేర్కొనినాఁడు. అప్పుడు నిర్మలమైన బుద్ధి గలవియై యని యర్థము చెప్పుకొనవలయును.

కస్తూరి మృగముయొక్క బొడ్డునుండి కస్తూరి పుట్టుటచే 'మృగనాభి' యని పేరు వచ్చినది. **'మృగనాభి ర్మృగమదః కస్తూరీ'** యని యమరకోశము. వ్యాకరణ మహాభాష్యములో – 'సప్తమ్యధికరణే' (2–3–26) అను సూత్రములో 'నిమిత్తాత్ కర్మసంయోగే' యను వార్తికము దగ్గఱ –

శ్లో॥ చర్మణి ద్వీపినం హన్తి దన్తయోర్హన్తి కుఞ్జరమ్ ।
కేశేషు చమరీం హన్తి సీమ్ని పుష్కలకో హతః ॥

అను ప్రాచీనశ్లోకమును శ్రీపతంజలి భగవాను లుదాహరించినారు. చర్మము కోసము పులిని; దంతముల కోస మేనుఁగును, కేశముల కోసము చమరీ మృగమును జంపుచున్నారు. సీమ కోసమై పుష్కలకము చంపఁ బడిన దని యీ శ్లోకమున కర్థము. ఇక్కడఁ జతుర్థీవిభక్త్యర్థములో సప్తమీవిభక్తికి శ్రీ భట్టోజీదీక్షితులు సిద్ధాంతకౌముదిలో నీ శ్లోకమునే యుదాహరించి – **'సీమాఽ ండకోశః; పుష్కలకో గంధమృగః'** అని యర్థము చెప్పినారు. ఈ యర్థమునకు మూలమును వారే – **ఏతచ్చ దుర్గవాక్యప్రబోధే కులచంద్రేణోక్తమ్'. మేదినీకారోఽ ప్యాహ –**

శ్లో॥ సీమా ఘాటస్థితిక్షేత్రేష్వండకోశేషు చ స్త్రియామ్' – ఇతి,

శ్లో॥ అథ పుష్కలకో గంధమృగక్షపణకీలయోః' – ఇతి చ

హరదత్తాదయస్తు – **"పుష్కలకః శంకుః; సీమ్ని సీమాజ్ఞానార్థం హతో నిహతో నిఖాత' ఇత్యాహుః"** – అని దీక్షితులే మనోరమాశబ్దకౌస్తుభములలోఁ జెప్పినారు. శ్రీవిశ్వేశ్వర పాండేయుని వ్యాకరణసిద్ధాంతసుధానిధిలోఁ గూడ నిట్లే కలదు.

ఇక్కడ హరదత్తవ్యాఖ్యానము సరి యైనది కాదు. దీక్షితవ్యాఖ్యానమే సమంజసమైనది. మూఁడు పాదములలోఁ బులిని; ఏనుఁగును, చమరినిఁ బేర్కొని నాల్గవపాదములో శంకువును జెప్పుట ప్రక్రమ విరుద్ధము. కస్తూరి మృగముల పొత్తికడుపు నుండి కస్తూరి వెలువడుట ప్రత్యక్షసిద్ధము. కస్తూరిమృగములకే కస్తూరిజింక లని, కస్తూరిపిల్లులని, పునుగుపిల్లులని వ్యవహారము. కస్తూరిమృగముల వలెనే కస్తూరి మొక్కలు కూడఁ గలవు. వీని పూవుల నుండి కస్తూరి వాసన గల పదార్థము వెలువడును.

శ్లో॥ యావదస్థి మనుష్యాణాం గంగాతోయేషు తిష్ఠతి ।
తావద్వర్షసహస్రాణి స్వర్గే లోకే మహీయతే ॥

చచ్చిపోయిన వారి యెముకలు గంగాజలములో నెంతకాల ముండునో యంతకాలము వేల సంవత్సరములు వారు స్వర్గలోకములో భోగము లనుభవించుచు నుందు రని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. గంగాస్థినిమజ్జనము, గయాశ్రాద్ధము పితృదేవతోద్ధరణమునకు నియతధర్మములు. అందువల్లనే పాండురంగమాహాత్మ్యము నందలి పుండరీకుని కథలో –

కం॥ పరలోకావాససుఖా
దరపరతన్ జనిన తల్లిదండ్రుల కొసఁగెన్
గురుభక్తి నిగుడు కొడు కతి
కరుణామతి గంగ నస్థి గయఁ బిండంబున్. (పాండు-2-26)

అని తెనాలి రామకృష్ణుఁడు చెప్పినాఁడు. ఈ విషయమును గైకొని జగన్నాథ మహాకవి యద్భుతకల్పనముతో నీశ్లోకమును రచించినాఁడు.

మృగములు గంగలోఁ బడి మరణింప లేదు. వాని శవములు గూడ గంగలోఁ బడలేదు. వాని యస్థులు కూడ గంగలోఁ బడ లేదు. కాని వాని నుండి పుట్టిన కస్తూరి గంగాజలములోఁ గలిసినంతనే యవి దివ్యదేహములతో స్వర్గమును బొందినవి. ఇంక నిత్యము గంగాస్నానము చేయుచు మృతి చెందిన వారి మహిమ నెవరు వర్ణింపఁ గల రని భావము.

ఇక్కడ నలంకారశాస్త్రదృష్టిలో నతిశయోక్తి యలంకారము. ధర్మశాస్త్రదృష్టిలో స్వభావోక్తి యలంకారము.

ఇట్టి యద్భుతకల్పనము రామరాజభూషణుని వసుచరిత్రములోఁ గలదు–

మ॥ హరిమై సాది శిరంబు సాది మెయి జాత్యశ్వోత్తమాంగంబు గూ
డ రణోర్విన్ శ్రీరఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందార వృ
ష్టి రహిన్ బ్రాణయుతంబులై గగనవాటిం బర్వ గంధర్వ కి
న్నరరూపంబులు దాల్చి సారె కవి యానందించుఁ దచ్చౌర్యమున్.
(వసు –1–70)

రఘునాథశౌరి యుద్ధములో ఖడ్గముచే రౌతును గుఱ్ఱమును ఖండింపఁగా రౌతు తల గుఱ్ఱము యొక్క మొండెము మీఁదను; గుఱ్ఱము శిరస్సు రౌతు మొండెము మీఁదను బడి యవి యాకాశమున కెగిరినవి. రఘునాథుని శౌర్యము గాంచి దేవతలు మందారపుష్పములను వర్షింపఁగా నీ వృష్టి కవి సజీవములై గంధర్వ కిన్నరరూపములు దాల్చి దేవతలతోఁ గలిసి యవి కూడ నతని శౌర్యమును గాంచి యానందించిన వని భావము. ఇచ్చట నశ్వదేహము మనుష్య శిరస్సు గల వారు గంధర్వులు; మనుష్య దేహము నశ్వశిరము గలవారు కిన్నరులు నను విషయమును గైకొని భట్టుమూర్తి యిట్లు వర్ణించినాఁడు. ఇవి రెండు నత్యద్భుత కల్పనములు.

ఇక్కడ ముద్రితప్రతులలో నన్ని సంస్కరణము లందును **'ప్రభాతే స్నాతీనామ్'** అను పాఠమే గలదు. శ్రీ సదాశివభట్టు కూడ 'స్నాతీనామ్ అర్థాత్ తవ జలే స్నానం కుర్వతీనామ్' అనియే పీయూషలహరిలో వ్యాఖ్యానించినాఁడు. ఆర్యేంద్రశర్మగారి సంస్కరణములో మాత్రము **'ప్రభాతే స్నాంతీనామ్'** అను పాఠము గలదు. రెండు రూపములును సాధువులే. అదియే యర్థము.

**అవతారిక :** ఇప్పుడు గంగానామము ప్రాణప్రయాణసమయములో నాముఖమునం దుండుఁ గాక! యని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ స్మృతం సద్యః స్వాన్తం విరచయతి శాన్తం సకృదపి**
**ప్రగీతం యత్పాపం ఝటితి భవతాపం చ హరతి ।**
**ఇదం తద్గఙ్గేతి శ్రవణరమణీయం ఖలు పదమ్**
**మమ ప్రాణప్రాన్తే వదనకమలాన్తర్విలసతు ॥ 8**

**ప్రతిపదార్థము :** మాతా గంగా! సకృత్ అపి = ఒక్కమాత్రైనను గూడ; స్మృతమ్ = స్మరించి నంతనే; యత్ = ఏది; స్వాంతమ్ = మనస్సును; శాంతమ్ = శాంతి గల దానిగా; విరచయతి = చేయుచున్నదో; ప్రగీతమ్ = బాగుగా గానము చేసినంతనే; ఝటితి = శీఘ్రముగా; భవతాపం చ = సంసారదుఃఖము వలనఁ గలుగు వేఁడిమిని గూడ; హరతి = హరించు చున్నదో; తత్ = ఆ; ఇదమ్ = ఈ; గంగా ఇతి = గంగా! యను; శ్రవణ = చెవులకు; రమణీయమ్ = ఇంపైన; పదమ్ = శబ్దము; ఖలు = నిశ్చయముగా; మమ = నాయొక్క; ప్రాణ = ప్రాణము యొక్క; ప్రాంతే = సమీపము నందు; లేక; ప్ర + అంతే = ప్రకృష్టముగా నంత్యకాలము నందు; వదనకమల = ముఖపద్మము యొక్క, అంతః = అంత లోపలిభాగమునందు; విలసతు = ప్రకాశించుఁగాక!

తాత్పర్యము : తల్లీ! గంగా! ఒక్కమాత్రైనను గూడ స్మరించెడు వారికి వెంటనే చిత్తశాంతిని గూర్చునదియు, బాగుగా గానము చేసినంతనే శీఘ్రముగా సంసారతాపమును హరించునదియు నగు నా యీ గంగా యను కర్ణపేయమైన శబ్దము నా యొక్క ప్రాణముల దగ్గఱ నుండి నా మోముఁదమ్మిలోఁ బ్రకాశించుఁగాక! ప్రాణములు పోవు సమయములో నేను 'గంగా! గంగా!' యను శబ్దములనే యుచ్చరింపవలయు నని భావము.

**విశేషములు :** యాస్కాచార్యులు నిరుక్తములో **'గమనాద్గంగా'** స్వర్గగమనము గలది గంగ యని వ్యుత్పత్తినిఁ జెప్పినారు. శ్రీశంకరభగవత్పాదాచార్యులు గూడ **'స్వర్గసోపానసంగా'** గంగానది స్వర్గారోహణమునకు మెట్టు వంటి దని చెప్పినారు.

బ్రహ్మాండపురాణములో శ్రీవ్యాసమహర్షి కూడ -

శ్లో॥ తిస్రో నద్యో మహాపుణ్యా వేణా గోదా చ జాహ్నవీ ।
గాం హరీశాంఘ్రికాత్ ప్రాప్తా గంగేతీహ ప్రకీర్తితా ॥

కృష్ణ, గోదావరి, గంగ యను మూఁడు నదులును మహాపుణ్యము లైనవి. శ్రీవిష్ణుచరణము నుండి భూమికి గమించిన దగుటచే నీ పుణ్యనదికి గంగ యని పేరు వచ్చినదని చెప్పినాఁడు. మహాభారతములోఁ గూడ –

శ్లో॥ గీతా గంగా చ గాయత్రీ గోవిందేతి హృది స్థితే ।
చతుర్గకారసంయుక్తే పునర్జన్మ న విద్యతే ॥

(1) గీత (భగవద్గీత) (2) గంగ (3) గాయత్రి (4) గోవింద యను నాలుగు గకారముల నుచ్చరించినచోఁ బునర్జన్మ ముండ దని చెప్పినాఁడు. అందువలననే గంగాభక్తుఁడగు జగన్నాథుఁడు ప్రాణోత్క్రమణసమయములో నా యాస్య జలజములో 'గంగా' యను శబ్ద ముండుఁగాక! యని ప్రార్థించినాఁడు.

**అవతారిక :** ఇప్పుడు గంగలో నిత్యము స్నానము చేసెడి కాకులు కూడ నింద్రపదవి నాకాంక్షింప వని చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ యదన్తః ఖేలన్తో బహుళతరసన్తోషభరితా–**
**న కాకా నాకాధీశ్వరనగరసాకాంక్షమనసః ।**
**నివాసాల్లోకానాం జనిమరణశోకాపహరణం**
**తదేతత్తే తీరం శ్రమశమనధీరం భవతు నః ॥** **9**

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా!, కాకాః = కాకులు; యత్ = దేనియొక్క; అంతః = ప్రవాహములో; ఖేలంతః = ఆడుచున్నవియై; బహుళతర = మిక్కిలి యెక్కువ యైన; సంతోష = ఆనందముతో; భరితాః = నిండినవియై; నాక + అధి + ఈశ్వర = స్వర్గమున కధిపతి యైన యింద్రుని యొక్క; నగర = పట్టణమైన యమరావతిపై; స + ఆకాంక్ష = కోరికతోఁ గూడిన; మనసః = మనస్సు కలవి; న = కావో; నివాసాత్ = దేని ప్రక్క నివసించుట వలన; లోకానామ్ = జనుల యొక్క; **'లోకస్తు భువనే జనే'** యని యమరము; జని = పుట్టుక; మరణ = చావు వలనఁ గల్గిన; శోక = ఏడుపును; హరణమ్ = నాశనము చేయునది; యత్ = ఏది గలదో; తత్ = ఆ; ఏతత్ = ఈ; తీరమ్ = నీ యొడ్డు; నః = మా యొక్క; శ్రమ = కష్టములను; శమన = శాంతింపఁ జేయుటలో; ధీరమ్ = ధైర్యము గలది; భవతు = అగుఁ గాక!

**తాత్పర్యము :** తల్లీ! గంగా! దేని ప్రవాహములో దివ్యానందభరితములై కాకులు క్రీడించుచు నింద్రునకు నివాసమైన యమరావతిని గూడఁ గోరుట లేదో, దేని ప్రక్క నివసించుట వలన జనులకు జననమరణముల వలనఁ గలిగిన దుఃఖము నశించుచున్నదో యట్టి నీ తటము మాయొక్క కష్టములను బోఁగొట్టుటలో ధైర్యము గలది యగుఁ గాక! తల్లీ! నీ తీరనివాసమువల్లనే కష్టముల నన్నింటిని గడచి గట్టెక్కుచున్నామని భావము.

**విశేషము : 'బహుళతర'** యనుచోట నతిశయార్థములోఁ 'దరప్' ప్రత్యయము వచ్చినది.

పూర్వమొకానొకప్పుడు గంగాతీరమునం దాడుచున్న కాకులను జూచి విమానస్థుఁ డగు నింద్రుఁడు మీరు మా నందనవనమునకు వచ్చి క్రీడింపుఁడని పల్కఁగా నాకాకులు మే మిక్కడే నివసింతుము గాని గంగాతీరమును విడిచి పెట్టి నీ వనమునకు రామని తిరస్కరించి చెప్పినట్లుగా 'గంగాపురాణము'లో నున్న కథ యిక్కడ ననుసంధేయము.

**అవతారిక :** ఇప్పుడు గంగారూపమును బ్రహ్మస్వరూపముగా స్తుతించుచున్నాఁడు –

**శ్లో॥ న యత్ సాక్షాద్వేదైరపి గలితభేదైరవసితం**
**న యస్మిఞ్జీవానామ్ ప్రసరతి మనోవాగవసరః ।**
**నిరాకారం నిత్యం నిజమహిమనిర్వాసితతమో**
**విశుద్ధం యత్తత్త్వం సురతటిని! తత్త్వం న విషయః ॥ 10**

**ప్రతిపదార్థము :** సురతటిని! = దేవనదీ! గంగా!; యత్ = ఏది; గలితభేదైః = పోయిన భేదములు గలవానిచే ననఁగా నద్వైతప్రతిపాదకము లైన వానిచే; **'ఏక మేవాద్వితీయమ్ బ్రహ్మ'** రెండవ వస్తువు లేని బ్రహ్మ మొక్కటియే యున్నది, **'నేహ నానాస్తి కించన'** ఇక్కడ నానారూపముతో భాసించున దేదియు లేదని శ్రుతివాక్యము లన్నియు నద్వైతమునే ప్రతిపాదించుచున్న వని భావము. సాక్షాత్ = ప్రత్యక్షముగా; వేదైః = వేదములచేత; అపి = కూడ; న అవసితమ్ = నిశ్చితము గాదో; బ్రహ్మమును గూర్చి వేదములు కూడ నిదమిత్థముగాఁ జెప్పలేక పోవుచున్న వని భావము. యస్మిన్ = దేని యందు; జీవానామ్ = ప్రాణుల యొక్క; మనః = మనస్సు యొక్క; వాక్ = మాటయొక్క; అవసరః = వ్యాపారము; న ప్రసరతి = ప్రసరించుట లేదో; **'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ'** మనస్సుతోఁగూడిన వాక్కులు దేనిని జేర లేక వెనుకకు మఱలుచున్నవో యది బ్రహ్మ మను శ్రుతివాక్యముచే బ్రహ్మము మనోవాక్కుల కగోచరమైన దని భావము. నిరాకారమ్ = ఆకారము లేనిది; 'అపాణిపాదమ్' ఆ బ్రహ్మమునకుఁ గాళ్ళు గాని చేతులు గాని శరీరము గాని లేవని శ్రుతులు చెప్పుచున్నవని భావము. నిత్యమ్ = సర్వకాలములందు నుండునది; **'న జాయతే మ్రియతే వా కదాచిత్'** ఆ బ్రహ్మమునకుఁ బుట్టుక గాని చావు గాని లేవని వేదములు చెప్పుచున్న వని భావము. నిజ = తన యొక్క; మహిమ = గొప్పతనముచే; నిర్వాసిత = పోఁగొట్టఁబడిన; తమః = చీఁకటి గలది; **'యస్య భాసా సర్వమిదం విభాతి'** దేని యొక్క కాంతిచే నీ సర్వము భాసించుచున్నదో యది బ్రహ్మమని శ్రుతియు –

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ (భ.గీ.15-12)

ఏ సూర్యగతమైన కాంతిచే నీ సర్వజగత్తు భాసించుచున్నదో, చంద్రుని యందు నగ్నియందు నేకాంతి గలదో యాకాంతి యంతయు నాదే యని తెలిసికొను మని గీతా స్మృతియుఁ బరబ్రహ్మము స్వయంప్రకాశమైన; తత్త్వమ్ = తత్త్వమో యనఁగా బ్రహ్మస్వరూపమో; తత్ = అది; త్వమ్ = నీవై యున్నావు; విషయః = ఇంత కంటె విషయము (ఇంత కంటె నీతోఁ బోలున దేదియు); న = లేదు.

**తాత్పర్యము :** సురనదీ! గంగా! యేది యద్వైతప్రతిపాదకములైన వేదములచేఁ గూడ 'నిది యిట్టి' దని నిర్వచించుటకు వీలులేక యనిర్వచనీయమై యున్నదో, దేని యందు జీవుల మనోవాక్కులు ప్రసరింప లేకుండ నున్నవో, దేని కాకారము లేదో, యేది నిత్య మైనదో, యేది తన మాహాత్మ్యముచేఁ జీఁకటులను బోఁగొట్టి స్వప్రకాశముగా నున్నదో, యేది మాయారహితమై విశుద్ధముగా నున్నదో యట్టి తత్త్వస్వరూపమైన బ్రహ్మము నీవే యైయున్నావు. ఇంత కంటె వేఱొక విషయము లేదు. నీతోఁ బోల్చుటకు బ్రహ్మము తప్ప మఱొక్క టేదియు లేదని భావము. బ్రహ్మము నిరాకారమై ప్రత్యక్షగోచరము గాక యున్న దనియు గంగమాత్రము సాకారమై ప్రత్యక్ష మగుచున్న దని బ్రహ్మము నిర్గుణస్వరూప మనియు గంగ సగుణబ్రహ్మ మనియుఁ బరమతాత్పర్యము.

**విశేషములు :** శ్రీనారాయణతీర్థసరస్వతీస్వామి కూడ గంగయే యద్వితీయ బ్రహ్మ మని యిట్లు వర్ణించినాఁడు.

శ్లో॥ న నానేహాస్తీతి శ్రుతివచనజాతైర్భగవతీ
నిరస్యై వా భాసి స్వయమఖిలభేదం సురధుని! ।
చిదాత్మైకా నిత్యా చితిసుఖసదావిష్కృతిరసి
త్వదీయం మోక్షార్థం శ్రయతి జనతా జీవనపదమ్ ॥

దేవనదీ! గంగా! **'నేహ నానాస్తి'** యిక్కడ నానాస్వరూపముతో భాసించున దేదియు లేదు - అను నుపనిషద్వాక్యసమూహముచే స్వయముగా సమస్త భేదమును నిరసించి భగవతివై నీవే ప్రకాశించుచున్నావు. చిదాత్మవు, నేకవు, నిత్యవు, సదా చైతన్యానందావిష్కృతివి నీవే. జను లందఱు జీవనపదమైన నిన్నే మోక్షము కొఱ కాశ్రయించుచున్నారు. ఈ భావమే పై శ్లోకములోఁ జెప్పఁబడినది.

కర్మ - బ్రహ్మప్రతిపాదకమై యపౌరుషేయమైన ప్రమాణవాక్యమునకు **వేద** మని పేరు. ఆ వేదము (1) మంత్రము (2) బ్రహ్మణము నని రెండు విధములు.

అనుష్ఠానకారకభూతము లగు ద్రవ్యములను దేవతలను దెలియఁ జెప్పునవి మంత్రములు. అవి ఋగ్ – యజు – స్సామ భేదముచే మూఁడు విధములు. పాదబంధ గాయత్ర్యాదిచ్ఛందోవిశిష్టము లగు **'అగ్నిమీళే'** మొదలగు నవి ఋక్కులు. గీత విశిష్టములైన ఋక్కులే సామములు. **'అగ్న ఆయాహి వీతయే'** మొదలగునవి. ఈ రెంటికి విలక్షణముగా గద్యాత్మకములైన **'ఇషే త్వోఽర్జే'** మొదలగు మంత్రములు యజుస్సులు. నాల్గవది **"యే త్రిషప్తాః పరియంతి విశ్వరూపాణి బిభ్రతః" 'శం నో దేవీ రభీష్టయే'** మొదలగు మంత్రములతో నున్నది యథర్వవేదము. బ్రాహ్మణము కూడ (1) విధిరూపము (2) అనువాదరూపము (3) ఉభయ విలక్షణము నని మూఁడు విధములు. యజ్ఞము చేయు నప్పుడు (1) హౌత్రమునకు ఋగ్వేదము (2) ఆధ్వర్యవమునకు యజుర్వేదము (3) ఔద్గాత్రమునకు సామవేదము (4) బ్రహ్మత్వమునకు శాంతిపౌష్టికకర్మములకు నథర్వవేదము నుపయోగపడును. ఈ నాల్గువేదములు కర్మమార్గమును బోధించుచున్నవి. వీని చివర నున్న యుపనిషత్తులు బ్రహ్మమార్గమును బోధించుచున్నవి. ఈ యుపనిషన్మహావాక్యముల కద్వైతబ్రహ్మము నందే తాత్పర్యము.

**'నేహనానాస్తి'** యను శ్రుతు లన్యనానాత్వమునే నిషేధించుచు నితరాభావమును బోధించుచున్నవి గాని తమయొక్క యభావమును బోధించుట లేదు గదా! అప్పుడద్వైతసిద్ధి యెట్లు గల్గు నన్నచో నది సరిగాదు. ఆ వాక్యములకుఁ దమయందుఁ గూడఁ బ్రవృత్తి యుండుటచే వేదనానాత్వము లేదు. లేక వేదమే బ్రహ్మ మగుటచే ద్వైతము లేదు.

**అవతారిక :** ఇప్పుడు గంగకు సాటియైన దేదియు లేదని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ మహాదానైర్ధ్యానైర్బహువిధవితానైరపి చ య-**
**న్న లభ్యం ఘోరాభిః సువిమలతపోరాశిభిరపి ।**
**అచిన్త్యం తద్విష్ణోః పదమఖిలసాధారణతయా**
**దదానా కేనాఽసి త్వమిహ తులనీయా కథయ నః ॥ 11**

**ప్రతిపదార్థము :** ఓ గంగా! మహాదానైః = గొప్ప గొప్ప దానములచేతను; ధ్యానైః = ధ్యానముల చేతను; చిత్తైకాగ్రతతోఁ జేయు భగవత్స్మరణము ధ్యానము; అపి చ = ఇంకను; బహువిధ = అనేకప్రకారములైన; వితానైః = క్రతువుల చేతను; **'క్రతువిస్తారయో రస్త్రీ వితానమ్'** అని యమరము. ఘోరాభిః = భయంకరములైన; ఇది తపోరాసులకు విశేషణము. సు = శోభనములైన; విమల = నిర్మలములైన; తపః రాశిభిః అపి = తపస్సుల సమూహముల చేతను గూడ; యత్ = ఏది; న లభ్యమ్ = లభ్యము కానిదో; అచింత్యమ్ = చింతించుటకు వీలులేని; విష్ణోః = శ్రీమన్నారాయణునియొక్క, పదమ్ = పాదమును లేక స్థానమును; అఖిల = అందఱకు, సాధారణతయా = సమానముగా;

దదానా = ఇచ్చుచున్న; త్వమ్ = నీవు; ఇహ = ఇక్కడ; కేన = దేనితో; తులనీయా = తూఁపఁదగినదానవై; అసి = ఉన్నావో; తత్ = ఆ విషయమును; నః = మాకు; కథయ = చెప్పుము.

**తాత్పర్యము :** ఓ గంగాదేవీ! గొప్ప గొప్ప దానములచేఁ గాని, యోగాభ్యాసముతోఁ గూడిన భగవద్ధ్యానముల చేతఁ గాని, యనేకవిధములైన యజ్ఞములచేతఁ గాని, లేక భయంకరమైన తపోరాశుల చేతఁ గాని పొందుటకు శక్యము గాని యాలోచించుటకు శక్యము గాని శ్రీవిష్ణుపదమును (వైకుంఠమును) సకలజనులకు సమానముగా నొసఁగుచున్న నీవు దేనితోఁ బోల్పఁదగిన దానవో మా కిక్కడఁ జెప్పుము. మోక్షము నిచ్చుటలో గంగతో సాటియైన దేవత యేదియు లేదని భావము. లేక; కేన = బ్రహ్మతో; **'మారుతే వేధసి బ్రధ్నే పుంసి కః'** అని యమరము. లేక; కేన = బ్రహ్మముతో; **'కం బ్రహ్మ'** అని శ్రుతి; **'కం శిరోఽమ్బు సుఖే క్లీబమ్'** అని నానార్థరత్నమాల; తులనీ యాసి = పోల్పఁదగిన దానవా? యని కూడ నర్థము చెప్పుకొనవచ్చును.

**విశేషములు : 'తద్విష్ణోః పరమమ్ పదం సదా పశ్యంతి సూరయః'** ఆ మహావిష్ణువు యొక్క పరమపదము నెల్లప్పుడు పండితులు చూచుచున్నారని వేదము చెప్పుచున్నది. పండఁబాఱిన పండ (ఆత్మవిషయబుద్ధి) గల వారికే విష్ణుపదము లభ్యము గాని యితరులకు లభ్యము గాదని దీనినిబట్టి తెలియుచున్నది. కాని గంగలోఁ బండితులు పామరులు నందఱును స్నానము చేయుదురు. గంగానది విష్ణుపాదోద్భవ. అనఁగా శ్రీమహావిష్ణువు పాదముల నుండి పుట్టినది. కావున విష్ణుపదము నిచ్చుటలో గంగయే సమర్థురాలు. గంగానది వీరు పండితులు వీరు పామరులు నను నుచ్చనీచభావము లేకుండ సర్వులకు శ్రీవిష్ణుపదమును బ్రసాదించుచున్న దని భావము.

**అవతారిక :** ఇపుడు గంగాదర్శనమాహాత్మ్యమును గొనియాడుచున్నాఁడు –

**శ్లో॥ నృణామీక్షామాత్రాదపి పరిహరన్త్యా భవభయం**
**శివాయాస్తే మూర్తేః క ఇహ మహిమానం నిగదతు ।**
**అమర్షమ్లానాయాః పరమమనురోధం గిరిభువో**
**విహాయ శ్రీకణ్ఠః శిరసి నియతం ధారయతి యామ్ ॥ 12**

**ప్రతిపదార్థము :** ఓ శుభప్రసూ! గంగాదేవీ! నృణామ్ = నరులకు; ఈక్షామాత్రాత్ = దర్శనమాత్రముచేతనే; భవభయమ్ = సంసారభయమును; అపి = కూడ; పరిహరంత్యాః = పరిహరించుచున్న దానవు. అమర్ష = కోపముతో; మ్లానాయాః = వాడిపోయిన; గిరిభువః = గిరిజ యగు పార్వతి యొక్క; పరమమ్ = ఉత్కృష్టమైన; అనురోధమ్ =

అనుసరించుటను; విహాయ = విడిచిపెట్టి; శ్రీకంఠః = శివుఁడు; యామ్ = ఎవతెను; నియతమ్ = నియమముగా (ఎల్లప్పుడు); శిరసి = తలపై; ధారయతి = ధరించుచున్నాఁడో యట్టి; శివాయాః = శివునిభార్య వగు, శివము లనఁగా శుభములు. శివములను గూర్చునది శివ; లేక శివ మనఁగా మోక్షము = మోక్షము గలది శివ. తే = నీయొక్క; మూర్తేః = మూర్తి (స్వరూపము) యొక్క; మహిమానమ్ = గొప్పతనమును; ఇహ = ఇక్కడ; కః = ఎవఁడు; నిగదతు = చెప్పఁగలఁడు?

**తాత్పర్యము :** చూచినంత మాత్రముననే నరుల సంసారభీతిని బోఁగొట్టునది, శివ స్వరూపిణి యగు నెవ్వతెను కోపముచే వాడిపోయిన పార్వతీదేవిని గూడ లెక్కచేయక పరమశివుఁడు తలపై ధరించుచున్నాఁడో యట్టి నీ విగ్రహముయొక్క మాహాత్మ్యము నెవఁడు చెప్పఁగలఁడు? ఎవ్వఁడును వర్ణింపఁజాలఁడని భావము. మిక్కిలి విలువ గల వజ్రాదులను దలపై ధరించుట లోకములోఁ బ్రసిద్ధము గావునఁ బార్వతి కంటెను గంగయే విలువ గలది యని భావము.

**విశేషములు :** శివాశబ్దము పార్వతీదేవి యందు రూఢము. **'శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమంగళా'** యని యమరకోశము. ఆమెకు సవతియై శివునకు భార్య యగుటచే గంగాదేవి కూడ శివయైనది. శ్రీ యనఁగా విషము. **శ్రీర్వేషరచనా శోభా సంప త్సరళశాఖిషు । వాణీ లక్ష్మ్యో లవంగేషు విషే బిల్వేఽ పృథ త్రిషు ॥** అని నానార్థరత్నమాల. విషకంఠుఁ డగు శివుఁడే నిన్ను నెత్తి కెక్కించు కొనుచున్నాఁ డనఁగా నమృతకంఠు లగు దేవతలు నిత్యము స్నానము చేయుచు నిన్నుఁ దలఁ దాల్చుటలో నాశ్చర్యమే మున్న దని ధ్వని **'గంగే! త్వద్దర్శనాన్ముక్తిః న జానే స్నానజమ్ ఫలమ్'** గంగా! నీ దర్శనము వల్లనే ముక్తి లభించుచున్నది. ఇంక స్నానఫలమేమి చెప్పఁగలనని పురాణవచనము.

**అవతారిక :** ఇప్పుడు గంగాదేవి పాపనాశిని యని వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ వినిన్ద్యాన్యున్మత్తైరపి చ పరిహార్యాణి పతితై-**
**రవాచ్యాని వ్రాత్యైః సపులకమపాస్యాని పిశునైః ।**
**హరన్తీ లోకానామనవరతమేనాంసి కియతాం**
**కదాప్యశ్రాన్తా త్వం జగతి పునరేకా విజయసే ॥ 13**

**ప్రతిపదార్థము :** అమ్మా! గంగా! ఉన్మత్తైః = పిచ్చివారిచే; వినింద్యాని = విశేషముగా నిందింపఁదగినవి; అపి చ = మఱియును; పతితైః = పాపాత్ములచే; పరిహార్యాణి = పరిహరింపఁదగినవి; వ్రాత్యైః = సంస్కారహీనులచే; అవాచ్యాని = చెప్పఁదగనివి;

పిశునైః = దుర్జనులచే; సపులకమ్ = ఒంటినిండcబులకలుపుట్టునట్లుగా; అపాస్యాని = విడిచిపెట్టc దగినవి; ఇవి యన్నియుc బాపములకు విశేషణములు. లోకానామ్ = లోకులయొక్క; కియతామ్ = లెక్కింప లేనన్ని, ఏనాంసి = పాపములను; అనవరతమ్ = ఎల్లప్పుడు; హరన్తీ = హరించుచున్న దానివై; కదాపి = ఎప్పుడును గూడ; అవిశ్రాంతా = విశ్రాంతి నొందని; త్వమ్ = నీవు; ఏకా = ఒక్కర్తెవే; పునః = ఇంకను; జగతి = లోకములో; విజయసే = సర్వోత్కృష్టముగా వర్తించుచున్నావు.

**తాత్పర్యము :** పిచ్చివారిచేc గూడ విశేషముగా నిందింపcదగినవి; మఱియుc బాపులచే గూడc బరిహరింపc దగినవి; నామకరణాది సంస్కారములు కూడ లేని వ్రాత్యులచేc గూడ నిందింపc దగినవి; దౌర్జన్యము చేయు పిశునులచే నొడలు గగురుపొడుచు విధముగా సంతోషముతో విడువc దగినవి యీ విధముగా లోకము నందలి జనులచేc జేయcబడుచున్న లెక్క లేని పాపముల నెల్లప్పుడు హరించుచు నెప్పుడు విశ్రాంతి గైకొనని నీ వొక్కతవే లోకములో విజయమును గైకొనుచున్నావు. పిచ్చివారు, పతితులు, వ్రాత్యులు, పిశునులు గూడc జేయలేని మహాపాపములను గంగమ్మ తన నీళ్ళతోc గడిగి వేయుచున్నది. లోకములో నొక మహాకార్యమును బెక్కుమంది కలిసి చేసినను నలసట పొందుదురు. గంగ యొక్కతెయే యిందఱ పాపములనుc బోcగొట్టుట యను మహాకార్యము నెల్లప్పుడు చేయుచున్నను నలయుట లేదు. మహాపాపములను రూపుమాపుటలో గంగను మించిన వారు లేరని భావము.

ఈ శ్లోకము రసగంగాధరములోc గావ్యలింగప్రకరణములో నుదాహరింపc బడినది – **అత్ర హ్యనన్యసాధారణతయా ప్రతిపాదితస్య భగవత్యా భాగీరథ్యా ఉత్కర్ష స్యాప్యాతతోఽ ఘటమానస్యోపపాదనాయానవరతసకలలోకపాపసమానాధికరణః శ్రమాభావః సుబన్తమాత్రార్థ విశేషితః । సుబన్తార్థో విశేషవపుర్హేతుత్వే నోపాత్తః ॥**

ఈ శ్లోకములో ననన్యసాధారణత్వముగా బ్రతిపాదింపcబడిన భగవతియగు భాగీరథి యొక్క యుత్కర్షము (గొప్పతనము) నుపపాదించుటకై యెల్లప్పుడు సకలలోక పాపహరణసమానాధికరణమైన (ఒకే యాశ్రయముగల) శ్రమాభావము సుబంతమాత్రార్థ విశేషితమైన సుబంతార్థము విశేషవపుర్హేతుత్వముగా నుపాత్త మైనది. ఇక్కడ **'అశ్రాంతా'** యను సుబంతార్థము హేతువుగాc గైకొనcబడినది గాని తిఙంతార్థములతో మిశ్రితము గాలేదని భావము.

**అవతారిక :** ఇప్పుడు గంగాదేవి గుణములను బొగడుచున్నాcడు –

**శ్లో॥ స్ఖలన్తీ స్వర్లోకా దవనితలశోకాపహృతయే**
**జటాజూటగ్రన్థౌ యదసి వినిబద్ధా పురభిదా ।**
**అయే! నిర్లోభానా మపి మనసి లోభం జనయతాం**
**గుణానా మేవాయం తవ జనని! దోషః పరిణతః ॥ 14**

**ప్రతిపదార్థము :** అయే! జనని! = ఓ తల్లీ! గంగా! అవనితల = భూలోకము యొక్క; శోక = రోదనమును (ఏడుపును); అపహృతయే = అపహరించుటకై (పోఁగొట్టుటకై); స్వః లోకాత్ = స్వర్గలోకము నుండి; స్ఖలంతీ = క్రిందకు జాఱుచున్న దానివై; పురభిదా = త్రిపురాసురుల పురములను భేదించిన శివునిచే; జటాజూటగ్రంథౌ = జటాజూటము యొక్క ముడిలో; వినిబద్ధా = ఎక్కువగా బంధింపఁబడి; యత్ అసి = నీవు వున్నా వన్నచో; తత్ = అది; నిర్లోభానామ్ అపి = లోభము లేని శివుని వంటి వారికిఁ గూడ; లోభమ్ = లోభమును (పిసినితనమును); జనయతామ్ = పుట్టించుచున్న; తవ = నీ యొక్క; గుణానామ్ ఏవ = సుగుణములయొక్క ఫలితమే; అయమ్ = ఈ; దోషః = దోషముగా; పరిణతః = పరిణమించినది.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! భూలోకములో దుఃఖములతో నేడ్చుచున్న జనుల శోకమును మాన్పుటకై స్వర్గలోకమునుండి క్రిందికి దిగి జాఱుచున్న నిన్ను శివుఁడు తనయొక్క జడలు కట్టిన కొప్పు ముడిలో బంధించుచున్నాఁ డన్నచో నది శివుని దోషము గాదు. ఏ లోభము లేని శివుని వంటి వాని మనస్సులోఁ గూడ లోభమును బుట్టించుచున్న నీ యందలి సుగుణముల యొక్క దోషము. నీ మంచి గుణములు చేసిన దోషము వల్లనే నీకు శివజటాజూటములో బంధనము ప్రాప్తించిన దని భావము.

**విశేషములు :** లోకములో మంచి వారి గుణగణములు కూడ లోభులకు లోభమును గల్గించి దోషములుగా మాఱుచున్నవి. ఇట్టి భావమే శ్రీజయదేవుని ప్రసన్నరాఘవ నాటకములోఁ గలదు.

శ్లో॥ స్వసూక్తీనామ్ పాత్రం రఘుతిలకమేకం కలయతాం
కవీనాం కో దోషః? స తు గుణగణానామవగుణః ।
యదా తైర్నిశ్శేషైరపరగుణలుబ్ధైరివ జగ-
త్యసావేకశ్చక్రే సతతసుఖసంవాసవసతిః ॥ (ప్ర.రా. 1-12)

ఇంత మంది శ్రీరామకథలను రచించుచు శ్రీరామచంద్రు నొక్కనే తమ సూక్తులకుఁ బాత్రముగాఁ జేయుచున్నా రన్నచో నది కవుల దోషము కాదు. శ్రీరామచంద్రుని గుణగణముల యొక్క యవగుణము (దోషము). ఎందువల్ల ననఁగా

నింక నెవ్వరికి మిగులకుండఁ దనలో నున్న మంచి గుణములచేఁ బరులకు లోభమును గలిగించి యా శ్రీరామచంద్రుఁ డొక్కఁడే యీలోకములో నెల్లప్పుడు సుఖముగా నివసించుటకుఁ గల వసతి నేర్పాటు చేసినాఁ డని భావము.

ఈ శ్లోకము రసగంగాధరములో లేశాలంకారప్రకరణములో నుదాహరింపఁ బడినది. అనిష్టసాధనత్వముచే గుణమును దోషముగా; నిష్టసాధనత్వముచే దోషమును గుణముగా వర్ణించుట లేశాలంకారము. **"అత్ర దోషో౾ పరాధః. తథా చాపరాధత్వేన గుణానాం దోషత్వముక్తమ్ భవతి. న చాయమలంకారో వ్యాజస్తుత్యా** ఉభయరూపయా గతార్థ ఇతి శంక్యమ్. ముఖప్రతిపాదితార్థవైపరీత్యేనాత్ర సర్వత్ర పర్యవసానాభావాత్. **'స్ఖలంతీ స్వర్లోకాత్'** ఇతి పద్యే భాగీరథీ స్తుతిప్రకరణపఠితే యద్యస్తి భాగీరథీస్తుతౌ తాత్పర్యం **తదా వ్యాజస్తుతి రప్యస్తు. తస్యాః పావకాశత్వేనైతద్బాధకత్వాయోగాత్. అత ఏవ లేశో౾పి న వ్యాజస్తుతేర్బాధక ఇతి ప్రాగుక్తజాహ్నవీస్తుతౌ ద్వయోరపి సమావేశః"**

ఈ శ్లోకములో దోషశబ్దమున కపరాధ మని యర్థము. ఇక్కడ నపరాధత్వముచే గంగాదేవి గుణములకు దోషత్వము చెప్పఁబడినది. కావున లేశాలంకారము. ఈ యలంకారము స్తుతినిందారూపమగు వ్యాజస్తుతిలో నంతర్భవించు నని శంకింపఁ గూడదు. స్తుతివలన నింద, నిందవలన స్తుతి గమ్యమాన మగుచో వ్యాజస్తుతి యగును. గుణమును దోషముగా, దోషమును గుణముగా వర్ణించినచో లేశాలంకారము. కావున లేశము వ్యాజస్తుతిలో నంతర్భవింపదు. ఇక్కడఁ బ్రారంభములోఁ బ్రతిపాదించిన యర్థమునకు విపరీతముగా మఱియొక యర్థము పర్యవసించుట లేదు. కావున నిది లేశాలంకారమునకే యుదాహరణము. ఈ పద్యము భాగీరథీస్తుతిప్రకరణమగు గంగాలహరిలోఁ బఠింపఁ బడుటచేఁ గవికి భాగీరథీస్తుతి యందే తాత్పర్య మన్నచో నిక్కడ వ్యాజస్తుతిని గూడ నంగీకరింపవచ్చును. ఈ వ్యాజస్తుతి లేశమునకు బాధకము గాదు. అట్లే యీ జాహ్నవీస్తుతి లోని లేశాలంకారము వ్యాజస్తుతికిఁ గూడ బాధకముగాదు గావున నీ రెండింటి సమావేశము నిందుఁ గలదు.

**అవతారిక :** ఇప్పుడు సర్వరక్షణమునకు గంగాదేవియే మం దని వర్ణించుచున్నాఁడు–

**శ్లో॥ జడానన్ధాన్ పఙ్గూన్ ప్రకృతిబధిరానుక్తివికలాన్**
**గ్రహగ్రస్తానస్తాఖిలదురితనిస్తారసరణీన్ ।**
**నిలిమ్పైర్నిర్ముక్తానపి చ నిరయాన్తర్నిపతితాన్**
**నరానమ్బ! త్రాతుం త్వమిహ పరమమ్ భేషజమసి ॥ 15**

**ప్రతిపదార్థము :** అంబ! = తల్లీ! గంగా! జడాన్ = చైతన్యము లేని జడులను; అంధాన్

= గ్రుడ్డివారిని; పంగూన్ = కుంటివారిని; ప్రకృతిబధిరాన్ = పుట్టు చెవిటి వారిని; ఉక్తి వికలాన్ = మాట లేని మూఁగ వారిని; గ్రహగ్రస్తాన్ = గ్రహములచేఁ బట్టువడి పీడింపఁబడిన వారిని; అస్త = అస్తమించిన; ఇది సరణికి విశేషణము. అఖిల = సమస్తము లైన; దురిత = పాపములను; నిస్తార = దాఁటుటకు; సరణీన్ = మార్గము గల వారిని; పాపముల నతిక్రమించుటకు దారి లేని వారి నని యర్థము. అనఁగాఁ బాపములకుఁ బ్రాయశ్చిత్తముల నాచరింపని వారి నని భావము. నిలింపైః = దేవతలచే; నిర్ముక్తాన్ = విడిచిపెట్టఁబడిన వారిని; అపి చ = మఱియును; నిరయ = నరకము యొక్క; అంతః = మధ్యభాగములో; నిపతితాన్ = పడుచున్నవారిని; నరాన్ = మనుజులను; త్రాతుమ్ = రక్షించుటకు, ఇహ = ఇక్కడ; త్వమ్ = నీవే; భేషజమ్ = మందు; అసి = అయియున్నావు.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! తెలివి లేని వారిని గ్రుడ్డివారిని, కుంటివారినిఁ బుట్టుకతోఁ జెవిటివారిని, నోరున్నను మాట రాని మూకులను, గ్రహములచేఁ బట్టువడిన వారిని, పాపములు చేసి వాని నుండి బయటపడుటకుఁ ద్రోవలేని వారిని భక్తిలేక దేవతలచే విడిచిపెట్టఁబడిన వారిని, మఱియు నరకలోకమధ్యములోఁ బడుచున్నవారిని నిటువంటి నరులను గాపాడుట కీలోకములో నీవే గొప్ప మందుగా నున్నావని భావము. సమస్త పాప రోగములకు గంగాజలమే పరమౌషధ మని తాత్పర్యము.

**విశేషములు :** శ్లో॥ శరీరే జర్జరీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే ।
ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః ॥

శరీరము శిథిలమై కళేబరము జబ్బులచే బ్రింగఁబడి చచ్చుటకు సిద్ధముగా నున్న వారికి గంగాజలము గోవిందనామస్మరణము తప్ప మూఁడవ మందు లేదని పురాణవచనము.

భిషక్కులనఁగా వైద్యులు. భేషజమనఁగా మందు. భైషజ్యమనఁగా వైద్యము (చికిత్స) భేషజశబ్దమునకు మందనియే యర్థము. **'భేషజౌషధభైషజ్యాన్యగదో జాయు రిత్యపి'** అని యమరకోశము. మన తెలుఁగు దేశములో మాత్రము 'వానికి భేషజ మెక్కువ' మొదలగు వాక్యములలో భేషజశబ్దమునకు 'బడాయి' యను నర్థము కూడ వ్యవహారము లోనికి వచ్చినది.

సీ॥ సౌందర్యమునఁ గొంత సరివత్తు రాశ్వినే
యులు భేషజం బూని యుండ రేని (రాజ. 1–28)

అని మాదయ్యగారి మల్లన రెండర్థము లందుఁ బ్రయోగించినాఁడు. సాధారణముగా

లోకములోఁ దక్కిన వారి కంటె వైద్యులకే గర్వమెక్కువ యగుటచే భేషజశబ్దమున కిట్టి యర్థవిపరిణామము గల్గినది.

గ్రహగ్రస్తులనఁగా గ్రహచారము బాగు లేనివారు. జన్మలగ్నము నుండి 1-4-7-10 స్థానములు కేంద్రములు. 1-5-9 స్థానములు కోణములు. గురుఁడు, శుక్రుఁడు, పూర్ణచంద్రుఁడు, వీరితోఁ గూడిన బుధుఁడు శుభగ్రహములు. రవి, క్షీణ చంద్రుఁడు కుజుఁడు వీరితోఁ జేరిన బుధుఁడు పాపగ్రహములు. రాహు-కేతువులు పాపగ్రహము లైనను ఛాయాగ్రహము లగుటచే శుభగ్రహస్థానములో నున్నప్పుడు మంచిని పాపగ్రహస్థానములో నున్నప్పుడు చెడును గలగఁ జేయుచుఁ గొంత శుభమును గొంత యశుభమును గల్గఁ జేయుదురు. జన్మకుండలిలోఁ గేంద్రకోణములలో నున్న శుభగ్రహములు త్రిషడాయముల (3-6-11) లో నున్న పాపగ్రహములు శుభఫలితముల నిత్తురు. అట్లే కేంద్రకోణములలో నున్న పాపగ్రహములు త్రిషడాయములలో నున్న శుభగ్రహములు పాపఫలమునే యిచ్చుచున్నవి.

శ్లో॥ ద్వాదశాష్టమజన్మస్థాః శనిరఙ్గారకో గురుః ।
కుర్వన్తి ప్రాణసన్దేహం స్థానభ్రంశం ధనక్షయమ్ ॥ (జాతకచంద్రికా పీఠిక)

గోచారములో (1) ద్వాదశమందున్న శని ప్రాణసందేహమును (2) అష్టమ స్థానములో నున్న కుజుఁడు స్థానభ్రంశమును (3) జన్మస్థానము (చంద్రలగ్నము) లో నున్న గురుఁడు ధనక్షయమును గల్గింతురని దైవజ్ఞ కర్ణామృతము. ఇట్లు గ్రహములచేఁ బీడింపఁబడు వారు గ్రహగ్రస్తులు.

ఇక్కడ శ్రీసదాశివభట్టు పీయూషలహరీ వ్యాఖ్యలో -

గ్రహగ్రస్తాన్ గ్రహైః ఆదిత్యాది నవగ్రహైః గ్రస్తాః కవలితాః కృతపీడా ఇతి యావత్. తదుక్తం జ్యోతిశ్శాస్త్రే -

శ్లో॥ స్వర్క్షాచ్చన్ద్రఖలా స్త్రిఖారిషు శుభాః సప్తాద్యగోఽబ్జః పున
శ్చాపుత్రాద్వ్యయధర్మమృత్యుషు కవిః స్వాస్త్రత్రికోణే గురుః ।
సౌమ్యో వ్యంత్యసమేఽఖిలా భగవతాః శుక్లే నవేషుద్విగ
శ్చన్ద్రోఽథో నిజభాద్ ద్యుభం నవహృతం త్ర్యద్రీషు శేషం న సత్ ॥

అను శ్లోకము నుదాహరించినాఁడు. ఈ శ్లోకము శ్రీనారాయణదైవజ్ఞుఁడు రచించిన **ముహూర్తమార్తాండము** (11-1) లోనిది. గోచారమునందు జన్మనక్షత్రము (జన్మరాశి) నుండి చంద్రుఁడు, పాపగ్రహములు (రవి - కుజ - శని - రాహు - కేతువులు) 3-10-6 స్థానములలోఁ; జంద్రుఁడు 7-1 స్థానములందు; శుక్రుఁడు

1-2-3-4-5-12-9-8 స్థానములందు; గురుఁడు 2-7-9-5 స్థానములందు; బుధుఁడు 2-4-6-8-10 స్థానము లందునున్నప్పుడు శుభము లిత్తురు. అన్ని గ్రహములు 11వ స్థానములో నున్నప్పుడు శుభము నిచ్చును. చంద్రుఁడు శుక్లపక్షములో 9-5-2 స్థానములలో నున్నప్పుడు శుభము నిచ్చును.

దీనికి వ్యతిరేకముగా గోచారములో జన్మరాశినుండి చంద్రుఁడు 2-4-5-8-9 స్థానములలో; బుధుఁడు 1-2-5-7-9-12 స్థానములలో; గురుఁడు 1-3-4-6-8-10-12 స్థానములలో; శుక్రుఁడు 6-7-10 స్థానములలో; పాపగ్రహము లగు రవి - కుజ - శని - రాహు - కేతువులు 1-2-4-5-7 స్థానములలో నున్నప్పు డశుభ ఫలములనే యిత్తురు. చంద్రుఁడు కృష్ణపక్షములో 9-5-2 స్థానములలో నున్నప్పు డశుభమునే యిచ్చును.

అట్లే స్వజన్మనక్షత్రము నుండి దిననక్షత్రము వఱకు 3 నవకములుగా లెక్కించి నప్పుడు 2-4-6-8-9 సంఖ్య గల నక్షత్రములు (సంపత్ - క్షేమ - సాధన - మిత్ర - పరమమిత్ర తారలు) శుభఫలితముల నిచ్చును. 3-5-7 సంఖ్యగల నక్షత్రములు (విపత్ - ప్రత్యక్ - నైధన తారలు) అశుభఫలితముల నిచ్చునని నారాయణదైవజ్ఞుని స్వీయమార్తాండవల్లభావ్యాఖ్య.

ఈ శ్లోకము రసగంగాధరములో రూపకప్రకరణములో నుదాహరింపఁబడినది. ఇక్కడ గంగ యందు భేషజత్వ మారోపింపఁబడుటచే రూపకాలంకారము. ఉపాత్తోऽనుగామీ యథా - జడానంధాన్... ...

'అత్ర త్రాతుమితి తుమున్నంతేన శబ్దే నోపాత్తం జడాంధాదిత్రాణమ్ భేషజభాగీరథ్యోః'

శబ్దోపాత్తమైన యనుగామి యగు సాధారణధర్మమున కీ శ్లోక ముదాహరణము. భేషజ - భాగీరథులకు జడులు నంధులు మొదలగువారిని రక్షించుట యందు సామాన్యధర్మము గలదని తుమున్నంత మగు 'త్రాతుమ్' అను శబ్దముచే నుపాత్తమైనది.

**అవతారిక :** ఇప్పుడు గంగాజలమహిమను జెప్పుచున్నాఁడు -

**శ్లో॥ స్వభావస్వచ్ఛానాం సహజశిశిరాణామయమపా-**
**మపారస్తే మాతర్జయతి మహిమా కోऽపి జగతి ।**
**ముదా యాం గాయన్తి ద్యుతలమనవద్యద్యుతిభృతః**
**సమాసాద్యాద్యాపి స్ఫుటపులకసాన్ద్రాః సగరజాః ॥**

**ప్రతిపదార్థము :** మాతః! = జనయిత్రీ! గంగా! ముదా = సంతోషముతో; స్ఫుట =

స్పష్టముగా; పులక = రోమాంచములు (గగురుపాటు); సాంద్రాః = దట్టముగాఁ గల; సగరజాః = సగరచక్రవర్తి కొడుకులు, ద్యుతలమ్ = స్వర్గలోకమును; సమాసాద్య = పొంది; అనవద్య = దోషము లేని; ద్యుతి = కాంతిని; భృతః = భరించుచున్నవారై; అద్యాపి = ఇప్పుడు కూడ; యామ్ = దేనిని; గాయంతి = గానము చేయుచున్నారో యట్టి; స్వభావ = ప్రకృతి సిద్ధముగానే; స్వచ్ఛానామ్ = నిర్మలము లైనవి; సహజ = పుట్టుక తోడనే; శిశిరాణామ్ = చల్లనివి యగు; తే = నీ యొక్క; అపామ్ = నీళ్ళకు; **'శైత్యం హి యత్ సా ప్రకృతిర్జలస్య'** జలమునకుఁ జల్లఁదనము ప్రకృతి సిద్ధముగాఁ గల దని కాళిదాసు చెప్పినాఁడు. **'శీతస్పర్శవత్య ఆపః'** శీతస్పర్శము గలవి నీళ్ళని వైశేషికులు చెప్పినారు. అపారః = అంతు లేని; కోఽపి = ఏదియో యొకానొక యనిర్వచనీయమైన; మహిమా = గొప్పతనము, జయతి = సర్వోత్కృష్టముగా వర్తించుచున్నది.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! నైసర్గిముగా స్వచ్ఛము లైనవి, సహజముగాఁ జల్లనివి యగు నీ జలముల కొకానొక పారము లేని మహత్తు గలదు. ఆ మహిమను సంతోషముతో స్పష్టముగాఁ బులకరించి దివ్యకాంతులతో నొప్పు దేహములు గల సగరపుత్రులు స్వర్గము నధిష్ఠించి యిప్పుడు కూడ గానము చేయుచున్నారు.

**విశేషములు :** పూర్వ మొకానొకప్పుడు సగరచక్రవర్తి యశ్వమేధయాగము నారంభించి గుఱ్ఱమును విడిచిపెట్టి దానిని రక్షించుటకై తన పుత్రులను నియోగించినాఁడు. ఇంద్రుఁ డా హయమును దొంగిలించి పాతాళలోకములో దాఁచినాఁడు. సగరపుత్రులు దానిని విడిపించి తెచ్చుటకై వెళ్ళి కపిలమహర్షి కోపాగ్నితోఁ గూడిన చూపులచే బూడిద యైనారు. అటు తరువాత భగీరథుఁడు తపస్సు జేసి స్వర్గములో నున్న గంగానదిని భూమికి దించి కపిలకోపానల దగ్ధులైన సగరపుత్రుల భస్మముపైఁ బ్రవహింపఁజేసి వారిని స్వర్గమునకుఁ బంపినాఁడు. ఈ భగీరథప్రయత్నముచే భూమికి వచ్చిన గంగానది యప్పటి నుండియు భాగీరథి యైనది. శ్రీమద్రామాయణము నందలి గంగావతరణకథ యిక్కడ ననుసంధేయము.

ఈ శ్లోకములో **'అయమపామపారః'** అనుచోట నర్థభేదముతో రెండేసి హల్లులు రెండు మాఱు లావృత్త మగుటచే ఛేకానుప్రాసము. 'ద్యుతలమనవద్యద్యుతిభృతః **సమాసాద్యాద్యాపి'** అనుచోట ద్యవర్ణ మనేకపర్యాయము లావృత్త మగుటచే వృత్త్యనుప్రాసము.

**అవతారిక :** ఇప్పుడు గంగానది ప్రాయశ్చిత్తము లక్కఱ లేకుండఁగనే మహాపాపులను రక్షించుచున్న దని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ కృతక్షుద్రైనస్కానథ ఝటితి సన్తప్తమనసః**
**సముద్ధర్తుం సన్తి త్రిభువనతలే తీర్థనివహాః ।**
**అపి ప్రాయశ్చిత్తప్రసరణపథాతీతచరితాన్**
**నరాన్ దూరీకర్తుం త్వమివ జనని! త్వం విజయసే ॥ 17**

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! గంగా!; కృత = చేయఁబడిన; క్షుద్ర = చిన్న; ఏనస్కాన్ = పాపములు గల వారిని; ఉల్లిపాయ తినుట మొదలగునవి క్షుద్ర పాపములు. **'అహరహస్సంధ్యాముపాసీత'** నిత్యము సంధ్యావందనము చేయవలెను మొదలగునవి విధులు. 'న కలంజమ్ భక్షయేత్' ఉల్లిపాయను దినఁగూడదు మొదలగునవి నిషేధములు. అథ = పిమ్మట; ఝటితి = వేగముగా; సంతప్తమనసః = పశ్చాత్తాపము చెందిన మనస్సు గలవారిని; సముద్ధర్తుమ్ = బాగుగా నుద్ధరించుటకు; త్రిభువన తలే = మూఁడు లోకము లందు; తీర్థనివహాః = గోదావరి మొదలగు పవిత్రనదీ సమూహములు; సంతి = ఉన్నవి. ప్రాయశ్చిత్త = పాపనాశనక్షమమైన ధర్మవిశేషమును; ప్రసరణ = ఆచరించుటయును; పథ = మార్గమును; **'వాటః పంథా శ్చమార్గశ్చ'** అని త్రికాండమండనము. అతీత = అతిక్రమించిన; చరితాన్ = చరిత్ర గల; నరాన్ అపి = మనుజులను గూడ; దూరీకర్తుమ్ = పాపముల నుండి దూరము చేయుటకు; త్వమ్ = నీవు; త్వమ్ ఇవ = నీ వలెనే; విజయసే = విజయమును బొందు చున్నావు.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! చిన్నచిన్న పాపములను జేసి తరువాత శీఘ్రముగాఁ బశ్చాత్తాపము చెందిన వారిని సముద్ధరించుటకు ముల్లోకములందు గోదావరి, కృష్ణ మొదలగు ననేక నదీసమూహములు గలవు. కాని ప్రాయశ్చిత్తములకుఁ గూడ లొంగని మహాపాపములతో జీవితమును గడిపిన నరులను బుణ్యాత్ములుగాఁ జేయుటలో నీవు నీ వలెనే సర్వోత్కృష్టముగా వర్తించుచున్నావు. ప్రాయశ్చిత్తములకుఁ గూడ నతీతము లైన మహాపాపములు చేసిన వారి నుద్ధరించుటలో నీకు నీవే సాటి యని భావము.

**విశేషములు :** ప్రాయశ్చిత్తమనఁగాఁ బాపములను నాశనము చేయుటకు సమర్థమైన కర్మ విశేషము.

శ్లో॥ ప్రాయో నామ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే ।
తపో నిశ్చయసంయుక్తమ్ ప్రాయశ్చిత్తం తదుచ్యతే ॥

ప్రాయస్సనఁగా దపస్సు. ఆ తపస్సు వలనఁ బాపములు పోవు నను విశ్వాసముతో నిశ్చయాత్మకమైన బుద్ధి చిత్తము. నిశ్చయబుద్ధితోఁ గూడిన తపస్సే ప్రాయశ్చిత్త మని యాంగిరసస్మృతిలోఁ జెప్పఁబడినది. ద్వాదశవార్షికాది (పంద్రెండు సంవత్సరములలోఁ

జేయు) పుణ్యకర్మ విశేషముచేఁ బాపము తప్పక నివర్తించు నను విశ్వాసము నిశ్చయము. దానితోఁ గూడిన వ్రతానుష్ఠానలక్షణ మగు తపస్సు ప్రాయశ్చిత్తము. అందువల్లనే మహాభారతములో నర్జునుఁడు పండ్రెండు సంవత్సరములు తీర్థయాత్ర గావించినాఁడు.

మహాపాపములను జేసిన వారిని జూచి ప్రాయశ్చిత్తములు కూడఁ బాఱిపోవును.

శ్లో॥ సుకృతిన ఈషత్పాపే ప్రాయశ్చిత్తం రఘూత్తమ ప్రోక్తమ్ ।
అపయాతి మాముదీక్ష్య ప్రాయస్తదపీహ గౌరివ వ్యాఘ్రమ్ ॥

శ్రీరామచంద్రా! పుణ్యాత్ములు కొంచెము పాపము చేసినను దానికిఁ గూడఁ బ్రాయశ్చిత్తము చెప్పఁబడినది. ఎన్నియో పాపములు చేసిన నన్నుఁజూచి యా ప్రాయశ్చిత్తము కూడఁ బులిని జూచిన యావువలెఁ బాఱిపోవుచున్నదని శ్రీముద్గలాచార్యుఁడు చెప్పినాఁడు.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యనన్వయప్రకరణములో నుదాహరింపఁబడినది. ఉపమానోపమేయములు రెండు నొకేవస్తువునం దున్నచో ననన్వయాలంకారము.

ఉదాహరణ మమృత (పీయూష) లహర్యాఖ్యే మదీయే గంగాస్తవే –

కృతక్షుద్రాఘౌఘానథ సపది.... ....

ఇక్కడ నీవు నీ వలెనే విజయము నొందుచున్నా వని గంగను గంగ తోనే పోల్చుటచే ననన్వయము. గంగాలహరిలోని 'కృతక్షుద్రైనస్కానథ ఝటితి' యను దానికి బదులుగా రసగంగాధరములోఁ బై పాఠము గలదు. అప్పుడు 'కృత = చేయఁబడిన; క్షుద్ర = చిన్న; అఘ = పాపములయొక్క; ఓఘాన్ = సమూహము గలవారిని; సపది = వెంటనే' యని యర్థము చెప్పుకొనవలయును.

**అవతారిక :** ఇప్పుడటువంటి గంగ నా తాపమును గూడఁ బోఁగొట్ట వలయు నని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ నిధానం ధర్మాణాం కిమపి చ విధానం నవముదామ్**
**ప్రధానం తీర్థానామమలపరిధానం త్రిజగతః ।**
**సమాధానమ్ బుద్ధేరథ ఖలు తిరోధానమధియాం**
**శ్రియామాధానం నః పరిహరతు తాపం తవ వపుః ॥ 18**

**ప్రతిపదార్థము :** ఓ గంగా! ధర్మాణామ్ = ధర్మములకు; నిధానమ్ = నిధి యైనది;

వేదములచేఁ బ్రయోజనము నుద్దేశించి విధింపఁబడిన యర్థములు ధర్మములు. జైమిని మహర్షి పూర్వమీమాంసాశాస్త్రములో **'అథాతో ధర్మజిజ్ఞాసా'** యని ధర్మజిజ్ఞాస నారంభించి **'చోదనాలక్షణోఽర్థో ధర్మః'** వేదము ప్రేరేపించుటచేఁ బుట్టిన యర్థము ధర్మమని సూత్రించినాఁడు. నవముదామ్ = క్రొత్త క్రొత్త సంతోషములకు; కిమపి చ = ఒకానొక చెప్పలేని; విధానమ్ = విధియైనది; గంగాప్రవాహము నిత్యము క్రొత్త యాహ్లాదమును గల్గఁజేయు నని భావము. తీర్థానామ్ = గోదావరి మొదలగు పుణ్యనదులలో; ప్రధానమ్ = ముఖ్యమైనది; త్రిజగతః = మూఁడు లోకములకు; అమల = స్వచ్ఛమైన; పరిధానమ్ = వస్త్రమైనది; బుద్ధేః = బుద్ధికి; సమాధానమ్ = సమాధిస్థితిని గూర్చునది; అథ = ఇంకను; అధియామ్ = బుద్ధిలేని వారికి; తిరోధానమ్ = గోచరము గానిది; బుద్ధి లేని వారు గంగను దర్శింప నేరరని భావము; శ్రియామ్ = సంపదలకు; ఆధానమ్ = స్థాపించు స్థానమైనది యగు; తవ = నీయొక్క; వపుః = శరీరము (ప్రవాహము); నః = మాయొక్క; తాపమ్ = దుఃఖమును; పరిహరతు = పోఁగొట్టుఁగాక!

**తాత్పర్యము :** ఓ గంగా! సకలధర్మములకు జన్మస్థానమైనది, చెప్పుటకు శక్యము కాని నూతనానందమును గల్గించునది, పుణ్యనదులలోఁ బ్రధానమైనది; ముల్లోకములకుఁ దెల్లని బట్టయైనది, బుద్ధికి నానాలోచనములను దూరము చేసి సమాధిస్థితిని గల్పించునది, బుద్ధిహీనుల కగోచరమైనది, సంపదలను స్థాపించుటకు స్థానమైనది యగు నీ దేహరూపమైన జలప్రవాహము మాయొక్క తాపములనుఁ బరిహరించుఁ గాక!

**విశేషములు :** ఈ శ్లోకములో నిధాన – విధాన – ప్రధాన – పరిధాన – సమాధాన – తిరోధాన – ఆధాన శబ్దములందు నంత్యానుప్రాసము స్ఫుటము. గంగా దేహమునందు నిధాన – పరిధానాదుల నారోపించుటచే రూపకము. ఒకే దేహమును నిధానమని విధానమని వివిధ విధములుగా నుల్లేఖించుటచే నుల్లేఖాలంకారము. ఈ విధముగా శబ్దార్థాలంకారములకు సంసృష్టి.

**అవతారిక :** ఇప్పుడు గంగావియోగము సహింప రాని దని చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ పురో ధావంధావం ద్రవిణమదిరాఘూర్ణితదృశామ్**
**మహీపానాం నానాతరుణతరఖేదస్య నియతమ్ ।**
**మమైవాయమ్ మన్తుః స్వహితశతహన్తుర్జడధియో**
**వియోగస్తే మాతర్యదిహ కరుణాతః క్షణమపి ॥** 19

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! గంగా! తే = నీయొక్క; వియోగః = స్నానాదులకు సంబంధించిన యెడఁబాటు; ఇహ = ఇక్కడ; యత్ = ఏదికలదో; తత్ = అది; ద్రవిణ

= డబ్బుచేతను; మదిరా = కల్లుచేతను; ఆఘూర్ణిత = బాగుగాఁదిరిగిన; దృశామ్ = కన్నులు గల; మహీపానామ్ = రాజుల యొక్క; పురః = ముందు, నియతమ్ = నియమముగా; ధావం ధావమ్ = పరుగెత్తి పరుగెత్తి; నానా = అనేకములైన; తరుణతర = బాగుగా ముదిరిన; ఖేదస్య = దుఃఖములు గల; స్వహిత = నా కిష్టము లైన; శత = నూఱు విషయములను; హంతుః = చంపుచున్న; జడధియః = మందబుద్ధి గల; మమ = నా యొక్క; అయమ్ = ఈ; మంతుః = అపరాధమే; క్షణమ్ అపి = త్రుటికాలమైనను గూడ; కరుణాతః = దయతో; (సోఢవ్యః = సహింపఁదగిన దని శేషము.)

**తాత్పర్యము :** తల్లీ! గంగా! నేను నీలో స్నానము చేయక సంధ్య వార్వక నిన్నెడఁబాసి ధనముతో మత్తు పానీయములతోఁ గన్నులు దిరుగుచున్న రాజుల ముందు నియమముగాఁ బరుగెత్తి పరుగెత్తి బాగుగా ముదిరిన యనేక దుఃఖములను బొందితిని. నా కిష్టములైన వంద విషయములను గూడ నేనే హతమార్చుకొనుచున్నాను. ఇది జడబుద్ధి నైన నా యపరాధమే. ఈ నా యపరాధమును నీవు కరుణతో క్షణకాలమైనను సహింపవలయును.

**విశేషములు :** 'ధావంధావమ్' అనునది 'ధావు – గతిశుద్ధ్యోః' అను ధాతువునకు **'ఆభీక్ష్ణ్యే ణముల్'** (4–4–22) అను సూత్రముచే విహితమైన ణముల్ ప్రత్యయము చేరఁగా నేర్పడిన రూపము. ణములంతములగు ధాతువు లెప్పుడును జంటలుగానే ప్రయోగింపఁబడును.

**అవతారిక :** ఇప్పుడు గంగాజలము పుట్టుక లేకుండఁ జేయవలయునని కోరుకొను చున్నాఁడు –

**శ్లో॥ మరుల్లీలాలోలల్లహరిలులితామ్భోజపటలీ–**
**స్ఖలత్పాంసువ్రాతచ్ఛురణవిసరత్కౌఙ్కుమరుచి ।**
**సురస్త్రీవక్షోజక్షరదగరుజమ్బాలజటిలం**
**జలం తే జమ్బాలమ్ మమ జననజాలం జరయతు ॥ 20**

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా! మరుత్ = గాలి యొక్క; లీలా = విలాసముచే; లోలత్ = కదలుచున్న; లహరి = కెరటములచే; లులిత = ఊఁపఁబడిన; అంభోజ = పద్మముల యొక్క; పటలీ = సమూహమునుండి; స్ఖలత్ = జాఱుచున్న; పాంసు = పుప్పొడియొక్క; వ్రాత = సమూహముయొక్క; ఛురణ = గిల్లుటచే (కలయికచే); విసరత్ = ప్రసరించు చున్న; కౌంకుమ = కుంకుమము యొక్క; రుచి = కాంతిగలవి; సురస్త్రీ = దేవతాకాంతల

యొక్క; వక్షోజ = స్తనములనుండి; క్షరత్ = సంచలనముచే రాలుచున్న; అగరు = సుగంధ ద్రవ్యమగు నల్లచందనము యొక్క లేపముచే; జంబాలమ్ = బురదయైన; తే = నీయొక్క; జలమ్ = నీరు; మమ = నాయొక్క; జనన = పుట్టుకలయొక్క; జాలమ్ = సమూహమును; జరయతు = ముసలి దానినిగాఁ జేయుగాఁక! నాశనము చేయుఁగాక!

**తాత్పర్యము :** గాలి వీవనలకు గంగాతరంగములు కదలి యాడుచుఁ గమలముల నూఁచుచున్నవి. ఆ యూఁగుచున్న తమ్మిపూల గుంపుల నుండి పుప్పొడి ముద్దలు ముద్దలుగా రాలుచున్నది. ఆ పుప్పొడి ముద్దల కలయికచే గంగాజలము కుంకుమము వంటి యెఱ్ఱని కాంతులను విరఁజిమ్ముచున్నది. దేవతా స్త్రీలు గంగలో స్నానము చేయుచున్నారు. అప్పుడు వారి కదలుచున్న కుచములనుండి వారు పూసికొన్న నల్లని యగరు చందనలేపము జాఱి దట్టముగా గంగలోఁ గలియుచున్నది. ఆ పుప్పొడి ముద్దలతో నాయగరుచందనముతో బురదయైన గంగలోని నీరు నా పుట్టుకల సమూహమునకు ముసలితనము వచ్చునట్లు చేయుఁగాక! గంగాస్నానము వలన నా పుట్టుకలు నశించుఁగాక! ఇంక నాకు జన్మము లేకుండుఁగాక! యని భావము.

**విశేషములు :** ఇందలి మొదటిపాదములో లకారావృత్తిచే నుత్తరార్ధములో జకారావృత్తిచే వృత్త్యనుప్రాసము.

**అవతారిక :** ఇప్పుడు పుట్టుకచే, నివాసముచే, వ్యాపారముచే గంగాదేవి గొప్పదని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ సముత్పత్తిః పద్మారమణపదపద్మామలనఖా-**
**న్నివాసః కన్దర్పప్రతిభటజటాజూటభవనే ।**
**అథాయం వ్యాసఙ్గో హతపతితనిస్తారణవిధౌ**
**న కస్మాదుత్కర్షస్తవ జనని! జాగర్తి జగతి ॥ 21**

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! గంగా! తవ = నీయొక్క; సముత్పత్తిః = పుట్టుక, పద్మా = లక్ష్మీదేవికి; **'లక్ష్మీః పద్మాలయా పద్మా' యని యమరము**; రమణ = భర్తయైన శ్రీమహావిష్ణువు యొక్క; పదపద్మ = పద్మమువంటి పాదముయొక్క; అమల = నిర్మలమైన; నఖాత్ = గోటినుండి; తవ = నీయొక్క; నివాసః = నివాసము; కందర్ప = మన్మథునికి; ప్రతిభట = శత్రువైన శివునియొక్క; జటాజూట = కపర్దమనెడి; భవనే = మందిరము నందు; అథ = ఇంకను; తవ = నీయొక్క; అయమ్ = ఈ; వ్యాసంగః = ఉద్యోగము; హత = యుద్ధములో మరణించిన వారిని; పతిత = పాపులు మొదలగు వారిని; నిస్తారణ = ఉద్ధరించుట యను; విధౌ = విధానమునందు; జగతి = లోకములో; తవ

= నీయొక్క; ఉత్కర్షః = శ్రేష్ఠత్వము; కస్మాత్ = దేనికంటె; న జాగర్తి = గొప్పగా నుండుట లేదు?

**తాత్పర్యము :** జనయిత్రీ! గంగా! శ్రీమహావిష్ణుని పాదపద్మము నందలి శుభ్రమైన గోటినుండి నీవు పుట్టితివి. శ్రీ పరమేశ్వరుని జటాజూటము నీకు నివాసము. చనిపోయిన వారిని, పతితులను నుద్ధరించుటయే నీకు నిత్యవ్యాపారము. లోకములో నీ వెవరి కంటె గొప్ప దానవు గావు? సకలనదుల కంటెను నీవే గొప్పదాన వని భావము.

**విశేషములు :** ఇందు మొదటి పాదములోఁ బద్మయను శబ్దమర్థభేదములో రెండు మాఱులావృత్త మగుటచే ఛేకానుప్రాసము. రెండవపాదములోఁ దవర్ణము మూఁడు సార్లు మూఁడవపాదములోఁ దవర్ణము, నాల్గవపాదములో జకారము లావృత్త మగుటచే వృత్త్యనుప్రాసము.

ఈ శ్లోకము రసగంగాధరములో సముచ్చయాలంకారప్రకరణములో నుదాహరింపఁబడినది. **"యుగపత్పదార్థానామన్వయః సముచ్చయః అత్ర త్రిష్వేకేనాప్యుత్కర్షసమ్భవే త్రయోఽప్యుత్కర్షజననార్థం స్పర్ధయేవ పతన్తో రమణీయాః"** – అనేక పదార్థముల కొకేమాఱన్వయము గల్గినచో సముచ్చయాలంకారము. ఈ శ్లోకములో హరినఖముల యందు, శివజటాజూటమునందుఁ బతితజననిస్తారణవిధి యందు సంసర్గముచే గంగ కొకేమాఱుత్కర్షము కల్గిన దని వర్ణించుటచే సముచ్చయాలంకారము. ఇక్కడఁ జెప్పిన మూఁడింటిలోఁ బ్రత్యేకముగా నొక్కొక్క దాని వల్లనే యుత్కర్షము కల్గుచున్నను మూఁడును గలిసి యొకేమాఱొకదానితో నొకటి పోటి పడుచు గంగ కుత్కర్షము గల్గించుచున్నవి గావున రమణీయములుగా నున్నవి.

**అవతారిక :** ఇప్పుడు పైవిషయమునే భంగ్యంతరముగా వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ నగేభ్యో యాన్తీనాం కథయ! తటినీనాం కతమయా**
**పురాణాం సంహర్తుః సురధుని! కపర్దేఽధిరురుహే ।**
**కయా వా శ్రీభర్తుః పదకమలమక్షాలిసలిలై–**
**స్తులాలేశో యస్యాం తవ జనని! దీయేత కవిభిః ॥ 22**

**ప్రతిపదార్థము :** జనని! = ప్రసూ!; సురధుని! = దేవనదీ! గంగా! నగేభ్యః = పర్వతముల నుండి; యాంతీనామ్ = వచ్చుచున్న; తటినీనామ్ = నదులలో; కతమయా = దేనిచేత; పురాణామ్ = త్రిపురాసురపురములను; సంహర్తుః = సంహరించిన శివునియొక్క; కపర్దే = జటాజూటము నందు; అధిరురుహే = అధిరోహింపఁబడినది? కయా వా = లేక యే నదిచే; శ్రీభర్తుః = లక్ష్మీపతి యొక్క; పదకమలమ్ = పద్మమ వంటి పాదము;

అక్షాళి = క్షాళనము చేయఁబడినది? యస్యామ్ = ఏ నది యందు; తవ = నీకు; తులాలేశః = కొంచెమైనను పోలిక; కవిభిః = కవులచే; దీయేత = ఈయఁబడఁ గలదు?

**తాత్పర్యము :** దేవనదీ! మాతా! గంగా! అనేక పర్వతములనుండి యెన్ని నదులు లోకములో బుట్టుటలేదు? గోదావరీనది నాసికాత్ర్యంబకపర్వతశిఖరమునుండి పుట్టుచున్నది. యమునానది కళిందనగాగ్రమునుండి పుట్టుచున్నది. కృష్ణానది సహ్యాచల శిరస్సునుండి పుట్టుచున్నది. నర్మదానది వింధ్యాద్రిమూర్ధమునుండి పుట్టుచున్నది. నీవో! హిమాలయమహీధరోత్తమాంగమునుండి పుట్టుచున్నావు. ఈ నదులలో నేనది శ్రీపరమశివుని జటాజూటము నారోహించినది? ఏ నది శ్రీమహావిష్ణువు పాదపద్మమును గడుగుచున్నది. ఇట్టి మహిమతో నొప్పుచున్న నీతో నేనదిని గవులు పోల్పఁగలరు. జగతిలో నేనదులును నీతో సాటిరావు. కావున నీకు నీవే సాటి యని భావము.

**విశేషములు :** కవి యొక శ్లోకములోఁ జెప్పిన భావమును వెంటనే మఱియొక శ్లోకములో భంగ్యంతరముగాఁ జెప్పుట పునరుక్తిదోషము గాదు. ఇది మహాకవి క్షుణ్ణమార్గమే.

మాఘకవి శిశుపాలవధములో –

శ్లో॥ భృశమదూయత యాధరపల్లవక్షతిరనావరణా హిమమారుతైః ।
దశనరశ్మిపటేన చ సీత్కృతైర్నివసితేవ సితేన సునిర్వవౌ॥

శ్లో॥ వ్రణభృతా సుతనోః కలసీత్కృతస్ఫురితదన్తమరీచిమయం దధే ।
స్ఫుటమివావరణం హిమమారుతైర్మృదుతయా దుతయాధరలేఖయా ॥
(శిశు – 6 – 58, 59)

అని యొకే యర్థము గల రెండు శ్లోకములను రచింపఁగా మల్లినాథుఁడు – **ఉక్త మేవార్థమ్ భంగ్యంతరేణాహ** అని సర్వంకషలోఁ జెప్పినాఁడు. అట్లే నైషధములో నారంభమునందే –

**'నలః సితచ్ఛత్రితకీర్తిమండలః'** అనియు **సువర్ణదండైకసితాతపత్రిత, జ్వలత్ప్రతాపావళి–కీర్తిమండలః'** అనియు శ్రీ శ్రీహర్షుఁడు ప్రయోగింపఁగా – **"ఇహ కీర్తేరాతపత్రత్వ నిరూపణమ్ పూర్వశ్లోకోక్తమపి సువర్ణదండవైశిష్ట్యస్యాపూర్వత్వాద్విచ్ఛిత్తివిశేషహేతుః"** అని మల్లినాథుఁడు చెప్పినాఁడు. ఆ నైషధమునందే –

శ్లో॥ స్వకేళిలేశస్మితనిర్జితేందునో, నిజాంశదృక్తర్జితపద్మసంపదః ।
అతద్ద్వయీ జిత్వర సుందరాంతరే, న తన్ముఖస్య ప్రతిమా చరాచరే ॥

శ్లో॥ సరోరుహం తస్య దృశైవ నిర్జితం, జితాః స్మితేనైవ విధోరపి శ్రియః ।
కుతః పరమ్ భవ్యమహో! మహీయసే, తదాననస్యోపమితౌ దరిద్రతా ॥

(నైష = 1-23,24)

అని సమానార్థము గల రెండు శ్లోకములను శ్రీ శ్రీహర్షుఁడు రచింపఁగా మల్లినాథుఁడు – 'ఉక్తమేవార్థమ్ భంగ్యంతరేణాహ' అని జీవాతువులోఁ జెప్పినాఁడు. అట్లే యాంధ్రకవితాభ్రగంగాభగీరథులైన నన్నయ్యగా రాంధ్ర **మహాభారతాది పర్వాదిమాశ్వాసము**లోనే.

తరలము: పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుండు గురుండు పం
చదివసంబులు కర్ణుఁడున్ దివసద్వయంబు దినార్ధమం
దుదితతేజుఁడు శల్యుఁ డత్యధికోగ్రవీరగదారణం
బది దినార్ధముగాఁగ నిట్లు మహాభయంకరవృత్తితోన్. (మహాభా.ఆ. 1-67)

అను పద్యములోఁ జెప్పిన భావమునే –

కం॥ పదిదినము లైదు ప్రొద్దులు
పదపడి రెన్నాళ్ళు నొక్క పగలున్ రేయున్
మదమున రణ మొనరించిరి
నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్. (ఆది 1-68)

అని మఱలఁ జిన్ని కందములోఁ బొదిగినారు.

అట్లే భక్తికవితాసామ్రాజ్యసార్వభౌములైన పోతనగారు **భాగవతము**లో –

ఉ॥ నల్లని వాఁడు పద్మనయనంబుల వాఁడు మహాశుగంబులున్
విల్లును దాల్చు వాఁడు గడు విప్పగు వక్షము వాఁడు మేలుపైఁ
జల్లెడు వాఁడు నిక్కిన భుజంబుల వాఁడు యశంబు దిక్కులన్
జల్లెడు వాఁడు నైన రఘుసత్తముఁడిచ్చుత మా కభీష్టముల్.

(భాగ. 9స్క-361)

ఉ॥ నల్లని వాఁడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబుపైఁ
జల్లెడు వాఁడు మౌళిపరిసర్పితపింఛము వాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీ పొదల మాటున లేఁడు గదమ్మ! చెప్పరే!

(భాగ. 10-1-1013)

అని యొకే యెత్తుగడతో శ్రీరామపరముగా శ్రీకృష్ణపరముగా రెండు పద్యములను రచించినాఁడు.

అట్లే సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథకవిసార్వభౌముఁడు శృంగారనైషధములో –

మ॥ మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్.

మ॥ కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబానన్
సమపీనస్తనినస్తి నాస్తి విచికిత్సాహేతుశాతోదరిన్ (శృ.నై. 2–20, 21)

అని చెప్పిన రెండు పద్యములు నిట్టివే కదా! అంతవఱకు నెందులకు? శ్రీ జగన్నాథమహాకవియే రసగంగాధరములో –

శ్లో॥ రాజా యుధిష్ఠిరో నామ్నా సర్వధర్మసమాశ్రయః ।
ద్రుమాణామివ లోకానామ్ మధుమాస ఇవాభవత్ ॥

శ్లో॥ రాజా దుర్యోధనో నామ్నా సర్వసత్త్వభయంకరః ।
దీపానామివ సాధూనాం ఝంఝూవాత ఇవాభవత్ ॥ (ఉపమాప్రకరణము)

శ్లో॥ ఆనందమృగదావాగ్నిః శీలశాఖిమదద్విపః ।
జ్ఞానదీపమహావాయురయం ఖలసమాగమః ॥

శ్లో॥ కారుణ్యకుసుమాకాశః శాంతిశైత్యహుతాశనః ।
యశస్సౌరభ్యలశునః పిశునః కేన వార్యతే ॥ (రూపకప్రకరణము)

శ్లో॥ శీలభారవతీకాంతా పుష్పభారవతీ లతా ।
అర్థభారవతీ వాణీ భజతే కామపి శ్రియమ్ ॥

శ్లో॥ లతా కుసుమభారేణ శీలభారేణ సుందరీ ।
కవితాచార్థభారేణ శ్రియతే కామపి శ్రియమ్ ॥ (దీపకప్రకరణము)

మొదలగు బింబ – ప్రతిబింబ శ్లోకములను రచించినాఁడు. సమర్థులైన మహాకవులు రచించిన యిట్టి పద్యములు పాఠకునకు విచ్ఛిత్తి విశేషమును గల్గించును. అది

యనుభవైకవేద్యము. అదే యసమర్థుఁ డైన సామాన్యకవి యిట్టి పద్యములను మఱల మఱలఁ జెప్పినచో వినువానికి విసుగువచ్చును. ఇది కూడ ననుభవైకవేద్యమే. ఇంకనీ విషయము నిట్లుంచి ప్రకృతము ననుసరింతము.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యనన్వయాలంకార ప్రకరణములో నుదాహరింపఁబడినది.

"అత్ర కయా వా త్వదితరయా శ్రీభర్తుః పదం సలిలైరక్షాలి యస్యామిత-రస్యాం కవిభిస్తవ తులాలేశోఽపి దీయేతేత్యర్థేన త్వయి పునః సలిలక్షాళిత శ్రీరమణచరణాయాం తవ తులాదీయేతైవేత్యర్థోఽ నన్వయాత్మా శ్రీగంగాగతనిరుపమత్వ పర్యవసాయీ ఇతరపదమహిమ్నా వ్యజ్యతే" గంగకు గంగయే సాటి యని వర్ణించుట యనన్వయము. ఇక్కడ నీకంటె నితరమైన యే నదిచే శ్రీభర్తపదము కడగఁ బడినది? ఏ నది యందుఁ గవులు నీతోఁ దులాలేశమును జెప్పఁగలరు? - అను నర్థముచే మఱల సలిలక్షాళిత శ్రీరమణచరణ వగు నీకు నీతోనే యుపమ చెప్పఁగల రను ననన్వయరూప మగు నర్థము శ్రీ గంగయందలి నిరుపమత్వ (సాటిలేకపోవుటయను) పర్యవసాయియై యితరపదమహిమచే ధ్వనిత మగుచున్నది గావున నీపద్య మనన్వయాలంకార ధ్వని కుదాహరణము.

ఇదే శ్లోకము చిత్రమీమాంసాఖండనములో ననన్వయప్రకరణములో నుదాహరింపఁబడినది -

ఇదమ్ పునరనన్వయధ్వనేరుదాహరణమ్ మదీయే గంగాస్తవే - 'నగేభ్యో యాంతీనామ్'... ... అత్రేతరయేత్యేతన్మాహాత్మ్యాత్' త్వయి తు తవ తులా దీయేతైవ' ఇత్యనన్వయో నిరుపమత్వపర్యవసాయీ వ్యజ్యతే.

ఈ యనన్వయధ్వని కుదాహరణము నా గంగాస్తవములోఁ గలదు. 'నగేభ్యో యాంతీనామ్' అను శ్లోకములో 'ఇతరయా' యను శబ్దమహిమచే నీయందు నీకే యుపమను గవులు చెప్పఁగలరని నిరుపమత్వపర్యవసాయియగు ననన్వయము వ్యజ్యమానమగుచున్నది.

**అవతారిక :** ఇప్పుడు గంగానది యుండఁగా ద్రిమూర్తుల కేప్రయోజనము లేదని వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ విధత్తాం నిశ్శఙ్కం నిరవధిసమాధిం విధిరహో!**
**సుఖం శేషే శేతాం హరిరవిరతం నృత్యతు హరః ।**

**కృతమ్ ప్రాయశ్చిత్తైరలమథ తపోదానయజనైః**
**సవిత్రీ కామానాం యది జగతి జాగర్తి భవతీ ॥** **23**

**ప్రతిపదార్థము :** విధి = బ్రహ్మదేవుఁడు; నిశ్శంకమ్ = కొంచెము కూడ సందేహము లేకుండ; నిరవధి = అవధి లేకుండ నెంత కాలమైనను; సమాధిమ్ = సమాధి స్థితిని; విధత్తామ్ = చేయుఁగాక! పొందుఁగాక!; యోగసమాధిస్థితిలో నుండుఁగాక యని భావము. సుఖమ్ = సుఖముగా; హరిః = శ్రీమహావిష్ణువు; శేషే = ఆదిశేషుని యందు; శేతామ్ = నిద్రించుఁగాక; అవిరతమ్ = ఎడతెగకుండ; హరః = శివుఁడు; నృత్యతు = తాండవ మాడుచుండుఁగాక! అథ = ఇంక; కామానామ్ = సకల వాంఛితములను; సవిత్రీ = కనుచుండు తల్లి వగు; భవతీ = నీవు; జగతి = లోకములో; యది జాగర్తి = జాగృతిని వహించుదానివిగా నున్నచో; ప్రాయశ్చిత్తైః = ప్రాయశ్చిత్తములతో; తపః = తపస్సు; దాన = దానములు, యజనైః = యజ్ఞములు వీని చేత; కృతమ్ = చేయఁబడినది; అలమ్ = చాలును. అహో! = ఆశ్చర్యము.

**తాత్పర్యము :** త్రిమూర్తులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు జగత్తునకు సృష్టి-స్థితి-సంహార ములను నెఱపుచున్నారు. విశ్వమును విధించువాఁడగుటచే బ్రహ్మ విధి యైనాఁడు. అందఱి దుఃఖములను హరించి జగత్తును నిల్పువాఁడగుటచే శ్రీమహావిష్ణువు హరియైనాఁడు. ప్రళయకాలములో సమస్తలోకములను హరించువాఁడగుటచే శ్రీపరమశివుఁడు హరుఁడైనాఁడు. అట్టి విధి - బ్రహ్మ యవవధి లేకుండ నెంత కాలమైనను యోగసమాధిలో మునుఁగుఁగాక! అట్టి హరి యెంత కాల మైనను శేషునిపైఁ బవ్వళించుఁగాక! అట్టి హరుఁ డెంతకాలమైనను గైలాసముపైఁ బార్వతీదేవితోఁ గూడి తాండవ మాడుచుండుఁగాక! ఈ జగత్తును నిలపెట్టుటకై కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులు, గోగజాశ్వాది దానములు, దేవపూజాదులు, నగ్నిష్టోమాది యజ్ఞములు నన్నియును వ్యర్థములు. భక్తుల కోరికలను దీర్చు తల్లివై నీవు జాగృతి వహించినచో జగత్తు యొక్క సృష్టి - స్థితి - లయము లన్నియు వాని యంతట నవియే సాగు నని త్రిమూర్తుల ప్రయోజనము లేదని భావము.

ఈ శ్లోకము రసగంగాధరములో మాధుర్యగుణమునకు లక్ష్యముగా నుదాహరింపఁబడినది. ఏకస్యా ఏవోక్తేః భంగ్యంతరేణ పునః కథనాత్మకముక్తివైచిత్ర్యమ్ మాధుర్యమ్. యథా - విధత్తాం విశ్శంకం... ... ... 'అత్ర విధ్యాదిభిర్నాస్తి కిమపి ప్రయోజనమిత్యేషోఽర్థః సమాధివిధానాది ప్రేరణారూపేణోక్తివైచిత్ర్యేణాభిహితః । అన్యథాఽనవీకృతత్వాపత్తేః।'

ఒకే యుక్తిని భంగ్యంతరముగా మఱలఁ జెప్పుట యను నుక్తివైచిత్ర్యము నకు మాధుర్య మని పేరు. **'విధత్తాం నిశ్శంకమ్'** అను నీ శ్లోకములో బ్రహ్మ మొదలగువారిచే నేప్రయోజనము లేదను నర్థము సమాధివిధానము మొదలగు ప్రేరణా రూపమగు నుక్తివైచిత్ర్యముచేఁ జెప్పఁబడినది గావున మాధుర్యమను గుణము గలదు. మఱొక విధముగా సామాన్యముగాఁ జెప్పినచోఁ గ్రొత్తతన ముండదు గదా!

**అవతారిక :** ఇప్పుడు నీవే నన్నుఁ గాపాడ వలయు నని ప్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ అనాథః స్నేహార్ద్రాం విగలితగతిః పుణ్యగతిదామ్**
**పతన్ విశ్వోద్ధర్త్రీం గదవిగలితః సిద్ధభిజషమ్ ।**
**సుధాసిన్ధుం తృష్ణాకులితహృదయో మాతరమయం**
**శిశుః సమ్ప్రాప్తస్త్వామహమిహ విదధ్యాః సముచితమ్ ॥ 24**

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా!; అనాథః = అనాథుఁడ నగు నేను, స్నేహ + ఆర్ద్రామ్ = స్నేహముచేఁ దడిసిన నిన్ను; విగలితగతిః = ఏ గతియు లేని నేను; పుణ్యగతిదామ్ = పుణ్యగతుల నిచ్చు నిన్ను; పతన్ = పడుచున్న నేను; విశ్వోద్ధర్త్రీమ్ = విశ్వము నుద్ధరించు నిన్ను; గదలిగలితః = రోగములచేఁ జిక్కిన నేను; సిద్ధభిషజమ్ = సిద్ధౌషధముల నిచ్చు వైద్యురాల వగు నిన్ను; తృష్ణా = దాహముచే; ఆకులిత = కలఁతపాటు చెందిన; హృదయః = హృదయము గల నేను; సుధాసింధుమ్ = అమృతనది వైన లేక యమృతదేశమైన లేక యమృతసముద్రమ వైన నిన్ను; **'దేశే నదవిశేషేఽబ్ధౌ సింధుర్నా సరితి స్త్రియామ్'** అని యమరము. అయమ్ = ఈ; శిశుః = అర్భకుఁడ నైన; **'పోతః పోకోఽర్భకో డింభః పృథుకః శాబకః శిశుః'** అని యమరము; అహమ్ = నేను; మాతరమ్ = తల్లివైన; త్వామ్ = నిన్ను; సంప్రాప్తః = పొందితిని; ఇహ = ఇక్కడ; సముచితమ్ = బాగుగా యోగ్యమైన దానిని; విదధ్యాః = చేయుము.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! నే ననాథుఁడను. వాత్సల్యముచేఁ జెమరించిన దేహము గల దానివి నీవు. నే నేగతియు లేని వాఁడను. పుణ్యగతుల నిచ్చు దానవు నీవు. నేనుఁ గ్రిందికిఁ బడుచున్నవాఁడను. సమస్త విశ్వమునుఁ బైకి లేపు దానవు నీవు. నేను రోగములచేఁ జిక్కి శిథిలమైన వాఁడను. సిద్ధౌషధముల నిచ్చు దానవు నీవు. నేను దాహముచే వ్యాకులత్వము చెందిన డెందము గలవాఁడను. నీవు పీయూషనదివి. నే నేమియు నెఱుఁగని నీ డింభకుఁడను. నీవు బిడ్డలను సాకు తల్లివి. ఇక్కడ నీ కేది యోగ్యముగాఁ దోఁచునో దానిని జేయుము.

**విశేషములు :** ఇక్కడ **'విశ్వోద్ధర్త్రీ'** (విశ్వస్య ఉద్ధర్త్రీ) యనుచోట **'ఘటానాం నిర్మాతు**

**స్త్రిభువనవిధాతుశ్చ కలహః'** అను భవభూతి ప్రయోగమువలె శేషషష్ఠితో సమాసము. ఈ శ్లోకము నందలి విశేషణము లన్నియు సాభిప్రాయము లగుటచేఁ బరికరాలంకార మని సదాశివభట్టు చెప్పినాఁడు. **'అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే'** అని కువలయానందలక్షణము. సమాలంకార మని జగన్నాథుఁడు చెప్పినాఁడు.

ఈ శ్లోకము రసగంగాధరములో సమాలంకారప్రకరణములో నుదాహరింపఁ బడినది – **"అనురూపసంసర్గః సమమ్. సంయోగలక్షణస్యానురూపతా ద్వేధా' స్తుతిపర్యవసాయినీ నిందాపర్యవసాయినీ చ.** ఆద్యా యథా – అనాథః స్నేహార్ద్రామ్... ... అనాథత్వాది విశిష్టస్య స్నేహార్ద్రత్వాది విశిష్టేన సంసర్గస్యానురూపతా భాగీరథీ స్తుతిపర్యవసాయినీ" అనురూప మైన దానితోఁ గలియుట సమాలంకారము. సంయోగ లక్షణము యొక్క యనురూపత (1) స్తుతిపర్యవసాయిని (2) నిందాపర్యవసాయిని యని రెండు విధములు. అందు మొదటిదైన స్తుతిపర్యవసాయిని యగు ననురూపతకు నీశ్లోక ముదాహరణము. ఇక్కడ ననాథత్వము, విగలితగతిత్వము మొదలగు వానిచే విశిష్టుఁడైన వానికి స్నేహార్ద్రత్వము పుణ్యగతిప్రదత్వము మొదలగు వానిచే విశిష్టమైన దానితోఁ గలియుట యను ననురూపత భాగీరథీస్తుతితోఁ బర్యవసించుచున్నది.

**అవతారిక :** ఇప్పుడు నీకథ కూడ స్వర్గము నొసఁగు నని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ విలీనో వై వైవస్వతనగరకోలాహలభరో**
**గతా దూతా దూరం క్వచిదపి పరేతాన్ మృగయితుమ్ ।**
**విమానానాం వ్రాతో విదలయతి వీథీర్దివిషదాం**
**కథా తే కల్యాణీ యదవధి మహీమణ్డలమగాత్ ॥** 25

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా! తే = నీయొక్క; కల్యాణీ = మంగళములను గూర్చు; కథా = అవతరణవృత్తాంతము; యత్ అవధి = ఎప్పటినుండి; మహీమండలమ్ = భూలోకములోనికి; అగాత్ = వచ్చినదో; (తదవధి = అప్పటి నుండి); వైవస్వత = సూర్యుని కుమారుఁడైన యముని యొక్క; నగర = సంయమనీపురము నందలి; కోలాహభరః = కలకలముయొక్క భారము; వై = నిశ్చయముగా; విలీనః = అణఁగినది; దూతాః = యమదూతలు; క్వచిత్ అపి = ఎక్కడికో; దూరమ్ = దూరముగా; పరేతాన్ = చనిపోయిన వారిని; మృగయితుమ్ = వెదకుటకు; గతాః = పోయిరి; విమానానామ్ = దేవతావిమానములయొక్క; వ్రాతః = సమూహము; దివిషదామ్ = వేల్పుల యొక్క; వీథీః = మార్గములను; విదలయతి = విశేషముగాఁ జీల్చుచున్నది.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! నీ వెప్పుడు స్వర్గలోకమునుండి భూలోకమునకు దిగితివో

యప్పుడే కల్యాణాత్మక మైన నీ కథ భూమండల మంతయు వ్యాపించినది. జనులందఱు నీలో స్నానము చేసి నీ నామజపమును జేయుటచే వారి పాపములన్నియుఁ బటాపంచ లైనవి. అందఱును బుణ్యాత్ములే యగుటచే యముని సంయమనీపురములోఁ బాపాత్ముల రాకపోకలు లేకుండుటచే సద్దు మణఁగినది. యమదూత లందఱు గంగానామస్మరణము చేయని పాపాత్ముల శవములను వెదకుటకై దూరముగాఁ బోయిరి. పుణ్యాత్ములను స్వర్గమునకుఁ దీనికొని వెళ్ళుటకై దేవతల విమానముల పంక్తులాకాశమార్గములను జీల్చుకొనుచుఁ బోవుచున్నవి. విమానములు వ్యోమయానము లగుటచే మేఘములను జీల్చుకొనుచు స్వర్గమార్గములలో నెగురుచున్నవి. ఇదంతయు నీ కథా మాహాత్మ్యమే యని భావము.

**అవతారిక :** ఇప్పుడు గంగ యందలి నీటికణములు సంతాపమును బోఁగొట్టుఁగాక! యని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ స్ఫురత్కామక్రోధప్రబలతరసఞ్జాతజటిల-**
**జ్వరజ్వాలాజాలజ్వలితవపుషాం నః ప్రతిదినమ్ ।**
**హరన్తాం సన్తాపం కమపి మరుదుల్లాసలహరి**
**చ్ఛటాచఞ్చత్పాథఃకణసరణయో దివ్యసరితః ॥ 26**

**ప్రతిపదార్థము :** దివ్యసరితః = దేవనదియైన గంగయొక్క; దీనికిఁ గణసరణులతో నన్వయము. మరుత్ = గాలిచే; ఉల్లాస = సంతోషముతో నిండిన; లహరి = కెరటముల యొక్క; ఛటా = సమూహముయొక్క; చంచత్ = ప్రకాశించుచున్న; పాథఃకణ = నీటి బిందువుల యొక్క; సరణయః = మార్గములు; స్ఫురత్ = ప్రకాశించుచున్న (ఉద్ధృతమైన); కామ = కోరికలు; క్రోధ = కోపములు; ఇది యుపలక్షణము. లోభమోహామద మాత్సర్యములు – వీనిచే; ప్రబలతర = మిక్కిలి యతిశయముగా; సంజాత = పుట్టిన; జటిల = శిఖలతో (సెగలతో) జడలు కట్టిన; జ్వర = వేఁడియైన; జ్వాలా = మంటల యొక్క; జాల = సమూహముచే; జ్వలిత = మండిపోవుచున్న; వపుషామ్ = దేహముగల; నః = మాయొక్క; కమపి = ఒకానొక చెప్పలేని; సంతాపమ్ = దుఃఖముల వేఁడిమిని; ప్రతిదినమ్ = నిత్యము; హరంతామ్ = హరించుఁగాక! పోఁగొట్టుఁగాక!

**తాత్పర్యము :** గాలి కుల్లాసముతోఁ గదలుచున్న దివ్యగంగానది తరఁగల పంక్తుల నుండి ప్రకాశించుచు వెలువడిన నీటి తుంపరల గుంపులు – ఉద్ధృతమైన కామక్రోధములచే మిక్కిలి యెక్కువగాఁ బుట్టిన సెగలతో జడలు గట్టి వేఁడిగా నున్న మంటల సమూహముచే మండిపోవుచున్న శరీరములు గల మాయొక్క చెప్పశక్యము గాని సంతాపమును బ్రతిదినము హరించుఁగాక! యని భావము.

**విశేషములు :** ఈ శ్లోకములో మొదటిపాదములో 'జ'కారము; రెండవపాదములో 'జ్వ'వర్ణము మూఁడవ పాదములో 'త'కార 'ల'కారములు, నాల్గవపాదములో – 'చ'కార 'ఙ'కారములు ననేకపర్యాయము లావృత్తమగుటచే వృత్త్యనుప్రాసము.

**అవతారిక :** ఇప్పుడు గంగాజలసంఘాతము మా తాపము నణఁచుఁగాక! యని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ ఇదం హి బ్రహ్మాణ్డం సకలభువనాభోగభవనం**
**తరఙ్గైర్యస్యాన్తర్లుఠతి పరితస్తిన్దుకమివ ।**
**స ఏవ శ్రీకణ్ఠప్రవితతజటాజూటజటిలో**
**జలానాం సంఘాతస్తవ జనని! తాపం హరతు నః ॥ 27**

**ప్రతిపదార్థము :** జనని = తల్లీ! గంగా! సకల = సమస్త, భువన = లోకముల యొక్క; చతుర్దశభువనములు నని యర్థము. (1) అతల (2) వితల (3) సుతల (4) రసాతల (5) మహాతల (6) తలాతల (7) పాతాళము లను యే డధోలోకములు. (1) భూలోక (2) భువర్లోక (3) సువర్లోక (4) మహర్లోక (5) జనలోక (6) తపోలోక (7) సత్యలోకము లనునవి యే డూర్ధ్వలోకములు. వీని యొక్క; ఆభోగ = పరిపూర్ణత్వముతో నిండిన; భవనమ్ = మందిరమైన; ఇదమ్ = ఈ; బ్రహ్మాండమ్ = బ్రహ్మాండ మంతయును; యస్య = దేనియొక్క; (ఏ శివజటాజూటముయొక్క); అంతః = లోపల; తరంగైః = కెరటములతో; పరితః = అంతట; తిందుకమివ = తుమ్మిక కాయవలె; లుఠతి = పొర్లుచున్నది (మునిఁగి తేలుచున్నది); హి = ఆశ్చర్యము; శ్రీకంఠ = శివునియొక్క; ప్రవితత = మిక్కిలి విశాలమైన; జటాజూట = కపర్దము నందు; జటిలః = దట్టముగా వ్యాపించిన; సః = ఆ; ఏషః = ఈ; తవ = నీయొక్క; జలానామ్ = నీళ్ళ యొక్క; సంఘాతః = సమూహము, నః = మాయొక్క; తాపమ్ = దుఃఖముల వేఁడిమిని; హరతు = హరించుఁగాక!

**తాత్పర్యము :** పదునాల్గు భువనములతో విస్తీర్ణమైన యీ బ్రహ్మాండమంతయు గంగాజల సంఘాతములోఁ దుమ్మిక కాయవలెఁ దేలుచున్నది. ఆ గంగానది శివునిజటాజూటములో దట్టముగా వ్యాపించినది. అట్టి గంగాజలముల సమూహము మా తాపమును పోఁగొట్టుఁ గాక యని భావము.

**విశేషములు :** ఈ శ్లోకములో బ్రహ్మాండమును దిందుకముతోఁ బోల్చుటచే నుపమాలంకారము. బ్రహ్మాండము కంటె జలసంఘాతము, దాని కంటె జటాజూటము పెద్దదని యుత్తరోత్తరోత్కర్షమును వర్ణించుటచే సారాలంకారము. **'ఉత్తరోత్తరముత్కర్షః**

**సార ఇత్యభిధీయతే'** యని కువలయానందలక్షణము. తృతీయ – చతుర్థ పాదములలో జకార మెక్కువగా నావృత్తి యగుటచే వృత్త్యనుప్రాసము. ఇట్లు శబ్దార్థాలంకారములు రెండింటికిఁ దిలదండులములవలె సంసృష్టి.

**అవతారిక :** ఇప్పుడు నీవు సకలతీర్థములను సమస్తదేవతలను విడిచిపెట్టి గంగనే యేల సేవించుచున్నా వన్నచోఁ గారణము చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ త్రపన్తే తీర్థాని! త్వరితమిహ యస్యోద్ధృతివిధౌ**
**కరం కర్ణే కుర్వన్త్యపి కిల కపాలిప్రభృతయః ।**
**ఇమం తమ్ మామమ్బ! త్వమియమనుకమ్పార్ద్రహృదయే!**
**పునానా సర్వేషామఘమథనదర్పం దలయసి ॥ 28**

**ప్రతిపదార్థము :** అంబ! = తల్లీ! గంగా!; త్వరితమ్ = వేగముగా; యస్య = దేనియొక్క; ఉద్ధృతవిధౌ = ఉద్ధరించు విధానములో; తీర్థాని = గోదావరి మొదలగు పుణ్యనదులు; త్రపంతే = సిగ్గుపడుచున్నవో; కపాలి = శివుఁడు; ప్రభృతయః = మొదలగువారు; కరమ్ = చేతిని; ఇది జాత్యేకవచనము, చేతులతో నని భావము; కర్ణే = చెవియందు; ఇది కూడ జాత్యేకవచనమే. చెవుల యందు నని భావము; కిల = ఇట్టివాని నుద్ధరించుట యను భావముతో; **'అళీకేఽపి కిల స్మృతః, న్యక్కారేఽనుచితే హేతౌ'** అని లింగాభట్టీయము. కుర్వంతి అపి = చేర్చుచున్నారు కూడ; అనుకంపా = దయతో; ఆర్ద్ర = తడిసిన; హృదయే = మనస్సు కలదానా! ఓ భాగీరథీ!; తమ్ = అట్టి పాపాత్ముఁడనైన; ఇమమ్ = ఈ; మామ్ = నన్ను జగన్నాథుని; పునానా = పవిత్రునిగాఁ జేయుచున్న; ఇయమ్ = ఈ; త్వమ్ = నీవు; సర్వేషామ్ = అందఱియొక్క; అఘ = పాపమును; మథన = నాశనముచేయుటలోఁగల; దర్పమ్ = గర్వమును; దలయసి = చీల్చుచున్నావు; అణఁచుచున్నావు.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! ఈ పాపాత్ముని వేగముగా నుద్ధరించుట కేమి విధానము గలదని గోదావర్యాది పుణ్యనదులన్నియు సిగ్గు పడుచున్నవి. నా మొఱ నాలింపలేక శివుఁడు మొదలగు దేవత లందఱు చేతినిఁ జెవిపైఁ బెట్టుకొనుచున్నారు. అట్టి పాపాత్ముఁడ నగు నీ జగన్నాథుని నన్ను దయార్ద్రచిత్తవై పవిత్రునిగాఁ జేయుచు 'మేమే సకలపాపములను నాశనము చేయుటలో సమర్థుల' మనుకొనుచున్న సర్వదేవతల గర్వమును నాశనము చేయుచున్నావు. ఇక్కడఁ బ్రయోగింపఁబడిన చేయి, చెవి యనునవి జాత్యేకవచనములు. లేక శివాదులు నా మొఱ వినలేక కుడిచేతినిఁ గుడిచెవిపైఁ జేర్చి మూసికొనుచున్నా రనఁగా నవసరము వచ్చినపుడు చూచికొంద మను భావముతో

రెండవ చెవినిఁ దెఱచిపెట్టి నా మొఱ నాలకించుచున్నారు గాని రక్షించుట లేదని భావము.

**విశేషములు :** ఈ శ్లోకము రసగంగాధరము నందలి కావ్యలింగప్రకరణములో నుదాహరింపఁ బడినది –

అత్ర సకలదేవతీర్థదర్పదళనస్య సిద్ధయే స్వాత్మపవిత్రీకరణం వక్త్రా నిబద్ధమ్. తచ్చ క్షుద్రత్వాత్ తాదృశసిద్ధ్యసమర్థం విశేషకాంతరమాకాంక్షతీతి తీర్థకర్తృకత్రపాకరణం కపాలి ప్రభృతికర్తృకకర్ణముద్రణం చేతి వాక్యార్థద్వయం స్వాత్మరూపకర్మద్వారా విశేషక ముపాత్తమ్. తద్విశిష్టం చ తాదృశపవిత్రీకరణమ్ భాగీరథ్యుపారూఢం తాదృశ–కార్యోపపాదన సమర్థమితి భవతి హేతుః.

ఇక్కడ సమస్తదేవతలయొక్క సకలపుణ్యతీర్థములయొక్క గర్వము నణఁచి వేయుట యనునది సిద్ధించుటకై తన యాత్మను బవిత్రీకరించుకొనుట కవిచే (లేక స్తోత్రపాఠకునిచే) నిబద్ధమైనది అది క్షుద్రము కావున నట్టి దర్పదలనసిద్ధి కసమర్థమగుటచే మఱియొక విశేషకము నాకాంక్షించుచున్నది గావునఁ దీర్థకర్తృకత్రపాకరణము (తక్కిన నదులు సిగ్గుపడుట), కపాలిప్రభృతికర్తృకకర్ణముద్రణము (ఈశ్వరుఁడు మొదలగు దేవతలు చెవులు మూసికొనుట యను రెండు వాక్యార్థములతో స్వాత్మరూపకర్మ (స్వాత్మపవిత్రీకరణ) ద్వారముగా విశేషకము (మఱియొక విశేషణము) వేయఁబడినది. ఆ విశేషకముచే విశిష్టమైన యట్టి పవిత్రీకరణము భాగీరథి యందున్నదై యట్టి కార్యమును జేయుటకు సమర్థమగుటచే హేతు వగుచున్నది. ఈ హేతు – హేతుమద్భావముచేఁ గావ్యలింగము సిద్ధించినది.

**అవతారిక :** ఇప్పుడు సకలపాపహారిణియైన గంగను శ్లాఘించుటకు నరపశు వెట్లు సమర్థుఁడగు? నని ప్రశ్నించుచున్నాఁడు –

**శ్లో॥ శ్వపాకానాం వ్రాతైరమితవిచికిత్సావిచలితై**
**ర్విముక్తానామేకం కిల సదనమేనః పరిషదామ్ ।**
**అహో! మాముద్ధర్తుం జనని! ఘటయన్త్యాః పరికరం**
**తవ శ్లాఘాం కర్తుం కథమివ సమర్థో? నరపశుః ॥ 29**

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! గంగా! అమిత = మితిలేని; విచికిత్సా = సంశయములతో; విచలితైః = బాగుగాఁ జలించిన (వణఁకిన); శ్వపాకానామ్ = కుక్కలను గూడ వండుకొని తిను చండాలురయొక్క; వ్రాతైః = సమూహములచే; విముక్తానామ్ = విడిచి పెట్టఁబడిన; ఏనః = పాపములయొక్క; పరిషదామ్ = సభలకు

(సమూహములకు); కిల = నిశ్చయముగా; ఏకమ్ = ఒకే; సదనమ్ = గృహమైన (స్థానమైన); మామ్ = నన్ను; ఆహా! = ఆశ్చర్యము!; ఉద్ధర్తుమ్ = ఉద్ధరించుటకు; పరికరమ్ = సాధనమును; ఘటయంత్యాః = సంఘటించుచున్న; లేక; పరికరమ్ = నడికట్టును; ఘటయంత్యాః = బిగించుచున్న; తవ = నీయొక్క; శ్లాఘామ్ = ప్రశంసను; కర్తుమ్ = చేయుటకు; నరపశుః = పశువువంటి నరుఁడు; కథమ్ ఇవ = ఎట్లు? సమర్థః = నిపుణుఁడగును.

**తాత్పర్యము :** జననీ! గంగా! అనేకవిధములైన పాపములను జేసి యింకను జేయవలసిన పాపములున్నవా? లేవా? యను నపరిమిత సందేహములతో విశేషముగాఁ జలించుచుఁ గుక్కలను గూడఁ బచనము చేసికొని తిను చండాలురచేఁ గూడ విడిచిపెట్టఁబడిన పాపపుంజమున కేకనిలయమైన నావంటి వానినిఁ గూడ నుద్ధరించుటకై నడుమును బిగించుచున్న నిన్నుఁ జూచినచో నాశ్చర్యము వేయుచున్నది. ఇట్టి పతితోద్ధారిణి వగు నిన్ను శ్లాఘించుటకై (పొగడుటకై) నా వంటి నరపశు వెట్లు సమర్థుఁ డగు నని భావము.

**విశేషములు :** ఈ శ్లోకము రసగంగాధరము నందలి యుల్లాసాలంకారప్రకరణములో నుదాహరింపఁబడినది –

అన్యదీయగుణదోషప్రయుక్తమన్యస్య గుణదోషయోరాధానముల్లాసః **శ్వపాకానాం వ్రాతైః**... ... ... అత్ర వక్తృగతపాపరూపదోషప్రయుక్తస్తదుద్ధర్త్ర్యాః శ్రీగంగాయాః శ్లాఘ్యత్వం గుణః.

ఒక దాని గుణదోషములచే మఱియొక దాని గుణదోషములను వర్ణించుట యుల్లాసాలంకారము. ఇది (1) గుణముచే గుణమును వర్ణించుట (2) గుణముచే దోషమును వర్ణించుట (3) దోషముచే గుణమును వర్ణించుట (4) దోషముచే దోషమును వర్ణించుట యని నాల్గు విధములు. ఇక్కడ వక్త యందున్న పాపరూప మగు దోషము వాని నుద్ధరించు శ్రీగంగయొక్క శ్లాఘనీయత్వముగా వర్ణించుటచే గుణమైనది. ఇది దోషముచే గుణమును వర్ణించిన యుల్లాసము.

**అవతారిక :** నావంటి పాపాత్ముఁ డింత వరకు నీకుఁ దారసిల్లలేదు. నీ కోరికను దీర్చుటకై నేను సిద్ధమైతి నని చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ న కో౽ప్యేతావన్తం ఖలు సమయమారభ్య మిలితో**
**యదుద్ధారాదారాద్భవతి జగతో విస్మయభరః ।**

**ఇతీమామీహాం తే మనసి చిరకాలం స్థితవతీ-**
**మయం సమ్ప్రాప్తో౽హం సఫలయితుమమ్బ! ప్రణయ నః ॥ 30**

**ప్రతిపదార్థము :** అంబ! = అమ్మా! గంగా! యత్ = ఎవనిని; ఉద్ధారాత్ = ఉద్ధరించుట వలన; ఆరాత్ = వెంటనే; జగతః = లోకమునకు; విస్మయభరః = ఆశ్చర్యభారము; భవతి = అగునో (కల్గునో); కః అపి = అట్టివాఁ డెవ్వఁడును గూడ; ఏతావంతం సమయమ్ = ఇంత కాలము; ఆరభ్య = మొదలుకొని; ఖలు = నిశ్చయముగా; న మిలితః = సంప్రాప్తము కాలేదు (కలియ లేదు); ఇతి = అని; తే = నీయొక్క; మనసి = మనస్సులో; చిరకాలమ్ = చాలకాలమునుండి; స్థితవతీమ్ = ఉన్నటువంటి; ఇమామ్ = ఈ; ఈహామ్ = కోరికను; సఫలయితుమ్ = సఫలము చేయుటకై; అయమ్ = ఈ జగన్నాథుఁడనగు; అహమ్ = నేను; సంప్రాప్తః = సంప్రాప్తుఁడ నైతిని. నః = మమ్ము; ప్రణయ = ఉత్తమగతినిఁ బొందింపుము.

తాత్పర్యము : తల్లీ! గంగా! ఎట్టివాని నుద్ధరించినచో వెంటనే లోకమున కెక్కువ యాశ్చర్యము కల్గునో యట్టి వాఁ డింకను నాకు లభింప లేదనెడి యే కోరిక నీ మనస్సులోఁ జిరకాలమునుండి యున్నదో దానిని సఫలము చేయుటకై యీ జగన్నాథుఁడు నీ ముందునకు వచ్చినాఁడు. తల్లియొక్క చిరకాలవాంఛను దీర్చుట పుత్రుని ధర్మము గదా! అందుకోసమే నే నిన్ని పాపములను జేసితి నని 'యంబ' యను సంబోధనములోని భావము. నా పాపముల నన్నింటినిఁ బోఁగొట్టి మంచిగతినిఁ బ్రసాదింపు మని తాత్పర్యము.

**అవతారిక :** ఇప్పుడు తాను జేసిన పాపములనే యేకరువు పెట్టుచున్నాఁడు -

**శ్లో॥ శ్వవృత్తివ్యాసఙ్గో నియతమథ మిథ్యాప్రలపనం**
**కుతర్కేష్వభ్యాసః సతతపరపైశున్యమననమ్ ।**
**అపి శ్రావం శ్రావం మమ తు పునరేవం గుణగణా**
**నృతే త్వత్ కో నామ క్షణమపి నిరీక్షేత వదనమ్ ॥ 31**

**ప్రతిపదార్థము :** తల్లీ! శ్వవృత్తి = కుక్కవలె వర్తించు; వ్యాసంగః = ఉద్యోగము; అథ = ఇంకను; నియతమ్ = నియమముగా; మిథ్యా = అసత్యములను; ప్రలపనమ్ = ప్రేలుట; (అబద్ధములాడుట); కుతర్కేషు = చెడ్డ యూహలయందు; అభ్యాసః = అలవాటు; పరులను వంచింపవలెను; పరస్త్రీలతో రమింపవలెను మొదలగు కుత్సితమైన యూహలు; లేక దేవుఁడు లేఁడని వాదించుట మొదలగు నాస్తిక్యబుద్ధి కుతర్కము. లేక పరబ్రహ్మ ప్రతిపాదకములగు నద్వైతవేదాంతశాస్త్రగ్రంథములను పాండిత్యబలముతోఁ

బరజయేచ్ఛతో ఖండింపవలె ననెడి బుద్ధి కుతర్కము. సతత = ఎల్లప్పుడు; పర = ఇతరులయొక్క; పైశున్య = దౌర్జన్యములను; మననమ్ = ఎక్కువగా నెమరువేయుట; దుర్మార్గులైన యన్యులు చేసెడి దైర్జన్యములు చూచి 'మనము కూడ నట్లు చేసినచోఁ దప్పేమి గలదు!' అను బుద్ధితో నా విషయములను మాటి మాటికి నాలోచించుట; ఏవమ్ = ఈ విధములైన; గుణగణాన్ = గుణగణములను; పునః = మఱల; శ్రావం శ్రావమ్ = విని విని; అపి = కూడ; త్వద్ ఋతే = నీవు తప్ప; కః నామ = ఎవ్వరైనను; క్షణమ్ అపి = త్రుటికాలమైనను గూడ; మమ తు = ఇట్టి నా యొక్క; వదనమ్ = ముఖమును; నిరీక్షేత = చూతురా?

**తాత్పర్యము :** తల్లీ! గంగా! నేను చేసిన పాపములను జెప్పుచున్నాను. వినుము! కుక్క యటునిటు తిరిగి యెంగిలి కూడు భక్షించి నట్లుగా నుద్యోగము చేసితిని. సత్యము పలుకుట మాని యసత్యమములనే ప్రలపించితిని. పరమపుణ్యశీలుఁడగు ధర్మరా జొక్క మాఱబద్ధమాడుట వల్లనే రథము కూలుట – నరకమును దర్శించుట మహాభారతములోఁ బ్రసిద్ధము. కుతర్కముల నభ్యసించితిని, శిష్టుల చరిత్రమును విడిచి పెట్టి దుష్టులు చేసిన దౌర్జన్యములను వల్లించితిని. ఇన్ని విధములైన గుణగణములను మాటిమాటికి నాలకించి యాలకించి కూడ నావంటి వాని మొగమును నీవు తప్ప మఱెవ్వరు తిలకింతురు?

**విశేషములు :** 'శ్రు–శ్రవణే' యను ధాతువునకుఁ బౌనఃపుణ్యార్థములో 'ణముల్' ప్రత్యయము చేరఁగా 'శ్రావమ్' అను రూపమేర్పడును. ణములంతధాతువు లెప్పుడును జంటలు జంటలుగాఁ బ్రయోగింపఁబడును.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యుల్లాసప్రకరణములో నుదాహరింపఁ బడినది.

యథా వా – శ్వవృత్తివ్యాసంగో... ... ఇహాపి ప్రాగ్వదేవ కింతు వ్యంగ్యః స ఇతి విశేషః

ఈ శ్లోకము కూడ నుల్లాసాలంకారమున కూదాహరణమే. ఇక్కడఁ గూడ వక్తయందున్న శ్వవృత్తివ్యాసంగ – మిథ్యాప్రలపన – కుతర్కాభ్యాస – పరపైశున్య మననరూపము లగు దోషములు తన్నుద్ధరించు శ్రీగంగయొక్క శ్లాఘ్యత్వగుణముగా వర్ణింపఁబడినవి. ఇందుఁ గూడ దోషముచే గుణమును వర్ణించిన యుల్లాసాలంకారమే కలదు.

**అవతారిక :** ఇప్పుడు గంగను జూచిన కన్నులే కన్నులు; గంగాతరంగశబ్దము నాలించిన చెవులే చెవులని చెప్పుచున్నాఁడు.

**శ్లో॥ విశాలాభ్యామాభ్యాం కిమిహ నయనాభ్యాం ఖలు ఫలం**
**న యాభ్యామాలీఢా పరమరమణీయా తవ తనుః ।**
**అయం హి న్యక్కారో జనని! మనుజస్య శ్రవణయో-**
**ర్యయోర్మాతర్యాతస్తవ లహరిలీలాకలకలః ॥ 32**

**ప్రతిపదార్థము :** జనని! = తాయీ! గంగా! ఇహ = ఈ లోకములో; మనుజస్య = మనుష్యునియొక్క; యాభ్యామ్ = ఏ కన్నులచేత; తవ = నీయొక్క; పరమరమణీయా = మిక్కిలి యందమైన; తనుః = శరీరము (ప్రవాహము); న ఆలీఢా = చూడఁ బడలేదో; ఆభ్యామ్ = ఆ; విశాలాభ్యామ్ = పెద్దవి యైన; నయనాభ్యామ్ = కన్నుల వలన; ఫలమ్ = ఫలితము; ఖలు = నిశ్చయముగా; న = లేదు; మాతః = అమ్మా! యయోః = ఏ; శ్రవణయోః = చెవులయందు; తవ = నీయొక్క; అయమ్ = ఈ; లహరి = కెరటములయొక్క; లీలా = విలాసముతోఁ గూడిన; కలకలః = కోలాహలధ్వని యొక్క; న్యక్కారః = ధిక్కారము; యాతః = వచ్చినదో (కలిగినదో); హి = నిశ్చయముగా; కిం ఫలమ్ = ఆ చెవుల కేమి ఫలితము గలదు?

**తాత్పర్యము :** తాయీ! గంగా! ఈ లోకములో నే మనుజుని కన్నులు పరమరమణీయ మైన నీ తనువును (ప్రవాహమును) జూడ లేదో వాని విశాలమైన కన్నులచే నేమి ప్రయోజనము కలదు? అట్లే యెవని చెవులు నీ కెరటముల యొక్క విలాసముచేఁ బుట్టు ధ్వనిని ధిక్కరించునో (తిరస్కరించునో) వాని చెవుల వలన నేమి ప్రయోజనము కలదు? ఏ ప్రయోజనము లేదని భావము. నిన్నుఁ జూచిన కన్నులును నీ తరంగధ్వనిని వినిన చెవులును సఫలములుగాని తక్కిన వాని వల్లఁ బ్రయోజనము లేదని భావము.

**విశేషములు :** ఇక్కడ మొదటి పాదములో 'భ్యా' వర్ణము చతుర్థపాదములో 'త'కార 'ల'కారములు పెక్కు మాఱులు వచ్చుటచే వృత్త్యనుప్రాసము. 'పరమ-రమ' యనుచోట 'రమ' యను శబ్ద మర్థభేదముతో రెండు మాఱులు వచ్చుటచే ఛేకానుప్రాసము. ఇక్కడ నీ దర్శనము (వినా) లేని కన్నులకు నీ శ్రవణము (వినా) లేని చెవులకు ఫలము లేదని చెప్పుటచే వినోక్తిధ్వని కలదని శ్రీసదాశివభట్టు చెప్పినాఁడు.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి వినోక్తిప్రకరణములో నుదాహరింపఁ బడినది – "అత్ర త్వద్దర్శనం వినా నయనయోః త్వల్లహరికోలాహలశ్రవణం వినా శ్రవణయోశ్చారమణీయత్వమ్ ఫలప్రశ్న -ధిక్కారాభ్యాం వ్యజ్యతే".

ఈ శ్లోకమే రసగంగాధరము నందలి యుల్లాసాలంకారప్రకరణములో నుదాహరింపఁబడినది – "అత్ర శ్రీభాగీరథీరమణీయత్వగుణేన తద్రూప – శబ్ద విముఖయోర్నయనయోః శ్రవణయోశ్చ నైష్ఫల్య –ధిక్కారరూపౌ దోషౌ".

ఇక్కడ శ్రీభాగీరథియొక్క రమణీయత్వగుణముచే గంగారూపమును జూచుటలో విముఖములైన కన్నులయొక్క నిష్ఫలత్వము; గంగాశబ్దమునకు విముఖము లైన చెవులయొక్క ధిక్కారము నను దోషములను వర్ణించుటచే నిది గుణముచే దోషమును వర్ణించిన యుల్లాసము.

**అవతారిక :** ఇప్పుడు గంగ యున్నచోట నున్న మనుజులు పుణ్యాత్ము లనియు; గంగ లేనిచోట నివసించు నరులు పాపాత్ములనియు వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ విమానైః స్వచ్ఛన్దం సురపురమయన్తే సుకృతినః**
**పతన్తి ద్రాక్ పాపా జనని! నరకాన్తః పరవశాః ।**
**విభాగోఽయం తస్మిన్నశుభమయమూర్తౌ జనపదే**
**న యత్ర త్వం లీలాదలితమనుజాశేషకలుషా ॥ 33**

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! గంగా! సుకృతినః = పుణ్యాత్ములు; స్వచ్ఛందమ్ = స్వేచ్ఛగా; విమానైః = విమానములలో; సురపురమ్ = దేవపట్టణమైన యమరావతికి; అయంతే = వెళ్ళుచున్నారు; పాపాః = పాపములు చేసినవారు; పరవశాః = పరాధీనులై; ద్రాక్ = వేగముగా; నరక = యమలోకము యొక్క; అంతః = మధ్యభాగములో; పతంతి = పడుచున్నారు. యత్ర = ఎక్కడ; లీలా = హేలగా; దలిత = చీల్చివేయఁబడిన; దీనికిఁ 'గలుషా' తో నన్వయము. మనుజ = మనుష్యులయొక్క; అశేష = మిగులకుండ (నిశ్శేషముగా) కలుషా = పాపములు గల; త్వమ్ = నీవు; తస్మిన్ = ఆ; అశుభ మయమూర్తౌ = అమంగళములతోఁ బ్రచురమై మూర్తీభవించిన; జనపదే = దేశమునందు; న = లేవో; (తత్ర = అక్కడ); అయమ్ =ఈ; విభాగః = విభాగము; (అస్తి = ఉన్నది) అని శేషము.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! కొందఱు పుణ్యాత్ములు విమానములలో స్వేచ్ఛగా స్వర్గలోకమున కేఁగు చున్నారు. కొందఱు పాపాత్ములు పరాధీనులై శీఘ్రముగా నరకలోక మధ్యభాగములోఁ బడుచున్నారు. లీలగా మనుజుల యశేషపాపములను జీల్చివేయు నీవు – అమంగళములు ప్రచురముగా నున్న యే దేశములో నుండుట లేదో దాని వలన నీ విభాగ మేర్పడుచున్నది. నీవు ప్రవహించు దేశము మంగళమయ మనియు; నీవు ప్రవహింపని దేశ మమంగళ ప్రచుర మనియు భావము.

**విశేషములు :** ఇక్కడ 'దలితమనుజాశేషకలుషా' యను విశేషణము సాభిప్రాయ మగుటచేఁ బరికరాలంకారము. **'అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే'** అని జయదేవుని చంద్రలోకలక్షణము.

**అవతారిక :** ఇప్పుడు మహాపాతకములు చేసిన వారు కూడ మరణసమయములో నీలోఁ దనువును విడిచిపెట్టినచో ముక్తినిఁ బొందుచున్నారని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అపి ఘ్నన్తో విప్రానవిరతముశన్తో గురుసతీః**
**పిబన్తో మైరేయమ్ పునరపహరన్తశ్చ కనకమ్ ।**
**విహాయ త్వయ్యన్తే తనుమతనుదానాధ్వరజుషా**
**ముపర్యమ్బ! క్రీడన్త్యఖిలసురసమ్భావిత పదాః ॥ 34**

**ప్రతిపదార్థము :** అంబ! = తాయీ! గంగా! విప్రాన్ = బ్రాహ్మణులను; అపి = కూడ; అవితరమ్ = నిరంతరము (ఇది యన్నిచోట్ల నన్వయించును); ఘ్నంతః = చంపుచున్నవారు; గురుసతీః = ఆచార్యుల భార్యలను; ఉశంతః = కామించుచున్నవారు; మైరేయమ్ = కల్లును; పిబంతః = త్రాగుచున్నవారు; పునః = మఱియు; కనకమ్ = బంగారమును; అపహరంతశ్చ = దొంగిలించుచున్నవారు; చ శబ్దముచే వీరినిఁ గూడిన వారు; ఇవి మహాపాతకములు. వీరితోఁ గూడుట యైదవ మహాపాతకము. అంతే = చివరి కాలములో; త్వయి = నీయందు; తనుమ్ = శరీరమును; విహాయ = విడిచిపెట్టి; అఖిల = సమస్త; సుర = దేవతలచే; సంభావిత = సంభావింపఁబడిన (పూజింపఁబడిన); పదాః = పాదములు గల వారై; అతను = తక్కువకాని; దాన = దానములు; అధ్వరజుషామ్ = యజ్ఞములు చేసినవారికి; ఉపరి = పైఁగా; క్రీడంతి = క్రీడించు చున్నారు.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! ఎల్లప్పుడు బ్రాహ్మణులను గూడఁ జంపుచున్నవారు; ఉపాధ్యాయ పత్నులతోఁ గూడుచున్నవారు; కల్లును ద్రావుచున్నవారు; మఱియును బంగారము నపహరించుచున్నవారు నింకను వీరితోఁ గూడి సహకరించుచున్న వారును గూడ నంతకాలములో నీలో దేహమును విడిచిపెట్టిన వారై యనేకదానములు యజ్ఞములు గావించిన వారికిఁ బైవారై సకలసురలచే సేవింపఁబడిన చరణములు గలవారై స్వర్గలోకములోఁ గ్రీడించుచున్నా రని భావము.

**విశేషములు :** శ్లో॥ బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమః ।
మహాన్తి పాతకాన్యాహుః సంసర్గశ్చాపి తైస్సహ ॥ (మను. 11-54)

(1) బ్రహ్మహత్య (2) సురాపానము (3) స్వర్ణస్తేయము (4) గురుభార్యాగమనము

నాలుగు మహాపాతకములు. ఈ నలువురతోఁ గూడుట యైదవ మహాపాతక మని మనువు ధర్మశాస్త్రములోఁ జెప్పినాఁడు.

జగన్నాథకవి యీ భావమునే యమునాలహరిలోఁ గూడఁ జెప్పినాఁడు–

శ్లో॥ స్వర్ణస్తేయపరానపేయరసికాన్ పాథః కణాస్తే యది
బ్రహ్మఘ్నాన్ గురుతల్పగానపి పరిత్రాతుం గృహీతవ్రతాః ।
ప్రాయశ్చిత్తకులైరలం తదధునా మాతః! పరేతాధిప–
ప్రౌఢాహంకృతిహారిహుంకృతిముచామగ్రే తవ స్రోతసామ్ ॥

**అవతారిక :** ఇప్పుడు చోరుఁడు, ప్రాణహారియు నగు వాయుదేవుఁడు కూడ నీ సంసర్గము వల్లనే లోకములను బవిత్రీకరించుచున్నాఁడని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అలభ్యం సౌరభ్యం హరతి నియతం యః సుమనసాం**
**క్షణాదేవ ప్రాణానపి విరహశస్త్రక్షతభృతామ్ ।**
**త్వదీయానాం లీలాచలితలహరీణాం వ్యతికరాత్**
**పునీతే సోఽపి ద్రాగహహ! పవమానస్త్రిభువనమ్ ॥ 35**

**ప్రతిపదార్థము :** గంగా! నియతమ్ = నియమముగా; యః = ఎవఁడు; సుమనసామ్ = పూవులయొక్క; అలభ్యమ్ = లభ్యముకాని, సౌరభ్యమ్ = సువాసనను; హరతి = దొంగిలించుచున్నాఁడో; దీని వలన వాయుదేవుని దొంగతనము వ్యక్తమగుచున్నది; యః = ఎవఁడు; విరహ = వియోగమును; శస్త్ర = ఆయుధముచేఁగలిగిన; క్షతభృతామ్ = గాయములను భరించు (కల) వారి; ప్రాణాన్ అపి = ప్రాణములను గూడ; క్షణాత్ ఏవ = క్షణములోనే; హరతి = హరించుచున్నాఁడో (తీయుచున్నాఁడో) దీనివలన వాయుదేవుని జీవహంతృత్వము వెల్లడి యగుచున్నది. సః = ఆ; పవమానః = వాయుదేవుఁడు; అపి = కూడ; త్వదీయానామ్ = నీయొక్క; లీలా = విలాసముచే; చలిత = కదలిన; లేక; ఆచలిత = బాగుగా కదలిన; లహరీణామ్ = కెరటములయొక్క; వ్యతికరాత్ = సంబంధముచే; త్రిభువనమ్ = స్వర్గ – మర్త్య – పాతాళములను మూఁడు లోకములను; ద్రాక్ = వేగముగా; పునీతే = పవిత్రముగాఁ జేయుచున్నాఁడు; అహహ = ఆశ్చర్యము.

**తాత్పర్యము :** గంగా! ఎవఁడు నిరంతరము పుష్పముల యందలి పొందు శక్యము కాని సుగంధమును దొంగిలించుచున్నాఁడో; యెవఁడు వియోగ శస్త్రముచే క్షతగాత్రులైన కాముకుల ప్రాణములను దీయుచున్నాఁడో; యా వాయుదేవుఁడు కూడ నీయొక్క విలాసముగాఁ జలించుచున్న తరంగములయొక్క సంబంధముచే శీఘ్రముగా

ముజ్జగములను బవిత్రీకరించుచున్నాఁడు. ఆశ్చర్యము! నీలో స్నానము చేసిన దొంగలు ఘాతుకులు కూడఁ బుణ్యాత్ములగుచున్నారని భావము. గంగాజలము మాత్రమే కాదు. దానిపై నుండి వీచు గాలి కూడఁ బవిత్రమని తాత్పర్యము.

**విశేషములు :** ఇక్కడ **'విరహాశస్త్రక్షతభృతామ్'** అనుచోట **'విరహాశస్త్రక్షతహృదామ్'** అను పాఠాంతర మున్నట్లు సదాశివభట్టు సూచించినాఁడు. అప్పుడు విరహా = వియోగమనెడు; శస్త్ర = ఆయుధముచే; క్షత = గాయములు తగిలిన; హృదామ్ = హృదయములు గల కాముకులని యర్థము చెప్పుకొనవలయును.

ఇక్కడఁ ద్రిభువనములను బవిత్రముగాఁ జేయుట వాయువుయొక్క గొప్పతనము కాదు. గంగాతరంగముల సంబంధము యొక్క గొప్పదనము.

హనుమన్నాటకములోఁ గూడ నిట్లే వర్ణింపఁబడినది –

శ్లో॥ యే మజ్జన్తి నిమజ్జయన్తి చ పరాంస్తే ప్రస్తరాదుస్తరే
వార్ధౌ వీర! తరన్తి వానరభటాన్ సంతారయన్తేఽపి చ ।
నైతే గ్రావగుణా న వారిధిగుణా నో వానరాణాం గుణాః
శ్రీమద్దాశరథేః ప్రతాపమహిమా సోఽయం సముజ్జృమ్భతే ॥ (8–9)

ఏవి నీటిలో మునుఁగుచు నితరులను గూడ ముంచుచున్నవో యా గండశిల లిప్పుడు దాఁట శక్యము కాని సముద్రమును దాఁటుచు వానరులను గూడ దాఁటించుచున్నవి. ఇది పాషాణముల గొప్పతనము కాదు. సముద్రము యొక్క గొప్పతనము కూడఁ గాదు. వానరులయొక్క గొప్పతన మంతకంటెను గాదు. భగవానుఁడైన శ్రీరామచంద్రుని యొక్క ప్రతాపమహిమ యీ విధముగా విజృంభించుచున్న దని భావము.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యుల్లాసప్రకరణములో నుదాహరింపఁ బడినది – 'అత్ర లహరీణామ్ పావనత్వాతిశయేన పవమానస్య పావనత్వగుణాన్తరం వర్ణితమ్' – ఇక్కడఁ గెరటముల యొక్క పావనత్వాతిశయముచేఁ బవమానుని (గాలి) యొక్క పావనత్వమను మఱియొక గుణము వర్ణింపబడినది. వాయువునకు గంధవహత్వ – శీతలత్వాదులే ప్రసిద్ధగుణములు. ఇక్కడ గంగమీఁద వీచుటచేఁ బవిత్రత్వము కూడ వచ్చిన దని వర్ణింపఁబడినది. ఇది గుణముచే గుణమును వర్ణించిన యుల్లాసము.

**అవతారిక :** ఇప్పుడు గ్రంథకర్త యగు జగన్నాథుఁడు తన యదృష్టమును గొనియాడుకొనుచున్నాడు –

**శ్లో॥ కియన్తః సన్త్యేకే నియతమిహలోకార్థఘటకాః**
**పరే పూతాత్మానః కతిచ పరలోకప్రణయినః ।**
**సుఖం శేతే మాతస్తవ ఖలు కృపాతః పునరయం**
**జగన్నాథః శశ్వత్త్వయి నిహితలోకద్వయభరః ॥ 36**

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! గంగా! కియంతః = లెక్క పెట్టుటకు వీలులేని; ఏకే = కొందఱు; నియతమ్ = నియమముగా; ఇహలోక = ఈ లోకమునకు సంబంధించిన; అర్థ = ప్రయోజనములను; ఘటకాః = సంఘటించు వారు; సంతి = ఉన్నారు; కతిచ = లెక్కపెట్టుటకు వీలు లేని; పరే = మఱికొందఱు; పూతాత్మనః = పవిత్రమైన యాత్మ కలవారు; పరలోక = పై లోకమునకు సంబంధించిన; ప్రణయినః = ప్రేమము గలవారు; సంతి = కలరు; పునః = కాని మఱల; అయమ్ = ఈ; జగన్నాథః = జగన్నాథుఁడు; తవ = నీయొక్క; కృపాతః = కరుణతో; శశ్వత్ = నిరంతరము; త్వయి = నీ యందే; ఖలు = నిశ్చయముగా; నిహిత = ఉంచఁబడిన; లోకద్వయ = రెండు లోకములయొక్క; భరః = భారము గలవాఁడై; సుఖమ్ = సుఖముగా; శేతే = నిద్రపోవుచున్నాఁడు.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! లెక్కపెట్టుటకు శక్యము గాని కొంద ఱిహలోకమునకు సంబంధించిన యర్థములను సంపాదించువారు గలరు. లెక్కపెట్టుటకు వీలులేని మఱికొందఱు పవిత్రాత్ములు పరలోకములో వాంఛితములను బొందుటకై ప్రయత్నించువారు గలరు. ఇంక నీజగన్నాథుఁ డిహలోకపరలోకములకు సంబంధించిన భార మంతయు నీపై నుంచి నీ కరుణతో సుఖముగా నిద్రపోవుచున్నాఁడు. ఇహలోక సుఖములకై కాని పరలోక సుఖములకై కాని ప్రయత్నము చేయని నన్ను నీవే దయతో రక్షింపవలయు నని భావము.

**అవతారిక :** ఇప్పుడు నీ వేల పాపములు చేయుచున్నావని ప్రశ్నించుకొని యెవరికిని స్వభావము మాఱదని సమాధానము చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ భవత్యా హి వ్రాత్యాధమపతితపాఖణ్డపరిషత్–**
**పరిత్రాణస్నేహః శ్లథయితుమశక్యః ఖలు యథా ।**
**మమాప్యేవమ్ ప్రేమా దురితనివహేష్వమ్బ! జగతి**
**స్వభావోఽయం సర్వైరపి ఖలు యతో దుష్పరిహరః ॥ 37**

**ప్రతిపదార్థము :** అంబ! = అమ్మా! గంగా!; వ్రాత్య = సంస్కారహీనుల; అధమ = నీచుల; పతిత = పాపుల; పాఖండ = పాషండుల; పరిషత్ = సభ (సమూహము) యొక్క; పరిత్రాణ = రక్షించుటలో; స్నేహః = ప్రేమము; భవత్యా = నీచేత; హి =

నిశ్చయముగా; శ్లథయితుమ్ = శిథిలము చేయుటకు; యథా = ఎట్లు; ఖలు = ప్రసిద్ధముగా; అశక్యః = శక్యము గాదో; (తథా = అట్లే); మమ అపి = నాకుఁ గూడ; దురిత = పాపములయొక్క; నివహేషు = సమూహములలో; ప్రేమా = ప్రేమము; ఏవమ్ = ఈ విధముగా; అస్తి = కలదు– అని శేషము. జగతి = లోకములో; అయమ్ = ఈ; స్వభావః = స్వభావము; సర్వైః = అందఱ చేతను; అపి = కూడ; యతః = ఏ విధముగాను, దుష్పరిహరః ఖలు = పరిహరించుటకు శక్యము కాదు గదా!

**తాత్పర్యము :** అమ్మా! గంగా! వ్రాత్యులతో నధములతోఁ బతితులతోఁ బాషండులతోఁ గూడిన సభను (సమూహమును) రక్షించుటలో నీ కెట్లు స్నేహము గలదో యట్లే నాకుఁ గూడఁ పాపసమూహముల నాచరించుటలో నట్టి ప్రీతియే కలదు. లోకములో నందఱకుఁ గూడ స్వభావమును విడిచిపెట్టుట శక్యము గాదను విషయము ప్రసిద్ధమే కదా! పాపములు చేయుట నా స్వభావము, పాపులను రక్షించుట నీ స్వభావము గావునఁ బతితుఁడ నగు నన్ను నీవే రక్షింపవలయు నని భావము.

**విశేషములు :** శ్రీసదాశివభట్టీశ్లోకమునందలి ప్రథమపాదములో –

**'భవత్యా హి వ్రాత్యాధమపతితయా ఖండపరిషత్'** అను పాఠమును గైకొని వ్రాత్యాధమపతితుల శవఖండసముదాయ మని యర్థము చెప్పినాఁడు. తక్కిన సంస్కరణములం దన్నింటను 'పతితపాఖండపరిషత్' అను పాఠమే యున్నది.

ఈ శ్లోకములో జగన్నాథుఁడు **'స్వభావో దురతిక్రమః'** అను జాతీయమును భంగ్యంతరముగాఁ బొదుగుటచే లోకోక్తి యలంకారము.

**'లోకప్రవాదానుకృతిర్లోకోక్తిరితి భణ్యతే'** అని చంద్రాలోకలక్షణము. ఇక్కడ నీవు వ్రాత్యాధమపతితపాషండులను గాపాడుచున్నా వను నిందచే భాగీరథి పతితపావని యను స్తుతి వ్యక్త మగుటచే వ్యాజస్తుతి యలంకారమని సదాశివభట్టు చెప్పినాఁడు. **'ఉక్తిర్వ్యాజస్తుతిర్నిందా స్తుతిభ్యాం స్తుతినిందయోః'** అని కువలయానందలక్షణము. సదాశివభట్టీలక్షణమునకు స్వీయలక్ష్యమును గూడ నుదాహరించినాఁడు –

శ్లో॥ వివేకలేశోఽపి న తే రామచంద్ర! రణే రిపూన్ ।
హతాన్ స్వనాశకాన్ శీఘ్రమ్ పాపినో నయసే దివమ్ ॥

శ్రీరామచంద్రా! నీకు వివేకము కొంచెము కూడ లేదు. యుద్ధములోఁ జంపిన పాపులగు శత్రువులను స్వర్గమునకుఁ బంపుచున్నావు. ఇక్కడ శ్రీరామచంద్ర నిందచే స్తుతి గమ్యమాన మగుటచే వ్యాజస్తుతి యలంకారము.

ఈ శ్లోకమునందలి చతుర్థచరణములో సమర్థన ముండుటచే నర్థాంతరన్యాస మని జగన్నాథమతము.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యర్థాంతరన్యాసప్రకరణములో నుదాహరింపఁబడినది –

“సామాన్యేన విశేషస్య విశేషేణ సామాన్యస్య వా యత్ సమర్థనం తదర్థాంతర న్యాసః । అత్ర భగవత్యా భాగీరథ్యాః స్తోతుశ్చ వృత్తాంతయోర్విశేషయోః సమర్థనస్య చతుర్థచరణప్రతిపాద్యస్య సామాన్యస్య సమర్థకతా **‘యతః’** ఇత్యనేనోచ్యతే”

సామాన్యముచే విశేషణమును గాని లేక విశేషముచే సామాన్యమును గాని సహేతుకముగా సమర్థించుట యర్థాంతరన్యాసము. ఇక్కడ భగవతి యగు భాగీరథి యొక్క వృత్తాంతము, స్తోత్రము చేయు వాని వృత్తాంతము నను రెండు విశేషములచే నాల్గవ పాదములో ‘స్వభావమును బరిహరించుట కష్టము కదా!’ యను సామాన్యమును సమర్థించుటచే నర్థాంతరన్యాస మైనది. ‘యతః’ అను దానిచే హేతువు చెప్పఁబడినది.

**అవతారిక :** ఇప్పుడు గంగాతాండవము తన తాపమును బోఁగొట్ట వలయునని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ ప్రదోషాన్తర్నృత్యత్పురమథనలీలోద్ధృతజటా-**
**తటాభోగప్రేఙ్ఖల్లహరిభుజసన్తానవిధుతిః ।**
**బిలక్రోడక్రీడజ్జలడమరుడఙ్కారసుభగ-**
**స్తిరోధత్తాం తాపం త్రిదశతటినీ తాణ్డవవిధిః ॥ 38**

**ప్రతిపదార్థము :** ప్రదోష = సాయంకాలము నందుఁ బ్రదోషసమయముయొక్క; అంతః = మధ్యకాలములో; నృత్యత్ = నర్తనము చేయుచున్న; పురమథన = త్రిపురాసురుల పురములను నాశనము చేసిన శివుని యొక్క; లీలా = విలాసముతో; ఉద్ధృత = పైకి లేచిన; జటాతట = జటాజూటము పైభాగముయొక్క; ఆభోగ = విస్తీర్ణమునందు; ప్రేంఖత్ = పైకెగురుచున్న, లహరి = కెరటములనెడి; భుజ = చేతుల; సంతాన = సమూహము యొక్క; విధుతిః = విశేషమైన కదలికలు గలది; బిల = ఒడ్డున నున్న కన్నములయొక్క; క్రోడ = మధ్యభాగములో; క్రీడత్ = ఆడుచున్న; జల = నీటియొక్క; డమరుడంకార = ఢక్క నుండి పుట్టిన ‘డండం’ వంటి ధ్వనులతో; సుభగః = శోభనమైనదియు నగు; త్రిదశతటినీ = దేవనదియైన గంగయొక్క; తాండవ విధిః = తాండవ విధానము; తాపమ్ = నా మనస్తాపమును; తిరోధత్తామ్ = మాయము చేయుఁగాక!

**తాత్పర్యము :** సాయం సంధ్యాసమయములోఁ బ్రదోషకాలములో నాట్యము చేయుచున్న శివునియొక్క విలాసముచేఁ బైకెగసిన విశాలమైన జటాజూటమునందుఁ బైకెగురుచున్న కెరటము లను భుజములసమూహముయొక్క కదలికలు గలది, యొడ్డున నున్న కలుగుల లోనికి దూఱి పైకి వచ్చుచుఁ గ్రీడించుచున్న జలముల యొక్క డమరుడంకార ధ్వనిచే నొప్పుచున్నది యగు గంగయొక్క తాండవవిధానము నా తాపమును బోఁగొట్టుఁ గాక!

సాయంసంధ్యలోఁ బ్రదోషకాలములో శివుఁడు తాండవము చేయుచున్నాఁడు. ఆ విలాసముచే శివుని కపర్దము నందలి జడలు పైకి లేచినవి. ఆ శివుని విస్తీర్ణమైన జటాజూటముయొక్క పైభాగములో గంగ యొక్క కెరటములు పైకెగసి పడుచున్నవి. ఆ కెరటముల కంపనము గంగాదేవి భుజముల కదలికలవలె నున్నది. గంగానది యొడ్డున బొక్కలున్నవి. ఆ రంధ్రములలో దూఱి పైకి వచ్చుచుఁ గ్రీడించుచున్న నీళ్ళ చప్పుడు ఢక్కా డంకారము వలె డమడమధ్వనితో మ్రోఁగుచున్నది. అట్లందముతో నొప్పుచున్న గంగానదియొక్క తాండవవిధానము నా తాపమును బోఁగొట్టుఁ గాక! యని భావము.

**విశేషములు : 'బిలక్రోడ'** యనుచోట – **'తటక్రోడ'** యను పాఠాంతర మున్నట్లు సదాశివభట్టు సూచించినాఁడు. అప్పుడు 'గట్టును గొట్టుకొనుచుఁ గ్రీడించుచున్న' యని యర్థము చెప్పకొనవలయును.

తండుఁ డనఁగా నందికేశ్వరుఁడు. తండునిచే రచింపఁబడిన **'భరతార్ణవ'** మను శాస్త్రమునందు వివరింపఁబడిన దగుటచేఁ **దాండవ**మని పేరు వచ్చినది.

సూర్యాస్తమయమునకుఁ దరువాత మూఁడు ముహూర్తముల కాలమునకుఁ 'బ్రదోష'మని పేరు. **'త్రిముహూర్తమ్ ప్రదోషః స్యాద్ భానా వస్తంగతే సతి'** అని హేమాద్రి చతుర్వర్గచింతామణి.

ఈ శ్లోకము నందలి పూర్వార్థములో 'జటాతటా' యని టకారము; మూఁడవ పాదములో 'డ'కారము నెక్కువ మాఱులు వచ్చుటచే వృత్త్యనుప్రాసము. ముఖ్యముగా మూఁడవ పాదములోఁ బదములు నర్తించుచున్న ట్లుండుటచే వికటత్వము (ఉదారత్వము) గలదు. **'పదానాం నృత్యత్ప్రాయత్వం వికటతా'** యని ప్రాచీనలక్షణము. 'కఠినవర్ణఘటనారూపవికటత్వలక్షణోదారతా' యని జగన్నాథుని రసగంగాధర లక్షణము. ఈ వికటత్వలక్షణము గల యుదారతకు రసగంగాధరోదాహరణమిది –

శ్లో॥ ప్రమోదభరతున్దిలప్రమథదత్తతాలావళీ–
వినోదిని వినాయకే డమరుడిణ్డిమధ్వానిని ।

లలాటతటవిస్ఫుటన్నవకృపీటయోనిచ్ఛటో
హఠోద్ధతజటోద్భటో గతపటో నటో నృత్యతి ॥

శ్రీనాథమహాకవి **భీమఖండము** నందలి యీ పద్యము కూడ నుదాహరణము –

శా॥ ఆడెం దాండవమార్భటీపటహలీలాటోపవిస్ఫూర్జిత–
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాటకఠోరకోటరకుటీకోటీలుఠచ్ఛింధువీ
చీడోలాపటలీపరిస్ఫుటతరస్ఫీతధ్వనిప్రౌఢిమన్. (4–148)

నేను రచించిన సూతసంహితలో **శ్రీశివమాహాత్మ్యఖండము** నందలి యీ పద్యము కూడ నుదాహరణము–

**పాలాశదళము :** స్ఫుటఘటితమకుటశశి సురతటిని జాఱన్
గటితటిని బటిసడలఁ గటకఫణు లూడన్
వటవిటపినికటమున భటపటహవాద్యా
ర్భటులడర మృడుఁ డపుడు పటునటన మాడెన్.

**అవతారిక :** ఇప్పుడు నీవు నన్ను విడిచిపెట్టినచో నీ కరుణ నిరాధారమై లోకమునకు నీయందు విశ్వాస ముండ దని చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ సదైవ త్వయ్యేవార్పితకుశలచిన్తాభరమిమం**
**యది త్వమ్ మామమ్బ! త్యజసి సమయేఽ స్మిన్ సువిషమే ।**
**తదా విశ్వాసోఽయం త్రిభువనతలాదస్తమయతే**
**నిరాధారా చేయమ్ భవతి ఖలు నిర్వ్యాజకరుణా ॥ 39**

**ప్రతిపదార్థము :** అంబ! = అమ్మా! గంగా!; సదా ఏవ = ఎల్లప్పుడును; త్వయి ఏవ = నీ యందే; అర్పిత = అర్పింపఁబడిన; కుశల = క్షేమముయొక్క; చింతా = విచారము యొక్క; భరః = భారము గలిగిన; ఇమమ్ = ఈ జగన్నాథుని; మామ్ = నన్ను; అస్మిన్ = ఈ; సువిషమే = ఒడుదొడుకుగా నున్న; సమయే = కష్టకాలములో; త్వమ్ = నీవు; యది త్యజసి = విడిచిపెట్టినచో; తదా = అప్పుడు; అయమ్ = గంగ పతితపావనురాలు; శరణాగతకుశలకారిణి యను నీ; విశ్వాసః = నమ్మకము; త్రిభువనతలాత్ = మూఁడు లోకములనుండి; అస్తమ్ అయతే = అస్తమించుచున్నది. ఇయమ్ = ఈ; నిర్వ్యాజకరుణా = నీయొక్క కపటము లేని కృప; నిరాధారా చ = ఆధారము లేనిది కూడ; ఖలు = నిశ్చయముగా; భవతి = అగుచున్నది.

**తాత్పర్యము :** అమ్మా! గంగా! ఎల్లప్పుడును నా క్షేమసమాలోచనభార మంతయు నీపైఁ బెట్టి యొడుదొడుకులు పడుచున్న యీ సంకటసమయములో నీవు నన్ను విడిచిపెట్టినచో 'గంగ పతితపావని' యని నీపై ముల్లోకములకు నున్న విశ్వాసము పూర్తిగాఁ బోవును. మోసము చేయని నీ దయాస్వభావము కూడ నిరాధార మగును. నీయందు నమ్మకము పోయినచో జను లెవ్వరు నీ దగ్గఱకు రారు. నీలో స్నానము చేయరు. నీ నిర్వ్యాజకరుణ కాధార ముండదు. కావున నిన్ను నమ్ముకొన్న నన్నిప్పుడే రక్షింపు మని భావము.

**విశేషములు :** ఇక్కడ రెండవ పాదములో 'సమయేఽస్మిన్' అను దానికి బదులుగా **'విషయేఽస్మిన్'** అను పాఠమున్నట్లు సదాశివభట్టు సూచించినాఁడు. 'అప్పు డీవిషయములో' నని యర్థము చెప్పుకొనవలయును.

**అవతారిక :** ఇప్పుడు గంగాతరంగములను వర్ణించుచున్నాఁడు -

**శ్లో॥ కపర్దాదుల్లస్య ప్రణయమిలదర్ధాఙ్గయువతేః**
**పురారేః ప్రేఙ్ఖన్త్యో మృదులతరసీమన్తసరణౌ ।**
**భవాన్యా సాపత్న్యస్ఫురితనయనం కోమలరుచా**
**కరేణాక్షిప్తాస్తే జనని! విజయన్తాం లహరయః ॥ 40**

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! గంగా! ప్రణయ = అనురాగముచే; మిలత్ = కూడుచున్న; అర్ధాంగ = శరీరమునందలి సగభాగములో; యువతేః = స్త్రీ (పార్వతి) గల; పురారేః = శివుని యొక్క; మృదులతర = మిక్కిలి మెత్తనైన; సీమంత = పాపట (జడల చీలికల) యొక్క; సరణౌ = మార్గములో; ప్రేంఖంత్యః = ఎగిరిపడుచున్నవి (నృత్యము చేయుచున్నవి); భవాన్యా = పార్వతీదేవిచే; సాపత్న్య = సవతివను భావముతో; స్ఫురిత = కోపముచే నెఱ్ఱనైన; నయనమ్ = కనులతో; కోమలరుచా = చక్కని కాంతి గల; కరేణ = చేతిచే; ఇక్కడఁ గోమల శబ్దముచేఁ బార్వతీదేవి సౌకుమార్య-సౌందర్యములు వ్యక్త మగుచున్నవి; ఆక్షిప్తాః = ఆక్షేపింపఁబడినవియు నగు; 'కరేణ యనునది జాత్యేకవచనము. పార్వతీదేవి నిన్ను రెండు చేతుల తోడ నాక్షేపించుచున్న దని భావము. తే = నీయొక్క; లహరయః = కెరటములు; విజయంతామ్ = సర్వోత్కృష్టత్వముగా వర్తించుఁగాక! విజయమును బొందుఁగాక!

**తాత్పర్యము :** జననీ! గంగా! ప్రీతితో భార్య కర్ధాంగ మిచ్చి కలిసిన శివుని యొక్క జటాజూటము నందలి పాపట మార్గములో నెగురుచు నృత్యము చేయునవి, సవతి

వను నీర్ష్యతో నెఱ్ఱఁగా ఁబ్రకాశించు కన్నులు గల పార్వతియొక్క కోమలమైన కాంతిగల చేతులతో నాక్షేపింపఁబడినవి (నిందింపఁబడినవి) లేక యడ్డగింపఁబడినవి లేక లాగఁబడినవియు నగు నీ కెరటములు విజయమును బొందుఁ గాక!

**విశేషములు :** సదాశివభట్టు 'భవాన్యాసాపత్న్య' యనుచోట **'భవాన్యాః సాపత్న్య'** యను పాఠాంతరమును సూచించినాఁడు. అప్పుడు "భవాన్యాః = పార్వతియొక్క యని యర్థము చెప్పుకొనవలెను.

**అవతారిక :** ఇప్పుడు నాకు నీయం దనురాగము స్వభావసిద్ధముగా నున్న దని యొట్టుపెట్టి చెప్పుచున్నాఁడు -

**శ్లో॥ ప్రపద్యన్తే లోకాః కతి న భవతీమత్రభవతీ-**
**ముపాధిస్తత్రాయం స్ఫురతి యదభీష్టం వితరసి ।**
**శపే తుభ్యమ్ మాతర్మమ తు పునరాత్మా సురధుని!**
**స్వభావాదేవ త్వయ్యమితమనురాగం విధృతవాన్ ॥ 41**

**ప్రతిపదార్థము :** సురధుని! దేవనదీ! గంగా! అత్రభవతీమ్ = పూజ్యురాల వైన; భవతీమ్ = నిన్ను; కతి లోకాః = ఎన్ని లోకములు; న ప్రపద్యంతే = ఆశ్రయించుట లేదు. అన్ని లోకములు నిన్నాశ్రయించుచున్న వని యర్థము. అత్ర = ఇక్కడ; అయమ్ = ఈ; ఉపాధిః = కారణము; స్ఫురతి = స్ఫురించుచున్నది; యత్ = ఏ దనఁగా; అభీష్టమ్ = వాంఛితమును; వితరసి = ఇచ్చుచున్నావు. లేక; యత్ అభీష్టమ్ = ఏది వారికిష్టమో; తత్ = దానిని; వితరసి = ఇచ్చుచున్నా వని కూడ నర్థము చెప్పుకొనవచ్చును. మమ = నాయొక్క; ఆత్మా తు = ఆత్మయైనచో; స్వభావాద్ ఏవ = స్వభావసిద్ధముగానే; మాతః = తల్లీ; త్వయి = నీయందు; అమితమ్ = మేర లేని; అనురాగమ్ = స్నేహమును (ప్రేమమును); విధృతవాన్ = విశేషముగా ధరించినదని; తుభ్యమ్ = నీ కొఱకు; పునః = మఱల; శపే = శపథము చేయుచున్నాను.

**తాత్పర్యము :** తల్లీ! సురధునీ! గంగా! పూజ్యురాలవైన నిన్ను లోకము లన్నియు నాశ్రయించుచున్నవి. దానికిఁ గారణము నీవు వారి వారి కోరికలను దీర్చుటయే యని తెలియుచున్నది. ఏ కోరికలు లేని నా యాత్మ యన్ననో నైసర్గికముగా నీ యం దనురాగము గల్గియున్న దని మఱల శపథము చేసి చెప్పుచున్నాను. నా కే కోరికలును లేవు. నీయందు భక్తిమాత్రమే యున్నదని భావము.

**అవతారిక :** ఇప్పుడు గంగ యందలి మట్టి నా శోకమును బోఁగొట్టవలయు నని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ లలాటే యా లోకైరిహ ఖలు సలీలం తిలకితా**
**తమో హన్తుం ధత్తే తరుణతరమార్తణ్డతులనామ్ ।**
**విలుమ్పన్తీ సద్యో విధిలిఖితదుర్వర్ణసరణిం**
**త్వదీయా సన్మృత్స్నా మమ హరతు కృత్స్నామపి శుచమ్ ॥ 42**

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా! ఇహ = ఈ లోకములో; లోకైః = జనులచే; **'లోకస్తు భువనే జనే'** యని యమరము. లలాటే = నుదుటి యందు; సలీలమ్ = ఉల్లాసముతో; ఖలు = నిశ్చయముగా; యా = ఏది; తిలకితా = తిలకము (బొట్టు) గా ధరింపఁ బడినదై; తమః = చీఁకటిని; హంతుమ్ = నాశనము చేయుటకై; తరుణతర = మధ్యాహ్నకాలములో మిక్కిలి యౌవనమును బొందిన; మార్తండ = సూర్యునియొక్క; తులనామ్ = సామ్యమును; ధత్తే = ధరించుచున్నదో (పొందుచున్నదో) యా = ఏది; సద్యః = వెంటనే; విధి = బ్రహ్మదేవునిచే; లిఖిత = వ్రాయఁబడిన; దుర్వర్ణ = చెడ్డ యక్షరముల యొక్క; సరణిమ్ = పద్ధతిని; విలుంపంతీ = తుడిచివేయుచున్నదో; (సా = ఆ); త్వదీయా = నీయొక్క; సత్ మృత్స్నా = మంచి మట్టి; మమ = నాయొక్క; కృత్స్నామ్ = సమస్తమైన; శుచమ్ = శోకమును; అపి = కూడ; హరతు = హరించుఁ గాక! పోఁగొట్టుఁ గాక!

**తాత్పర్యము :** దేవనదీ! గంగమ్మా! ఈ లోకములో జనులచే నుల్లాసముతో ఫాలభాగములం దేది తిలకముగా ధరింపఁబడి వారి యజ్ఞాన మనెడి చీఁకటిని బోఁగొట్టుటకై చండ మార్తండునితో సామ్యమును దాల్చుచున్నదో; యేది వారి వారి నుదుటిపై బ్రహ్మచే వ్రాయఁబడిన దుష్టాక్షరపంక్తిని దుడిచి వేయుచున్నదో యట్టి నీ ప్రశస్తమైన మంచి మట్టి నాయొక్క శోకమును సంపూర్ణముగా నాశనము చేయుఁగాక! యని భావము. బ్రహ్మలిపిని గూడఁ జెఱుపఁగల గంగమట్టికి నా శోకమును బోఁగొట్టఁ గల సామర్థ్యము తప్పక యుండు నని తాత్పర్యము.

**విశేషములు :** పుణ్యనదులలో స్నానముచేయు నప్పు డొండ్రుమట్టి నొంటి నిండఁ బూసికొని మృత్తికాస్నానము చేయుట పుణ్యప్రదమే కాక యారోగ్యదాయకము. అందు గంగ మట్టి మఱియుఁ బ్రశస్తమైనది.

శ్లో॥ గంగాతీరసముద్భూతామ్ మృదమ్ మూర్ధ్నా బిభర్తి యః ।
బిభర్తి రూపం సోఽర్కస్య తమోనాశాయ కేవలమ్ ॥

గంగాతీరమునందుఁ బుట్టిన మట్టి నెవఁడు తలపై ధరించునో వాఁడు చీఁకటిని నశింపఁజేయుటకై సూర్యరూపము దాల్చుచున్నాఁడని బ్రహ్మాండపురాణము చెప్పుచున్నది.

శ్లో॥ వామహస్తే జలం కృత్వా సావిత్ర్యా చాభిమంత్రితమ్ ।
తద్విష్ణోరితి మంత్రేణ మర్దయేన్మృత్తికాం తతః ॥
అతో దేవేతి సూక్తేన తిలకం కారయేత్ సదా ॥

ఎడమచేతితో గంగాజలమును దీసికొని సావిత్రీమంత్రమును జపించుచు **'తద్విష్ణోః'** అను మంత్రముతోఁ గుడిచేతితో గంగమట్టిని ముద్దగాఁ జేసి 'అతో దేవ' యను సూక్తముతో నుదుటిపై బొట్టుగా ధరింపవలె నని తిలకధారణవిధానము కూడ బ్రహ్మాండపురాణము నందే కలదు. ఈ తిలకధారణమును ప్రాతఃకాలములో స్నానము చేసిన పిమ్మటఁ జేయవలయును.

మనుచరిత్రలో –

సీ॥ అర్ధచంద్రుని తేట నవఘళించు లలాట
పట్టిఁ దీర్చిన గంగ మట్టి తోడ (మను–3–71)

అని **యల్లసాని** పెద్దన గారు కూడ గంగమట్టిని జక్కఁగాఁ బేర్కొనినారు.

**అవతారిక :** ఇప్పుడు గంగాతీరమునందున్న చెట్లు తనకు మిత్రులు గావలె నని కోరుకొనుచున్నాఁడు –

**శ్లో॥ నరాన్ మూఢాంస్తత్తజ్జనపదసమాసక్తమనసో**
**హసన్తః సోల్లాసం వికచకుసుమవ్రాతమిషతః ।**
**పునానాః సౌరభ్యైః సతతమలినో నిత్యమలినాన్**
**సఖాయో నః సన్తు త్రిదశతటినీతీరతరవః ॥** 43

**ప్రతిపదార్థము :** తత్ తత్ = ఆ యా; జనపద = దేశములందు; సమాసక్త = బాగుగా నాసక్తి గలిగిన; మనసః = మనస్సులు గల; మూఢాన్ = మూర్ఖులైన; నరాన్ = మనుజులను; వికచ = వికసించిన; కుసుమ = పూలయొక్క; వ్రాత = సమూహమను; మిషతః = నెపముచే; స + ఉల్లాసమ్ = హర్షముతో; హసంతః = నవ్వుచున్నవి; నిత్య = ఎల్లప్పుడు; మలినాన్ = మాలిన్యముతో నల్లగా నుండెడి; అలినః = తుమ్మెదలను; సౌరభ్యైః = సువాసనలచే; సతతమ్ = నిత్యము; పునానాః = పవిత్రీకరించునవియు నగు; త్రిదశ = దేవతల యొక్క; తటినీ = నదియైన గంగ యొక్క; తీర = ఒడ్డున నున్న; తరవః = చెట్లు, నః = మాకు; సఖాయః = చెలికాండ్రుగా; సంతు = ఉండుఁ గాక!

**తాత్పర్యము :** మోక్షము నిచ్చు గంగానది ప్రవహించు దేశములను విడిచిపెట్టి యాయా దేశములలో నాశతో నివసించుచుఁ దెలివితక్కువతనముతో నున్న మానవులను జూచి వికసించిన పువ్వుల సమూహమను మిషతో సంతోషముతో నవ్వుచున్నవియుఁ బుట్టుకతో వచ్చిన నల్లఁదనముతో నెప్పుడు మలినముగా నున్న తుమ్మెదలను దమ సుగంధములచే నెల్లప్పుడు పవిత్రముగాఁ జేయునవియు నగు గంగాతటమునందున్న వృక్షములు మాకు నెచ్చెలుగా నిలుచుఁగాక! గంగాతీరము నందలి తరువులయొక్క పూవులను వాసన చూచినను మోక్షము సులభముగా వచ్చునని భావము.

**అవతారిక :** ఇప్పుడు నేను యజ్ఞములను యోగాభ్యాసమును మాని నీ నామస్మరణమే చేయుచున్నా నని చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ యజన్త్యేకే దేవాన్ కఠినతరసేవాంస్తదపరే**
**వితానవ్యాసక్తా యమనియమరక్తాః కతిపయే ।**
**అహం తు త్వన్నామస్మరణభృతకామస్త్రిపథగే!**
**జగజ్జాలం జానే జనని! తృణజాలేన సదృశమ్ ॥ 44**

**ప్రతిపదార్థము :** జనని! తల్లీ! గంగా! ఏకే = కొందఱు; కఠినతర = మిక్కిలి కఠినములైన; సేవాన్ = పూజల నందుకొను; దేవాన్ = దేవతలను; యజంతి = పూజించుచున్నారు. అపరే = మఱికొందఱు; వితాన = యజ్ఞములందు; వ్యాసక్తాః = విశేషముగా నాసక్తి గలవా రగుచున్నారు; కతిపయే = ఇంకఁ గొందఱు; యమ = యమములందు; నియమ = నియమములందు; రక్తాః = అనురాగముగలవారై; సంతి = ఉన్నారని శేషము. అహం తు = నే నైతే; త్వత్ = నీయొక్క; నామ = పేరును; స్మరణ = స్మరించుటచే; భృత = సంపాదింపఁబడిన; కామః = వాంఛితములు గలవాఁడ నై; త్రిపథగే = స్వర్గ – మర్త్య – పాతాళము లను మూఁడు మార్గము లందు సంచరించుదానా! జగత్ = లోకములయొక్క; జాలమ్ = సమూహమును; తృణజాలేన = గడ్డిపఱకల సమూహముతో; సదృశమ్ = సమానమైన దానిగా; జానే = తెలిసికొనుచున్నాను.

**తాత్పర్యము :** తల్లీ! త్రిలోకగామినీ! గంగా! కొందఱు కఠోరములైన సేవల కిష్టపడు విష్ణువు, శివుఁడు మొదలగు దేవతలనుఁ బూజించుచున్నారు. మఱికొందఱు విశేషాసక్తితో యజ్ఞములు చేయుచున్నారు. ఇంకఁ గొందఱు యమనియమాదులతోఁ గూడిన యష్టాంగయోగము నభ్యసించుచున్నారు. ఇంక నేనో నీ నామస్మరణముచే సంపాదింపఁ బడిన కోరికలు గలవాఁడనై పదునాల్గు లోకములను గడ్డిపోఁచల వెంటితో సమానముగాఁ దెలిసికొనుచున్నాను.

**విశేషములు :** ఈ శ్లోకములో యమ – నియమములు పేర్కొనఁబడినవి. ఇది తక్కిన యోగాంగములకు నుపలక్షణము.

సూ॥ యమ – నియ – మాసన – ప్రాణాయామ – ప్రత్యాహార – ధారణా – ధ్యాన – సమాధయోఽష్టావఙ్గాని (యో.సూ. –2–29) (1) యమము (2) నియమము (3) ఆసనము (4) ప్రాణాయామము (5) ప్రత్యాహారము (6) ధారణ (7) ధ్యానము (8) సమాధి యనునవి యెనిమిది యోగాంగములు.

సూ॥ అహింసాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః (యో.సూ. 2–30)

(1) అహింస (2) అస్తేయము (దొంగతమును చేయకుండుట) (3) బ్రహ్మచర్యము (4) అపరిగ్రహము – స్వార్థమమకారములతో నేవస్తువులను గైకొనకుండుట – ఈ నాలుగును యములు.

సూ॥ శౌచ – సంతోష – తపః – స్వాధ్యా – యేశ్వరప్రణిధానాని నియమాః (2–32)

(1) నిత్యము శుచిగా నుండుట శౌచము (2) లభించిన దానితో సంతుష్టినొందుట సంతోషము (3) శీతాతపాది ద్వంద్వములను సహించుచుఁ జాంద్రాయణాదివ్రతములతో నాత్మను నిర్మలముగా నుంచుట తపస్సు. (4) వేదాధ్యయనము, మోక్షగ్రంథపఠనము స్వాధ్యాయము (5) భగవంతునకు సర్వము సమర్పించుట యీశ్వరప్రణిధానము – ఈ యైదును నియమములు. పద్మాసనము మొదలగునవి యాసనములు. రేచక – పూరక – కుంభకములచే నుచ్ఛ్వాస నిశ్వాసములను నియమించుట 'ప్రాణాయామము'. ఇంద్రియములను విషయముల వైపునకుఁ బోనీయకుండుట 'ప్రత్యాహారము' చిత్తమును దేవతావిగ్రహములందు షట్చక్రములందుఁ గేంద్రీకరించుట 'ధారణ'. మనస్సును నిరంతరము భగవంతునిపై నిలుపుట 'ధ్యానము'. చిత్తవృత్తులను నిరోధించుట సమాధి యని పాతంజలియోగదర్శనము, **'కలౌ సంస్మరణాన్ముక్తిః'** అను వచనముచే దేవపూజల కంటెను, యజ్ఞముల కంటెను, యోగాభ్యాసము కంటెను గలియుగములో భగవన్నామ స్మరణమే ముక్తిప్రద మని భావము.

శ్లో॥ హరేర్నామైవ నామైవ నామైవ మమ జీవనమ్ ।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥

కలియుగములో హరినామస్మరణముకంటె వేఱు గతి లేదని తాత్పర్యము. ఇక్కడ గంగాభక్తుఁ డగు జగన్నాథుఁడు గంగానామస్మరణమును గ్రహించినాఁడు.

**అవతారిక :** ఇప్పుడు పుణ్యాత్ములను రక్షించుటకు దేవత లెందఱో యున్నారు.

పాపాత్ములను రక్షించుటకు నీవు తప్ప మఱెవ్వరును లే రని వర్ణించుచున్నాఁడు –

**శ్లో॥ అవిశ్రాన్తం జన్మావధి సుకృతజన్మార్జనకృతాం**
**సతాం శ్రేయః కర్తుం కతి న కృతినః సన్తి విబుధాః ।**
**నిరస్తాలమ్బానామకృతసుకృతానాం తు భవతీం**
**వినాముష్మింల్లోకే న పరమవలోకే హితకరమ్ ॥ 45**

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా! అవిశ్రాంతమ్ = విశ్రాంతి లేకుండ నెల్లప్పుడును; జన్మావధి = పుట్టినది మొదలు మఱియొక జన్మమును బొందుదాఁక; సుకృత = పుణ్యములచే; జన్మ = పుట్టుకను; ఆర్జనకృతామ్ = సంపాదించినవారగు; సతామ్ = సత్పురుషులకు (మంచివారికి); శ్రేయః = శుభమును; కర్తుమ్ = చేయుటకు; కృతినః = కుశలులగు; విబుధాః = దేవతలు; కతి = ఎంతమంది; సంతి = లేరు? అకృతసుకృతానామ్ = ఏ పుణ్యములు చేయని; నిరస్త + ఆలంబానాం తు = ఏ యాలంబనము (ఊఁత) లేనివారికిఁ గూడ; హితకరమ్ = ఇష్టములను గూర్చుదానిని; భవతీం వినా = నిన్నుఁ దప్ప; పరమ్ = రెండవ వానిని; అముష్మిన్ = ఈ; లోకే = లోకములో; న అవలోకే = కాంచలేకున్నాను.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! విశ్రాంతి లేకుండఁ బుట్టినది మొదలు జీవితాంతము మఱల జన్మమును బొందు దాఁక పుణ్యములు చేసి జన్మమును బొందిన సాధువులకుఁ గల్యాణములను గూర్చుటకై నిపుణులగు దేవత లెందఱు లేరు? కాని యే పుణ్యములు చేయక యే యాలంబనము లేక బాధపడుచున్న పాపాత్ములకుఁ గూడ హితములను గూర్చుటలో నిన్ను మించిన మఱియొక దేవత నీ లోకములో నేను గనకుంటి నని భావము.

**అవతారిక :** ఇప్పుడు నీ బిడ్డనగు నన్ను నీ యొడిలోఁ బరుండఁ బెట్టుకొను మని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ పయః పీత్వా మాతస్తవ సపది యాతః సహచరై-**
**ర్విమూఢైః సంరన్తుం క్వచిదపి న విశ్రాన్తిమగమమ్ ।**
**ఇదానీముత్సఙ్గే మృదుపవనసఞ్చారశిశిరే**
**చిరాదున్నిద్రమ్ మాం సదయహృదయే! శాయయ చిరమ్ ॥ 46**

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! గంగా! తవ = నీయొక్క; పయః = నీటిని; పీత్వా = త్రాగి; పాలు త్రాగి యని మఱొక యర్థము; **'పయః క్షీరమ్ పయోఽమ్బు చ'** యని

యమరము. సపది = వెంటనే; విమూఢైః = ఎక్కువ మూర్ఖులైన; సహచరైః = మిత్రులతో; సంరంతుమ్ = ఆడుకొనుటకు; యాతః = వెళ్ళినవాఁడనై; క్వచిద్ అపి = ఎక్కడను గూడ; విశ్రాంతిమ్ = ఊఱటను; న అగమమ్ = పొందకుంటిని; సదయహృదయే = దయతోఁ గూడిన హృదయము గలదానా! చిరాత్ = చాలకాలమునుండి; ఉన్నిద్రమ్ = నిద్రలేని; మామ్ = నన్ను; మృదు = కోమలమైన; పవన = గాలియొక్క; సంచార = గమనముచే (వీచుటచే); శిశిరే = చల్లనైన; ఉత్సంగే = నీయొడియందు; చిరమ్ = ఎక్కువ కాలము; శాయయ = నిద్ర పుచ్చుము.

**తాత్పర్యము :** తల్లీ! గంగా! నేను నీటిని ద్రావి వెంటనే తెలివి లేని చెలికాండ్రతో నాడు కొనుటకు వెళ్ళి యెక్కడను విశ్రాంతి లేకుండ నుంటిని. కరుణతోఁ గూడిన హృదయము గల దానా! చాల కాలము నుండి నిద్రలేని నన్నుఁ బిల్లగాలులు వీచుటచేఁ జల్లగా నున్న నీ యొడిలోఁ బరుండఁ బెట్టుకొని నిద్రింపఁ జేయుము. పయశ్శబ్దమునకుఁ బాలని కూడ నర్థ ముండుటచే నీ పాలు ద్రావిన నేను నీ బిడ్డ వంటి వాఁడను. నీవు నాకుఁ దల్లివంటి దానవని భావము.

లోకములోఁ జంటిపిల్లలు తల్లి దగ్గఱఁ బాలు ద్రాగి తోడిపిల్లలతో నాడుకొనుటకుఁ బోయి యలసటతో నింటికి వత్తురు. ఆ బిడ్డలను జేరఁదీసి తల్లు లలసట దీరుటకై తమ యొడిలోఁ బరుండఁ బెట్టుకొని నిద్రపట్టుటకై జోకొట్టుదురు. అట్లే దయామయహృదయ వగు నీవు కూడ నన్ను నీ చల్లనియొడిలోఁ బరుండఁ బెట్టుకొని నిద్ర పుచ్చవలయు నని తాత్పర్యము.

**విశేషములు :** ఈ శ్లోకమే రసగంగాధరములో భంగ్యంతరముగా సమాసోక్తి ప్రకరణములో నుదాహరింపఁబడినది.

శ్లో॥ ఉత్సంగే తవ గంగే! పాయమ్ పాయమ్ పయోఽతిమధురతరమ్ ।
శమితాఖిలశ్రమభరః కథయ కదాఽహం చిరాయ శయివాహే ॥

ఇక్కడఁ బ్రకృత మగు కవివృత్తాంతముచే నప్రకృతమగు శిశుజననీ వృత్తాంతము స్ఫురించుటచే సమాసోక్తి యలంకారము. **'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్'** ప్రస్తుతవృత్తాతంతముచే నప్రస్తుతవృత్తాంతము స్ఫురించినచో సమాసోక్తి యని చంద్రాలోకలక్షణము. ఇది పయశ్శబ్దశ్లేషమహిమచే ధ్వనించుచున్నది.

**అవతారిక :** ఇప్పుడు నన్నుద్ధరించుటకై నడుము బిగించుకొని నీ వాయత్తము కావలె నని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ బధాన ద్రాగేవ ద్రఢిమరమణీయమ్ పరికరం**
**కిరీటే బాలేన్దుం నియమయ పునః పన్నగగణైః ।**
**న కుర్యాస్త్వం హేలామితరజనసాధారణతయా**
**జగన్నాథస్యాయం సురధుని! సముద్ధారసమయః ॥ 47**

**ప్రతిపదార్థము :** సురధుని! = దేవనదీ గంగా!; ద్రాక్ ఏవ = వెంటనే; ద్రఢిమ = దృఢత్వముచే; రమణీయమ్ = అందమైన; పరికరమ్ = నడికట్టును; బధాన = కట్టుము (బిగింపుము); **భవేత్ పరికరో వ్రాతే పర్యంకపరివారయోః । ప్రగాఢగాత్రైకబంధే వివేకారంభయోరపి ॥** అని విశ్వకోశము. **'భవేత్ పరికరః సంఘే పర్యంకపరివారయోః॥ ప్రగాఢగాత్రికాబంధే సమారంభవివేకయోః'** అని మేదినీకోశము. **'గాత్రికాబంధే'** అని వైజయంతీకోశము. గాత్రబంధ మనఁగా నొడికట్టు. కిరీటే = కిరీటమునందు; బాల + ఇందుమ్ = చంద్రరేఖను; పన్నగగణైః = పాముల సమూహముచే; పునః = మఱల; నియమయ = పదిలపఱపుము. ఇతర జన = అన్యజనులను; సాధారణతయా = సాధారణబుద్ధితోఁ జూచిన విధముగా; త్వమ్ = నీవు; హేలామ్ = తిరస్కారమును; న కుర్యాః = చేయవలదు; జగన్నాథస్య = జగన్నాథకవిని; సముద్ధారసమయః = పైకి లేవనెత్తుటకుఁ గాలము; అయమ్ = ఇదియే.

**తాత్పర్యము :** దేవనదీ! గంగా! వెంటనే గట్టిగా నున్న నీ యందమైన పైఁట కొంగుతో నడుమును బిగింపుము. కిరీటముపై నున్న చంద్రకళను మఱలఁ బాముల సమూహముతో గట్టిగా బంధింపుము. ఇతరజనులను జూచిన విధముగా సాధారణ బుద్ధితో నన్ననాదరముగాఁ దిరస్కరింపవలదు. ఈ జగన్నాథు నుద్ధరించుటకై యిదిగో! సమయ మాసన్నమైనది.

**విశేషములు :** ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ ।
శ్రేయస్కామో న గృహ్ణీయాజ్జ్యేష్ఠాపత్యకలత్రయోః ॥

తన పేరును; గురువుపేరును, కుత్సితునిపేరును, భార్యపేరును, పెద్దకొడుకు పేరును శ్రేయస్సును గోరుకొనువాఁ డుచ్చరింపఁగూడదను నిషేధమున్నను నాపత్సమయములో జగన్నాథుఁడు తనపేరు చెప్పుకొని యాక్రోశించి నాఁడని గ్రహింపవలయును.

శ్లో॥ శ్రాద్ధే వివాహే సంకల్పేఽథాపత్కాలాదిషు క్వచిత్ ।
స్వనామగ్రహణం కుర్వన్ శ్రేయస్కామోఽప్యదోషభాక్ ॥

శ్రాద్ధకాలమునందు, వివాహసమయమునందు, సంకల్పము చెప్పునప్పుడు,

ఆపత్కాలాదుల యందుఁ దన పేరు నుచ్చరించుటచే శ్రేయస్కాముఁడు దోషము నొందఁడని స్మృతివచనము.

'రామో ద్విర్నాభిసంధత్తే రామో ద్విర్నాభిభాషతే' 'రామోఽస్మి సర్వంసహే!' 'గోనర్దీయస్త్వాహ' – మొదలగు ప్రయోగముల వలెనే దీనిని భావింపవలెను. ఇట్లే భట్టి కావ్యములో శ్రీరామచంద్రుఁడు సీతకై విలపించు సందర్భములో 'హా పితః క్వాసి హే సుభ్రు! బహ్వేవం విలలాప సః' 'హే సుభ్రూః!' అని యుండ వలసినను 'హేసుభ్రు' అని హ్రస్వాంతముగాఁ బ్రయోగించినాఁడు. ఈ ప్రయోగము శ్రీరామచంద్రు నున్మత్తావస్థను వ్యక్తము చేయుచున్న దని వ్యాఖ్యాతలు వివరించినారు. ఇట్లే రాఁబోవు శ్లోకములో **'శశిశకలశ్వేతాలమకుటామ్'** అను ఛందోభంగ మీ విధముగానే చేయఁబడిన దని గ్రహింపవలెను.

**'బధాన పరికరమ్'** నడుము బిగింపు మనునది లోకోక్తి యగుటచే నీశ్లోకములో లోకోక్తి యలంకారము. **'లోకప్రవాదానుకృతిర్లోకోక్తిరితి భణ్యతే'** యని కువలయానంద లక్షణము.

ఈ శ్లోకము రసగంగాధరమునందలి యర్థశక్తిమూలధ్వనిప్రకరణములో నుదాహరింపఁబడినది.

'అపరామూలో యథా – బధాన ద్రాగేవ... ...

అత్ర జగన్నాథస్యేత్యనేన శక్య ఏవానేకపాపవిశిష్టత్వేన లక్ష్యతే పాపానామ్ పదాన్తరేణానిర్వచ్యత్వం వ్యంగ్యమ్.

అపరామూల మనఁగా నజహత్స్వార్థ. **అర్థశక్తిధ్వని** (లక్షణామూలధ్వని) (1) జహత్స్వార్థ (2) అజహత్స్వార్థ యని రెండు విధములు. తన యర్థమును విడిచిపెట్టి మఱియొక యర్థమును ధ్వనింపఁ జేయునది జహత్స్వార్థ. స్వార్థమును (తనయొక్క యర్థమును) విడిచిపెట్టకుండ మఱియొక యర్థమును వ్యంజింపఁ జేయునది యజహత్స్వార్థ. 'బధాన ద్రాగేవ' యను శ్లోక మజహత్స్వార్థ కుదాహరణము. ఇక్కడ 'జగన్నాథుని యొక్క' యను దానిచే నభిధేయుఁ డగు జగన్నాథుఁ డనేక పాపవిశిష్టుఁ డుగా లక్షింపఁ బడుచున్నాఁడు. అనఁగా జగన్నాథపదమున కనేక పాపవిశిష్టమైన యర్థమునందు లక్షణ. ఈ లక్షణ స్వార్థమును బరిత్యజింపక యనేక పాపవిశిష్టత్వమును సూచించుచున్నది. అతఁడు చేసిన పాపముల నితర పదములచేఁ జెప్ప లేకుండ ననిర్వాచ్యముగా నుండుట వ్యంగ్యము కావున నిది యజహత్స్వార్థ మగు నర్థశక్తిధ్వని యైనది.

**అవతారిక :** ఇప్పుడు గంగాస్వరూపమును వర్ణించుచు **ధ్యానమహిమను** జెప్పుచున్నాఁడు-

**శ్లో॥ శరచ్చన్ద్రశ్వేతాం శశిశకలశ్వేతాలమకుటాం**
**కరైః కుమ్భామ్భోజే వరభయనిరాసౌ దధతీమ్ ।**
**సుధాధారాకారాభరణవసనాం శుభ్రమకర-**
**స్థితాం త్వాం యే ధ్యాయన్త్యుదయతి న తేషామ్ పరిభవః ॥ 48**

**ప్రతిపదార్థము :** తల్లీ! గంగా! శరత్ = శరదృతువు నందలి (ఆశ్వయుజ-కార్తిక మాసములలోని); చంద్ర = చంద్రుని వలె; శ్వేతామ్ = తెల్లనైన దానిని; శశి = చంద్రునియొక్క; శకల = ఖండము తోడను; శ్వేత + అల = తెల్లని పాముల తోడను గూడిన; మకుటామ్ = కిరీటము గల దానిని; కుంభ = కుండను; అంభోజే = పద్మమును; వర = వరమును (వరదముద్రను); భయనిరాసౌ = భయమును పోఁగొట్టుటను (అభయముద్రను); చ = కూడ; దధతీమ్ = ధరించుచున్న దానిని; సుధా = అమృతము యొక్క; ధారా = ధారలయొక్క; ఆకార = ఆకృతుల (రూపముల) తో నున్న; ఆభరణ = నగలు; వసనామ్ = వస్త్రములు గల దానిని; శుభ్ర = నిర్మలమైన; మకర = మొసలి యందు; స్థితామ్ = ఉన్నదానిని; త్వామ్ = ఇట్టి స్వరూపముతో నొప్పు గంగమ్మతల్లిని నిన్ను; యే = ఎవరు; ధ్యాయంతి = ధ్యానముచేయుదురో; తేషామ్ = వారికి; పరిభవః = పరాభవము; న = లేదు.

**తాత్పర్యము :** గంగామాత యాశ్వయుజ-కార్తిక మాసములందలి పున్నమినాఁటి చంద్రుని వలె మిక్కిలి తెల్లనైనది. ఆమె కిరీటముపైఁ జంద్రకళ యుండును. తెల్లని పాములు కిరీటమును జుట్టుకొని పడగలు విప్పి ప్రకాశించుచుండును. ఆమె యొక చేతితో నమృతభాండమును, రెండవ చేతితోఁ బద్మమును; మూఁడవ చేతితో వరదముద్రను; నాల్గవ చేతితో నభయముద్రను ధరించి యుండును. అమృతధారల వంటి యాకృతులతో నొప్పుచున్న వజ్రముల హారము, ముత్యముల దండ, శంఖముల పేరు, స్ఫటికముల మాల మొదలగు తెల్లని నగలను దెల్లని వస్త్రములను ధరించును. మకరవాహన గావున స్వచ్ఛమైన మకరముపై నుండును. ఇట్టి గంగమ్మతల్లి రూపము నెవరు ధ్యానింతురో వారికిఁ బరాభవముండదు. నిత్యము కల్యాణములే కల్గునని తాత్పర్యము.

**విశేషములు :** ఇక్కడ మొదటి పాదములో 'శశిశకలశ్వేతాలమకుటామ్' అనుచోట 'శ్వే' సంయుక్తాక్షరమై 'ల'వర్ణము గురువై ఛందోభంగము గల్గుటచేఁ బరిష్కర్త లనేక విధములగు పాఠములను గల్పించిరి. చౌఖంబా వారి గుజిలీప్రతిలో 'శోభాలమకుటామ్'

అను పాఠమున్నది. శ్రీవరదరాజయ్యంగార్యుల (సుధర్మాపత్రికాసంపాదకులు) ప్రతిలోఁ గూడ దీనినే గ్రహించిరి. అప్పుడు శోభతోఁ గూడిన సర్పమని యర్థము చెప్పుకొనవలయును. బాలక్రీడాకర్త లగు శ్రీమధుసూదనశాస్త్రి గారు 'శైవాలమకుటామ్' అని దిద్దినారు. శైవాలమనఁగా నాచు. నిర్ణయసాగరప్రతి యందు, నార్యేంద్రశర్మగారి పండితరాజకావ్యసంగ్రహము నందు 'శ్వేతాల' పాఠమే గలదు. పీయూషలహరీవ్యాఖ్యలో శ్రీసదాశివభట్టు కూడ 'శ్వేతాల' పాఠమే గ్రహించినాఁడు. పెక్కుప్రతులలో 'శ్వేతాల' పాఠమే కలదు. **'శ్వేతాల'** యనునదే జగన్నాథకవి పాఠము. మహాకవి పాఠమును మన కిచ్చ వచ్చినట్లు దిద్దుట మహాసాహసము. **'అపి మాషమ్ మషం కుర్యా చ్ఛందోభంగం న కారయేత్'** అను నాగ్రహమన్నచోఁ గవిపాఠము నట్లే యుంచి శోభాలపాఠమును గ్రహించి పాదటిప్పణిలో సూచింపవలయును. 'శైవాల' పాఠము సరియైనది కాదు. లేక శైవ = శివసంబంధమైన; అల = పామని యర్థము చెప్పుకొన వలయును. చంద్రకళ వలెనే శివున కాభరణములుగా నున్న పాములే గంగాదేవికిఁ గూడఁ గిరీటాభరణము లైన వని భావము.

శ్రీసదాశివభట్టు **శ్వేతాల** శబ్దమున కనేక వ్యుత్పత్తులను జెప్పినాఁడు –

(1) అలతి దంశం కుర్వన్ గచ్ఛతీత్యలః సర్పః శ్వేతశ్చాసావలశ్చ శ్వేతాలః శుభ్రసర్పః. కసికాటులు వేయుచుఁ బ్రాకునది గావున 'అల' మనఁగా సర్పము. శ్వేతాల మనఁగా దెల్లనిపాము.

(2) యద్వా శ్వేతాశ్చ తే అలాశ్చ భూషణాని చ శ్వేతాలాః – లేదా తెల్లని నగలు శ్వేతాలములు.

(3) యద్వా శ్వేతస్య రజతస్య అలా భూషణాని 'దుర్వర్ణం రజతం రూప్యం ఖర్జూరం శ్వేత మత్యపి' ఇత్యమరః – లేక తెల్లని వెండి నగలు శ్వేతాలములు.

(4) యద్వా శశిశకలశ్వేతాలః తాదృశో ముకుటో యస్యాః సా తామ్ – లేక చంద్రవంక వంటి వెండి యాభరణము శ్వేతాలము.

(5) యద్వా శశిశకలం శ్వేతాల ఇవ శుభ్రభూషణమివేతి వ్యాఘ్రాదిత్వాదుపమితి సమాసః శశిశకలశ్వేతాలః తాదృశో మకుటో యస్యాః సా తామ్ – లేక చంద్రవంక వంటి చంద్రకళ మకుటముగాఁ గలది శశిశకలశ్వేతాల మకుట.

(6) యద్వా శశిశకలశ్వేతః శ్వేతగుణః తమ్ సమంతాత్ లాతీతి శశిశకలశ్వేతాలః తాదృశో మకుటో యస్యాః సా తామ్ – లేదా చంద్రఖండము వంటి తెల్లఁదనము

నంతట గైకొనునది శశికలశ్వేతాలము. అట్టి మకుటము గలది. అనఁగాఁ గిరీటము నందలి చంద్రకళయొక్క కాంతి సర్వత్ర ప్రసరించుచున్న దని భావము.

(7) యద్వా శశికలం చ శ్వేతశ్చ శశికలశ్వేతౌ. శ్వేతో రజతమ్ తౌ ఆసమంతా ల్లాతీతి శశికలశ్వేతాలః. తాదృశో మకుటో యస్యాః సా తామ్. యస్యా రౌప్యమకుటే శశికలం వర్తత ఇత్యర్థః – శశికల మనఁగా జంద్రరేఖ. శ్వేతమనఁగా వెండి. వెండి కిరీటముపైఁ దెల్లని చంద్రఖండమును ధరించిన దని భావము.

వీనిలో మొదటి యర్థమే సరియైనది. గంగాదేవి కిరీటముపైఁ జంద్రరేఖతో పాటు శ్వేతనాగ ముండుట ప్రసిద్ధము. శ్వేతాలశబ్ద మప్రసిద్ధ మగుటచేతను, గణభంగ మగుట చేతను వ్యాఖ్యాతలు సంస్కర్తలు నిన్ని తిప్పలు పడవలసి వచ్చినది. జగన్నాథుఁ డాపత్సమయములో వ్యగ్రమనస్కుఁడై యీ స్తోత్రము నాశువుగాఁ జెప్పుటచే గణభంగము సోఢవ్యము. అందువల్లనే యీయూణ్ణి వెంకట వీరరాఘవాచార్యులు గారు **"శ్వే"** తేలఁబలక వలె' నని సూచించినారు.

'అయ' ధాతు వాత్మనేపతి యగుటచే – 'ఉదయతే' యని యుండవలయును కాని 'ఇట కిట కటీ' యను చోటఁ బ్రశ్లిష్టముగా నున్న ఈ ధాతువునకు ముందు ఉత్ చేరుటచే వచ్చిన రూపమని గ్రహింపవలయును. లేక యనుదాత్తేత్వలక్షణ మగు నాత్మనేపద మనిత్య మను వచనముచే 'నుదయతి' యను ప్రయోగము కూడ సాధువు. ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జౌ (శిశు–4–20) అని మాఘమహాకవియు; స్ఫాయన్నిర్మోకసంధి (అనర్ఘ– 1–56) అని మురారి మహాకవియుఁ బ్రయోగించినారు. ఈ ప్రయోగములను సిద్ధాంతకౌముదిలో శ్రీభట్టోజీదీక్షితు లంగీకరించినారు.

**అవతారిక :** ఇప్పుడు గంగానది నా శరీరమునకు సుఖమును గూర్చుఁగాక! యని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ దరస్మితసముల్లసద్వదనకాన్తిపూరామృతై–**
**ర్భవజ్వలనభర్జితాననిశమూర్జయన్తీ నరాన్ ।**
**చిదేకమయచన్ద్రికాచయచమత్కృతిం తన్వతీ**
**తనోతు మమ శం తనోస్సపది శన్తనోరఙ్గనా ॥ 49**

**ప్రతిపదార్థము :** దరస్మిత = చిరునవ్వుతో; సముల్లసత్ = బాగుగా నుల్లసిల్లుచున్న; వదన = ముఖముయొక్క; కాంతిపూర = కాంతుల ప్రవాహములను; అమృతైః = అమృతములచే; భవ = సంసారమను; జ్వలన = మంటచే; భర్జితాన్ = దగ్ధులైన;

నరాన్ = మనుజులను; అనిశమ్ = ఎల్లప్పుడును; ఊర్జయంతీ = మఱల జీవింపఁ జేయునది; చిత్ = చిత్స్వరూపమే (ఆత్మయే) ఏకమయ : ఏక = ఒకటిగా; మయ = నిండిన (ఒకే ముద్దగా నిండియున్న) ఇది ప్రాచుర్యార్థములో మయట్ ప్రత్యయము : చంద్రికా = వెన్నెల యొక్క; చయ = సమూహము యొక్క; చమత్కృతిమ్ = చమత్కారమును; తన్వతీ = విస్తరించుచున్నది యగు; శంతనోః = భీష్ముని తండ్రియైన శంతను మహారాజుయొక్క; అంగనా = భార్యయగు గంగానది; సపది = శీఘ్రముగా; మమ = నాయొక్క; తనోః = శరీరమునకు; శమ్ = శుభమును; తనోతు = విస్తరించుఁ గాక!

**తాత్పర్యము :** చిఱునవ్వుతో బాగుగా నుల్లాసముగా నున్న ముఖమునుండి వెలువడు కాంతిప్రవాహములను సుధాధారలచే సంసారమనెడి మంటలలో మ్రగ్గుచున్న నరులను మఱల నుజ్జీవింపఁ జేయునది, కరడు గట్టిన యాత్మస్వరూపముచేఁ జల్లని వెన్నెల కుప్పల కాంతుల చమత్కారమును విస్తరించునది యగు శంతనుని భార్య యైన గంగానది యెల్లప్పుడు నా దేహమునకు వెంటనే శుభములను విస్తారముగాఁ గూర్చుఁ గాక!

**విశేషములు :** 'సర్గైరనతి విస్తీర్ణైః శ్రావ్యవృత్తైః సుగంధిభిః ।
సర్వత్ర భిన్నవృత్తాంతైరుపేతం లోకరంజనమ్ ॥ (1-19)

అను దండ్యాచార్యుని కావ్యాదర్శవచనము ననుసరించి పఠితలకు శ్రోతలకు శ్రోత్రరంజనముగా నుండుటకై యీ లఘుస్తోత్రకావ్యము చివరఁ గ్రొత్తవృత్తములతో ఛందస్సులను మార్చుచున్నాఁడు.

ఇది పృథ్వీవృత్తము. **'జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః'** అని వృత్తరత్నాకరలక్షణము. పృథ్వీవృత్తములోఁ బ్రతిపాదమునందును **'జ-స-జ-స-య-లగ'** యను గణము లుండును.

ఇందు మూఁడవ పాదములో నాలుగు మాఱుల చకారావృత్తిలో నున్న వృత్త్యనుప్రాసము, నాల్గవపాదములో 'శంతనో'యని రెండుమాఱు లర్థభేదములో నావృత్తమైన ఛేకానుప్రాసము. 'తనో' యని మూఁడు మాఱులావృత్త మైన యమకము పద్యమునకు వింతశోభను గూర్చుచు శ్రవణరంజకముగా నున్నవి.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి యుల్లేఖప్రకరణములోఁ బాఠభేదముతో నుదాహరింపఁ బడినది.

శ్లో॥ నరైర్వరగతిప్రదేత్యథ సురైః స్వకీయాపగే
త్యుదారతరసిద్ధిదేత్యఖిలసిద్ధసంఘైరపి ।
హరేస్తనురితి శ్రితా మునిభిరస్తసజ్ఞైరియం
తనోతు మమ శం తనోః సపది శన్తనోరఙ్గనా ॥

ఈ శ్లోకము నందలి నాల్గవ పాదము మాత్రమే గంగాలహరి లోనిది. తక్కిన మూఁడు పాదములు పూర్తిగాఁ గ్రొత్తవి.

**అవతారిక :** ఇప్పుడు మఱల సంసారవ్యాళవిషానలదగ్ధుఁడనగు నా తాపము నార్పు మని ప్రార్థించుచున్నాఁడు –

**శ్లో॥ మన్త్రైర్మీలితమౌషధైర్విగలితం త్రస్తం సురాణాం గణైః**
**స్రస్తం సాన్ద్రసుధారసైర్విదళితం గారుత్మతైర్గ్రావభిః ।**
**వీచిక్షాళితకాళియాహితపదే! స్వర్లోకకల్లోలిని!**
**త్వం తాపం తిరయాధునా మమ భవ(జ్వా)వ్యాలావలీఢాత్మనః ॥ 50**

**ప్రతిపదార్థము :** స్వః + లోకకల్లోలిని! = స్వర్గలోకమునందు బ్రవహించునదీ; వీచి = కెరటములచే; క్షాళిత = కడుగఁబడిన; కాలియ + అహిత = కాళియుఁ డను పామునకు శత్రువైన శ్రీమహావిష్ణువుయొక్క; పదే = పాదములు గల దానా! ఇక్కడ భాగవతము నందలి కాళియమర్దనకథ యనుసంధేయము. గంగానది విష్ణుపాదోద్భవ గావున శ్రీమహావిష్ణుని పాదములను దన కెరటములచే బాగుగాఁ గడుగుచున్న దని భావము. గంగాజల మంతయు శ్రీవిష్ణుపాదోదక మని తాత్పర్యము. ఇవి రెండును గంగానదికి సంబోధనములు. మంత్రైః = మంత్రములచే; మీలితమ్ = సంకుచిత మైనది (ముడుచుకొన్నది); ఇక్కడ మీలితములైనవి మంత్రములు గాని తాపము గాదు. తాపము నార్పుటకై వేసిన మంత్రము లేవియుఁ బని చేయక ముడుచుకొని పోయిన వని భావము. ఔషధైః = మందులచే; విగలితమ్ = జాఱి పోయినది – ఇక్కడ విగలితము లైనవి యౌషధములు గాని తాపము గాదు. తాపము మానుటకై వేసిన మందు లన్నియు వ్యర్థములై దిగజాఱి పోయిన వని భావము. సురాణామ్ = దేవతలయొక్క; గణైః = సమూహములచే; త్రస్తమ్ = భయపడినది. ఇక్కడ భయపడిన వారు దేవతలు గాని తాపములు గాదు. తాపమును శమింపఁ జేయలేని దేవతలు కూడ భయపడి రని భావము. సాంద్ర = దట్టమైన; సుధా = అమృతముయొక్క; రసైః = రసములచే; స్రస్తమ్ = క్రిందికి జాఱినది. ఇక్కడఁ గ్రిందికి జాఱినది సుధారసములు గాని తాపము గాదు. తాపమును జల్లార్పలేక సుధారసములు గూడఁ గ్రిందికి జాఱినవని భావము.

అమృతమునకుఁ గూడ నధఃపతనము సంభవించిన దని తాత్పర్యము. గారుత్మతైః = గరుత్మంతునకు సంబంధించిన; గ్రావభిః = రాలచే; గరుడపచ్చలచే నని యర్థము. విదళితమ్ = చీల్చఁబడినది; ఇక్కడ విదళితము లైనవి గరుడపచ్చులే కాని తాపము గాదు. విషమును విఱుగఁగొట్టలేక గరుడపచ్చులు కూడ ముక్కలైన వని భావము. ఇవి నాలుగు తాపములకు విశేషణములు. భవ = సంసారమనెడి; వ్యాళ = పాముచే (జ్వాలా = మంటలచే); అవలీఢ = నాకఁబడిన; ఆత్మనః = ఆత్మగల; మమ = నాయొక్క; తాపమ్ = దుఃఖముల వేఁడిమిని; అధునా = ఇప్పుడే; త్వమ్ = నీవు; తిరయ = తిరస్కరింపుము.

**తాత్పర్యము :** తల్లీ! స్వర్గంగా! సంసార మనెడి పాముచేఁ గాటు వేయఁబడిన నా తాపము నార్పుటకు మంత్రములు పని చేయలేదు. ఔషధములు గూడ గొడ్డువోయినవి. దేవతలు గూడ భయపడినారు. దట్టమైన యమృతధారలు కూడఁ గ్రిందికి జాఱిపోయినవి. గరుడపచ్చులు కూడ విచ్చిపోయి ముక్కవోయినవి. మహావిషముగల కాళియుఁడను సర్పముయొక్క పడగలపై నాడిన శ్రీకృష్ణుని యొక్క పాదములను నిత్యము కడుగుచున్న దానవు నీవు. సంసారసర్పముచేఁ గఱవఁబడిన వాఁడను నేను. కావున వెంటనే నా తాపమును చల్లార్చు మని భావము.

**విశేషములు :** 'ఔషధైర్విగలితమ్' అనుదానికి 'ముకులితమ్' అను పాఠాంతర మున్నట్లు సదాశివభట్టు సూచించినాఁడు. అప్పుడు – ఔషధైః = మందులచే ముకుళితమ్ = ముకుళిత మైన దని యర్థము చెప్పుకొనవలయును. ముకుళ మనఁగా మొగ్గ. నాకు వేసిన మందు లన్నియు మొగ్గవలె ముడుచుకొనిపోయిన వని భావము. **'త్వం తాపం తిరయ** యనుచోట 'నిరయ' యను పాఠమును సదాశివభట్టు గ్రహించినాఁడు. అప్పుడు – తాపమ్ = తాపమును; నిరయ = నివారింపు మని యర్థము చెప్పుకొనవలయును. **'భవజ్వాలావలీఢాత్మనః'** అను పాఠమును సదాశివభట్టు గ్రహించి, **'భవవ్యాలావలీఢాత్మనః'** అను పాఠాంతరమును సూచించినాఁడు. ఈ పాఠమే సరియైనది. ఆర్యేంద్రశర్మగారు, నిర్ణయసాగర ప్రతిపరిష్కర్తలు; కాశీపండితులగు శ్రీమధుసూదనశాస్త్రిగారు, చాతకప్రియావ్యాఖ్యాత లగు శ్రీయమునారామత్రిపాఠిగారు; పంచామృతకర్తలగు శ్రీబూర్గుల రామకృష్ణారావుగారు సదాశివభట్టు ననుసరించి 'భవజ్వాలావలీఢాత్మనః' అను పాఠమునే స్వీకరించినారు 'చౌఖంబావారి గుజిలీ' ప్రతియందును, శ్రీసుధర్మాసంపాదకు లగు శ్రీవరదరాజయ్యంగార్యుల ప్రతి యందును, జగన్నాథుని రసగంగాధరము నందును 'వ్యాలావలీఢాత్మనః' అను పాఠమే కలదు. జ్వాల యనఁగా

మంట. వ్యాల మనఁగాఁ బాము. జగన్నాథ మహాకవి యీ శ్లోకపూర్వార్ధములోఁ జెప్పిన యైదు విషయములు పాము కఱచిన వాని కన్వయించినట్లుగా మంటలలో మాడిన వాని కన్వయింపవు. పాము కఱచిన వానికి విషము విఱుగుటకై మంత్రములు వేయుదురు. మందులు వేయుదురు. దేవతాజపములు చేయుదురు. అమృతము చచ్చిన వారిని బ్రతికించుట ప్రసిద్ధమే కదా! గరుడపచ్చలను దాఁకింతురు. గరుడుఁడు పాములకు శత్రువగుటచే గరుడపచ్చలు పామువిషమునుఁ బీల్చివేసి పాము వాతను బడిన వానిని బ్రతికించునని చెప్పుదురు. భవవ్యాలావలీఢాత్ముఁడ నగు నా విషయములో నీ యైదును బనిచేయలేదు. కావున గంగా! నీవే నా తాపమును బోఁగొట్టి రక్షింపవలయు నని జగన్నాథమహాకవి యాశయము. ఈ యైదు హేతువులలో ముఖ్యముగా మంత్రములు, గరుడపచ్చలు వ్యాలావలీఢున కన్వయించినట్లుగా జ్వాలావలీఢున కన్వయింపవు. **'వీచిక్షాలితకాలియాహితపదే'** యను సంబోధనము కూడ సాభిప్రాయమై సార్థక మగుచున్నది.

ఇక్కడ సదాశివభట్టు 'కాలియ + ఆహిత పద' యని విడఁదీసి కాలియ = కాలియుఁ డను పాముపై; ఆహిత = ఉంచఁబడిన; పద = పదములు గలవాఁడు శ్రీకృష్ణుఁ డని మఱియొక విధమైన యర్థమును గూడ సూచించినాఁడు. గంగాదేవి శ్రీకృష్ణుని పాదములను గడుగుచున్నది గాని శ్రీకృష్ణుని గడుగుట లేదు. కాలియ ఆహిత పదుఁ డనఁగా శ్రీకృష్ణుఁ డను నర్థము వచ్చును గాని శ్రీకృష్ణపదమని యర్థము రాదు. ఈ పదవిభాగము ననుసరించి యా యర్థము రావలయు నన్నచో 'వీచిక్షాలిత కాలియాహిత పదపదే' యని యుండవలయును. కాఁబట్టి 'కాలియ + అహిత పద' యని విడఁదీసి ముందు చెప్పిన యర్థమే సరియైనది.

వృత్తము శార్దూలవిక్రీడితము. **'సూర్యాశ్వైర్మసజస్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్'** అని వృత్తరత్నాకరము. శార్దూలవిక్రీడితములోఁ బ్రతిపాదము నందును 'మ–స–జ–స–త–త–గ' యను గణము లుండును.

ఈ శ్లోకము రసగంగాధరము నందలి పరికరాలంకారప్రకరణములో నుదాహరింపఁబడినది –

**"విశేషణానాం సాభిప్రాయత్వమ్ పరికరః ।** యథా 'మంత్రైర్మీలితమ్... అత్రాత్మనో భాగీరథీకర్తృకస్య భవవ్యాలదంశజనితతాపదూరీకరణస్యాశంసనం హి వాక్యార్థః. తత్ర భగవత్యా భవతాపనాశికాత్వస్య సుప్రసిద్ధత్వాత్ పరిణామేన భవరూపవిషయ తాదాత్మ్యపత్త్యా వ్యాలజనితసంతాపనాశికాత్వం తావత్ సూపపాదమేవ.

**'స్థాస్నుజంగమ సంభూత విషహంత్ర్యై నమో నమః'** ఇత్యాద్యాగమబలాచ్చ విషయ తాదాత్మ్యం వినాపి శుద్ధవ్యాలజనితసంతాపనాశికాత్వమపి స్వభావసిద్ధమేవ. ఏవం వాచ్యార్థస్య సత్యామపి నిష్పత్తౌ సౌందర్యవిశేషాధానాయ సాకూతం విశేషణం **'వీచిక్షాళితే'**త్యాది. అత్ర నామాంతరస్య సత్త్వేఽపి కాలియాహితశబ్దోపాదానసామర్థ్యాద్ భగవతశ్చరణే ఫణాగణ నృత్యనిస్సారీకృతకాలియే లోకోత్తరవిషహరణశక్తిరుత్పత్తి సిద్ధైవాసీత్ సా చ తయోర్వీచిభిః క్షాళనాద్ గంగాయాం స్వాశ్రయరేణుద్వారా సంక్రాంతేతి గమ్యతే. న చ శక్తేః పూర్వమేవ క్షాళనాత్ కథం? చరణేనార్వాక్కాలియస్య విషహరణం శక్తిరహితేన సంభవతీతి వాచ్యమ్. క్షాళితావశిష్టా లేశరూపా శక్తిశ్చరణే కాచిత్ స్థితాసీత్ యయా సంప్రతి కాలియస్య విషమహారీత్యప్యాకూతాంతర్గతమేవేతి నానుపపత్తిః ఏవం హి వాచ్యోపస్కారతయాత్ర గుణీభావః న వాచ్యసిద్ధ్యంగతయా."

సాభిప్రాయముగా విశేషమును జెప్పినచోఁ బరికరాలంకారము. ఈ శ్లోకములో 'వీచిక్షాళితకాలియాహితపద' యనునది సాభిప్రాయ మగు విశేషణము. ఇక్కడ భాగీరథీగంగ సంసారమనెడి పాముచేఁ గాటువేయఁ బడిన తన తాపమును దూరము చేయవలె నని కవి కోరుకొనుచున్నాఁడు. ఇక్కడ భగవతి యగు గంగయొక్క భవతాప నాశికాత్వము సుప్రసిద్ధమే కావునఁ బరిణామముచే భవరూపవిషయతాదాత్మ్యాపత్తిచే (సంసారవిషయతాదాత్మ్యముచే) వ్యాలజనితసంతాపనాశికాత్వము సులభముగానే తెలియుచున్నది. 'స్థాస్నుజంగమసంభూతవిషహంత్ర్యై నమో నమః' స్థావరజంగమములచే సంభవించిన విషమును సంహరించు గంగకు నమస్కారము! నమస్కారము' అను పురాణవచనబలముచే విషయతాదాత్మ్యము లేక పోయినను శుద్ధవ్యాలజనితసంతాప నాశికాత్వము గంగకు స్వభావసిద్ధమే. ఇట్లు వాచ్యార్థము నిష్పన్నమగుచున్నను సౌందర్యవిశేషమును గల్గించుటకై **వీచిక్షాలితకాలియాహితపద** యను సాభిప్రాయ విశేషణము గంగకు వేయఁబడినది. ఇక్కడ శ్రీవిష్ణుమూర్తి కనేక సహస్రనామము లున్నను కాలియాహితశబ్దమును గైకొనుటచే నీ శబ్దసామర్థ్యమువలనఁ గాళియుఁడను సర్పరాజు యొక్క పడగల పంక్తిపై నృత్యము చేసి కాలియుని నిస్సారునిగాఁ జేసిన భగవంతుఁడగు శ్రీకృష్ణునియొక్క పాదమునందు లోకోత్తరమైన విషహరణశక్తి స్వభావసిద్ధముగానే గలదు. ఆ శక్తి భగవంతుని చరణములను దన కెరటములచేఁ గడుగుటచేఁ దన్నాశ్రయించిన జలకణముల ద్వారముగా గంగకుఁ గూడ సంక్రమించిన దను నర్థము గమ్యమాన మగు (ధ్వనించు) చున్నది. శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము చేయుటకు ముందే గంగ భగవంతుని పాదములను గడుగుటచే శ్రీకృష్ణుని పాదములకుఁ గల కాలియవిషహరణశక్తి యెట్లు సంభవించిన దని ప్రశ్నింపఁగూడదు క్షాళితావశిష్టమై లేశరూపముగానున్న

యొకానొక శక్తి శ్రీకృష్ణపాదముల కున్నదనియు నాశక్తి చేతనే కాలియుని విషము హరింపఁబడిన దనియు (ఇక్కడ 'విషమ–హారి' యని ఛేదము గాదు. 'విషమ్ – అహారి' యని ఛేదము) నీభావము సాభిప్రాయవిశేషణాంతర్గతమై యుండుటచే ననుపపత్తి (అసంగతమగు విషయము) యేమియును లేదు 'వీచిక్షాళిత కాళియాహితపద' యను విశేషణము గంగయొక్క విషహరణసామర్థ్యమును విశేషముగా వ్యంజింపఁజేయు చున్నది. ఈ విశేషణము వాచ్యోపస్కారకమై గుణీభావ మగుచున్నది. అంతే కాని వాచ్యసిద్ధ్యంగత్వముచేఁ గాదు.

ఇక్కడ గంగాలహరి యందలి

**'త్వం తాపం నిరయాధునా మమభవజ్వాలావలీఢాత్మనః'**

అను చతుర్థచరణమునకు బదులుగా

**త్వం తాపం తిరయాధునా భవభయవ్యాలావలీఢాత్మనః**

అను పాఠము రసగంగాధరములోఁ గలదు. భవ = సంసారముయొక్క; భయ = భయమనెడి; వ్యాల = పాముచే; అవలీఢ = నాకఁబడిన (కఱవఁబడిన); ఆత్మనః = ఆత్మగల నాయొక్క; తాపమ్ = దుఃఖముయొక్క వేఁడిమిని; త్వమ్ = గంగా! నీవు; అధునా = ఇప్పుడు; తిరయ = తిరస్కరింపుము – అని యర్థము. భవభయతాపమును బోఁగొట్టు మని భావము.

గంగానది కనేకనామము లున్నను దేవనది యని చెప్పుటలో జగన్నాథకవికి మక్కువ యెక్కువ.

సురతటిని (10); త్రిదశతటినీతాండవవిధిః (38); సురధుని (41, 47); త్రిదశతటినీతీరతరవః (43); స్వర్లోకకల్లోలిని (50); అని పెక్కు తావులలోఁ బ్రయోగించినాఁడు.

**అవతారిక :** ఇప్పుడు పార్వతీపరమేశ్వరద్యూతమును గంగాతాండవమును వర్ణించు చున్నాఁడు –

**శ్లో॥ ద్యూతే నాగేన్ద్రకృత్తిప్రమథగణమణిశ్రేణినన్దీన్దుముఖ్యం**
**సర్వస్వం హారయిత్వా స్వమథ పురభిది ద్రాక్ పణీకర్తుకామే ।**
**సాకూతం హైమవత్యా మృదులహసితయా వీక్షితాయాస్తవామ్బ!**
**వ్యాలోలోల్లాసివల్గల్లహరినటఘటీతాణ్డవం నః పునాతు ॥ 51**

**ప్రతిపదార్థము :** అంబ = తల్లీ! గంగా!; ద్యూతే = జూదము నందు; నాగ + ఇంద్ర = పాములలో శ్రేష్ఠుఁడగు వాసుకిని; (వాసుకి శివునకు భూషణము); కృత్తి = కట్టుబట్ట యగు నేనుఁగు తోలును; ప్రమథగణ = శివభటుల సమూహమును; మణిశ్రేణి = రుద్రాక్షములు మొదలగు మణుల హారములను; నంది = వాహనమైన నందికేశ్వరుని; ఇందు = శిరోభూషణమైన చంద్రుని; ముఖ్యమ్ = మొదలుగా శ్రేష్ఠమైన; సర్వస్వమ్ = శివుని సమస్త ధనమును; హారయిత్వా = శివునిచేఁ బందెము వేయించి దోచుకొని; అథ = అనంతరము; స్వమ్ = తన్నుఁ దానే; ద్రాక్ = వెంటనే; పణీకర్తుకామే = పందెములో నొడ్డుటకుఁ గోరిక గలవాఁడై; పురభిది = శివుఁడుండఁగా; మృదుల హసితయా = మెత్తని చిఱునవ్వుతోఁ గూడిన; హైమవత్యా = హిమవంతుని కొమార్తెయైన పార్వతిచే; స + ఆకూతమ్ = సాభిప్రాయముగా; వీక్షితాయాః = చూడఁబడిన; తవ = నీయొక్క; వ్యాలోల = ఎక్కువగాఁ జలించుచు; ఉల్లాసి = సంతోషముతో; వల్గత్ = ఎగిరిపడుచున్న; లహరి = కెరటములను; నట = నటులయొక్క; ఘటీతాండవమ్ = తలపై ఘటము ధరించి చేయు తాండవము; నః = మమ్ములను; పునాతు = పవిత్రీకరించుఁగాక!

**తాత్పర్యము :** శివుఁడు పార్వతీదేవితో జూద మాడుచున్నాఁడు. ఒక్కొక్క వస్తువునే పందెముగా నొడ్డుచు నోడిపోవుచున్నాఁడు. ముందుగాఁ దనకు భూషణమైన వాసుకి నొడ్డినాఁడు. ఆ తరువాతఁ దాను కట్టుకొన్న గజచర్మమును, ప్రమథగణములను, రుద్రాక్షమాలలను, నందినిఁ, జంద్రుని నోడిపోయినాఁడు. ఇట్లు ముఖ్యమైన వాని నొడ్డి సర్వస్వము నోడిపోయిన పిమ్మట నింక నొడ్డుట కేమియు లేక దన్నుఁ దానే యొడ్డుట కుద్యుక్తుఁడైనాఁడు. అప్పుడు పార్వతి మెల్లగా నవ్వుచు జటాజూటములో గంగ యున్నది. దాని నొడ్డు మని సాభిప్రాయముగాఁ గనుసైఁగ చేసినది. కద్రువకు వినత సేవ చేసినట్లుగాఁ దన సవతి యగు గంగ తనకు దాస్యము చేయుట పార్వతికిఁ గూడ నిష్టమే కదా! అది చూచి వెంటనే గంగ పొంగి పొరలినది. అప్పుడు కదలుచున్న కెరటములు నటులవలె నున్నవి. గంగకుఁ బైనున్న జటాజూటము ఘటమువలె నున్నది. ఇట్లు నర్తించుచున్న గంగయొక్క ఘటీతాండవము మమ్ములను పవిత్రులనుగాఁ జేయుఁగాక! యని భావము.

శివుఁడు ముందుగా గంగ నొడ్డకుండ నుండినందుల కుల్లాసము కలిగినది. పార్వతీదేవి సైఁగచేఁ దన్నుఁ గూడ నొడ్డునేమో యని తొట్రుపాటు గల్గినది. ఇట్లుల్లాసముతో భయసంభ్రమములతోఁ బొంగుచున్న గంగయొక్క చలనము

ఘటీతాండవమువలె నున్నది. నెత్తిపైఁ గుండను బెట్టుకొని క్రిందఁ బడకుండ నైపుణ్యముతోఁ జేయు నాట్యమునకు (గరగనృత్యమునకు) **ఘటీతాండవ** మని పేరు. ఇక్కడ నర్తన ప్రియుఁడగు శివుని జూదము నుండి మఱలించుటకై గంగ తాండవమును మొదలు పెట్టినదని తాత్పర్యము.

**విశేషములు :** ఇది స్రగ్ధరావృత్తము.

**'మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తనీయా'** అని వృత్తరత్నాకర లక్షణము. స్రగ్ధరలోఁ బ్రతిపాదమునందు **'మ-ర-భ-న-మ-య-య-య'** అను గణము లుండును.

ఈ శ్లోకము నందలి చతుర్థపాదములోని 'వ్యాలోలోల్లాసివల్గల్లహరినటఘటీ' యనుచోట లకార-టకారావృత్తిచే నున్న వృత్త్యనుప్రాసము లహరీ తాండవమువలెనే యున్నది.

**అవతారిక :** ఇప్పుడు గంగానది తన యంగముల నమలములుగాఁ జేయవలయునని చివరి శ్లోకములోఁ బ్రార్థించుచున్నాఁడు -

**శ్లో॥ విభూషితానఙ్గరిపూత్తమాఙ్గా**
**సద్యః కృతానేకజనార్తిభఙ్గా ।**
**మనోహరోత్తుఙ్గచలత్తరఙ్గా**
**గఙ్గా మమాఙ్గాన్యమలీకరోతు ॥** **52**

**ప్రతిపదార్థము :** విభూషిత = బాగుగానలంకరింపఁబడిన; అనంగరిపు = మన్మథునకు శత్రువైన శివునియొక్క; ఉత్తమాంగా = శిరస్సుగలది. **'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానం సర్వేంద్రియాణాం నయనమ్ ప్రధానమ్'** అను వచనముచే శిరస్సుత్తమాంగ మైనది. 'ఉత్తమాంగం శిరః శీర్షమ్' అని యమరము. సద్యః = వెంటనే; కృత = చేయఁబడిన; అనేక = ఎక్కువ మంది; జన = జనులయొక్క; ఆర్తి = దుఃఖములను; భంగా = పోఁగొట్టునది; లేక 'యనేక' యను దాని నార్తికి విశేషముగాఁ జేసి జనులయొక్క యనేకదుఃఖములను బోఁగొట్టుచున్న దని యర్థము చెప్పుకొనవచ్చును. మనోహర = అందమైన; ఉత్తుంగ = ఎత్తైన; చలత్ = కదలుచున్న; తరంగా = కెరటములు గలది యగు; గంగా = గంగానది; మమ = నాయొక్క; అంగాని = అవయవములను; అమలీకరోతు = నిర్మలముగాఁ జేయుఁగాక!

**విశేషములు :** ఇంతకు ముం దమలములు గాని నా యంగముల నిప్పుడమలములుగాఁ జేయుఁగాక! యని యభూతతద్భావార్థములో నమలశబ్దమునకుఁ 'గరోతి' ధాతువునకు చ్విప్రత్యయము దీర్ఘము వచ్చి 'యమలీకరోతు' అనురూప మేర్పడినది.

ఉత్తమాంగా; ఆర్తిభంగా; చలత్తరంగా, గంగా యను శబ్దములలోఁ గల యంత్యానుప్రాసము మృదంగశబ్దము వలె నుండి యింతకు ముందు చెప్పిన శ్లోకములోని లహరీతాండవమునకు ముక్తాయింపువలె నున్నది.

ఇది బేసి పాదములలో నుపేంద్రవజ్ర, సరిపాదములలో నింద్రవజ్ర గలిగిన యుపజాతివృత్తము.

స్యాదిన్ద్రవజ్రా యది! తౌ జగౌ గః
ఉపేన్ద్రవజ్రా జతజాస్తతో గౌ ।
అనన్తరోదీరితలక్ష్మభాజా
పాదౌ యదీయావుపజాతయస్తాః ॥

అని వృత్తరత్నాకరలక్షణము. 1, 3 పాదములలో జ–త–జ–గగ' యను గణములుండుచే నుపేంద్రవజ్రావృత్తము. 2, 4 పాదములలో 'త–త–జ–గగ' యను గణములుండుటచే నింద్రవజ్రావృత్తము. ఈ రెండు వృత్తముల మేళనముచే నుపజాతి.

## ఫలశ్రుతి

**అవతారిక :** ఇప్పుడు గంగాలహరీ స్తోత్రము యొక్క ప్రచురప్రచారమునకై కవి నామాంకిత పూర్వకముగాఁ బఠితులకు, శ్రోతలకు ఫలము నాశాసించుచున్నాఁడు –

**శ్లో॥ ఇమామ్ పీయూషలహరీం జగన్నాథేన నిర్మితామ్ ।**
**యః పఠేత్తస్య సర్వత్ర జాయన్తే జయసమ్పదః ॥ 53**

**ప్రతిపదార్థము :** జగన్నాథేన = జగన్నాథకవిచే; నిర్మితామ్ = రచింపఁబడిన; ఇమామ్ = ఈ; పీయూషలహరీమ్ = పీయూషలహరి యను నామాంతరము గల గంగాలహరిని; యః = ఎవఁడు; పఠేత్ = చదువునో; తస్య = వానికి; సర్వత్ర = అన్నిచోట్ల; జయ = జయము; సంపదః = సంపదలు; జాయంతే = పుట్టుచున్నవి.

**తాత్పర్యము :** జగన్నాథమహాకవిచే రచింపఁబడిన యీ గంగాలహరి నెవఁడు పఠించునో వానికి సర్వత్ర జయము భాగ్యములు లభించును.

**విశేషములు :** జగన్నాథకవికి లహరీశబ్దము మిక్కిలి ప్రియమైనది. తాను రచించిన పంచస్తోత్రములకుఁ బంచలహరు లని పేరు పెట్టుటయే కాక యీ గంగాలహరిలో మరుల్లీలాలోలల్లహరి (10); మరుదుల్లాసలహరి (26); లహరిలీలాకలకలః (32); లీలాచలితలహరీణామ్ (35); తటాభోగప్రేంఖల్లహరి (38); విజయంతాం లహరయః (40); వ్యాలోలోల్లాసివల్గల్లహరి (51); పీయూషలహరీమ్ (53) అని పెక్కు తావులలో లహరీశబ్దమును బ్రయోగించినాఁడు.

ఇది యనుష్టుప్ ఛ్లోకము.

శ్లో॥ పఞ్చమం లఘు సర్వేషు సప్తమం ద్విచతుర్థయోః ।
గురు షష్ఠం చ సర్వేషామేతచ్ఛ్లోకస్య లక్షణమ్ ॥

అని క్షేమేంద్రుని సువృత్తతిలకలక్షణము. అనుష్టుప్ – శ్లోకములోఁ బ్రతిపాదమునందు నెనిమిది యక్షరము లుండును. నాలుగు పాదము లందు నైదవ యక్షరము లఘువుగా నుండును. రెండు – నాలుగు పాదములలో నేడవ యక్షరము లఘువుగా నుండును. నాలుగు పాదములందు నాఱవ యక్షరము గురువుగా నుండును.

**గద్యము :** ఇతి శ్రీమత్త్రైలిఙ్గకులోద్భవేన పణ్డితరాజజగన్నాథేన విరచితా పీయూషలహర్యాఖ్యా గఙ్గాస్తుతిః సమాప్తా॥

**ప్రతిపదార్థము :** ఇతి = ఈ విధముగా; శ్రీమత్ = సందలతోఁ గూడిన; త్రైలింగకుల = తెలుఁగు వారి వంశములో; ఉద్భవేన = పుట్టిన; పండితరాజ = పండితరాయ లని షాజహాను చక్రవర్తిచే నొసఁగఁబడిన బిరుదు గల; జగన్నాథేన = జగన్నాథునిచే; విరచితా = విరచింపఁబడిన; పీయూషలహరీ = పీయూషలహరి యను; ఆఖ్యా = పేరుగల; గంగాస్తుతిః = గంగాస్తోత్రము; సమాప్తా = పూర్తియైనది.

తే॥గీ॥ పుష్పగిరి శంకరాచార్య – పూజ్యపాద
దత్తవిద్యావిభూషణోద్దండబిరుద
శాలి గరిమెళ్ళ శర్మ గంగాలహరికి
నమృతధారాఖ్యటీక నాంధ్రమునఁ జెప్పె.

**గద్యము :** ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధకవితావిచిత్ర పరాశరసగోత్రపవిత్ర శ్రీ గరిమెళ్ళ కృష్ణావధాని పౌత్ర శ్రీసూర్యకాంతాంబికాసూర్యనారాయణపుత్త్ర సకలసుకవి

బుధజనవిధేయ 'సహజపాండిత్య' అచ్యుత సత్యశేషగిరి సోమయాజి శర్మ నామధేయ ప్రణీతంబైన యమృతధార యను గంగాలహరీవ్యాఖ్య సర్వము సమాప్తము.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

శ్రీసర్వజిత్ ఫాల్గునకృష్ణపంచమీ గురువారము - 27-3-2008.

శ్రీః

**శ్రీః**

**మహాకవి శ్రీపండితరాజ జగన్నాథవిరచితా**

# యమునాలహరీ

**శ్లో॥ మాతః! పాతకపాతకారిణి! తవ ప్రాతః ప్రయాతస్తటం**
**యః కాళిన్ది! మహేన్ద్రనీలపటలస్నిగ్ధాం తనుం వీక్షతే!**
**తస్యారోహతి కిం న ధన్యజనుషః స్వాన్తం నితాన్తోల్లస-**
**న్నీలామ్భోధరబృన్దవన్దితరుచిర్దేవో రమావల్లభః॥ 1**

**అమృతధారా వ్యాఖ్యా**

కం ॥ శ్రీమత్పుష్పగిరీశ
స్వామి పదాబ్జముల గొలిచి పండితరాజ
శ్రీమద్యమునాలహరికి
శ్రీమదమృతధార నాఁగఁ- జేసెద వ్యాఖ్యన్.

**అవతారిక:** శ్రీజగన్నాథపండితరాయలు-

శ్లో ॥ గంగే! చ యమునే! కృష్ణే! గోదావరి! సరస్వతి!
నర్మదే! సింధు! కావేరి! జలేఽస్మిన్ సన్నిధిం కురు! ॥

అను సంకల్పము ననుసరించి గంగాలహరిని రచించిన పిమ్మట యమునా స్తుతి యగు నమృతలహరి నారంభించుచు యమునాదర్శనమహిమను జెప్పుచున్నాఁడు-

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! కాళిన్ది! = కళిందపర్వతము నుండి పుట్టిన యమునా నదీ! పాతకపాతకారిణి = పాపములను బడఁగొట్టుదానా! యః = ఎవఁడు, ప్రాతః = వేఁకువ జామున; తవ = నీ యొక్క; తటమ్ = ఒడ్డు ప్రదేశమును; ప్రయాతః = చేరిన వాఁడై; మహేంద్రనీల = గొప్ప యింద్రనీలమణుల; పటల = సమహము వంటి నల్లని; స్నిగ్ధామ్ = నిద్దమైన; తనుమ్ = దేహమును (ప్రవాహమును); వీక్షతే = చూచుచున్నాఁడో; ధన్యజనుషః = ధన్యమైనజన్మము గల; తస్య = వాని యొక్క; స్వాంతమ్ = మనస్సును, నితాంత = అధికముగా, ఉత్ + లసత్ = ఉల్లసిల్లుచున్న; నీల = నల్లని; అంభఃధర = నీటినిధరించు మేఘముల; బృంద = గుంపుచే; వందిత = నమస్కరింపఁబడిన; రుచిః = కాంతి గల; దేవః = దేవుఁడైన; రమావల్లభః = లక్ష్మీభర్తయైన శ్రీకృష్ణుఁడు; న ఆరోహతి కిమ్! = ఆరోహింపఁడా! ఏమి? తప్పక యారోహించు నని భావము.

**తాత్పర్యము :** తల్లీ! యమునానదీ! ప్రాతఃకాలము నం దెవఁడు నీ తీరమును జేరి

యింద్రనీలమణుల కాంతుల నీను నీప్రవాహమును వీక్షించునో యట్టి ధన్యజన్ముని మనస్సును నీలమేఘశ్యాముఁడైన శ్రీమహవిష్ణు వధిరోహించు నని భావము.

**విశేషములు :** శ్రీ కృష్ణపరమాత్మ నల్లనివాఁడు. యమునానది నల్లనిది. శ్రీకృష్ణుఁడు కనఁబడని దేవత. యమునా నది కనఁబడు దేవత. వివిధయజ్ఞములు గావించిన ధర్మాత్ములకుఁ గాని, యోగాభ్యాసముచే సమాధిస్థితి నందిన మహాయోగులకుఁ గాని, భక్తిజ్ఞానవైరాగ్యములు పండిన మహామునులకుఁ గాని శ్రీకృష్ణసాక్షాత్కారము సులభము గాదు. కాని యమునానదిని దర్శించినంత మాత్రముననే శ్రీకృష్ణసాక్షాత్కారము లభించును. ఇంక నాపుణ్యనదిలో నిత్యము స్నానము చేసి జపతపోధ్యానాదు లొనర్చిన వారికి శ్రీకృష్ణసాయుజ్యము లభించుటలో నాశ్చర్య మేమున్నది? ఇందలి స్నిగ్ధశబ్దముచే యమునాజలనైగనిగ్యము తెల్లమగుచున్నది. శ్రీకృష్ణుని దేహకాంతికి నల్లని మబ్బులు కూడ నమస్కరించుచున్న వనఁగా నీలమేఘవర్ణముకంటె శ్రీకృష్ణదేహకాంతియొక్క యాధిక్యము వెల్లడియగుచున్నది.

ఈ లహరి లోని పది శ్లోకములు శార్దూలవిక్రీడితములు **'సూర్యాశ్వై ర్మసజస్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్',** అని కేదారభట్టు వృత్తరత్నాకర లక్షణము. శార్దూల విక్రీడితములోఁ బ్రతిపాదము నందును 'మ-స-జ-స-త-త-గ' యను గణము లుండును.

**అవతారిక:** మొదటి శ్లోకములో దర్శన మహిమను జెప్పి యీ రెండవ శ్లోకములో స్నానమహిమను జెప్పుచున్నాఁడు-

**శ్లో॥ నిత్యమ్ పాతకభఙ్గమఙ్గలజుషాం శ్రీకణ్ఠకణ్ఠత్విషాం**
**తోయానాం యమునే! తవ స్తవవిధౌ కో యాతి వాచాలతామ్।**
**యేషు ద్రాగ్ వినిమజ్జ్య సజ్జితితరాం రమ్భాకరామ్భోరుహ-**
**స్ఫూర్జచ్చామరవీజితామరపదం జేతుం వరాకో నరః॥ 2**

**ప్రతిపదార్థము:** యమునే! = ఓ యమునానదీ! నిత్యమ్ = ఎల్లప్పుడు; పాతక = పాపములను; భంగ = పోఁగొట్టునవి; మంగళజుషామ్ = శుభములను గలిగించునవి; శ్రీకంఠ = శివునియొక్క, కంఠత్విషామ్ = కంఠకాంతి గలవి (నల్లనివి) యగు; తవ = నీ యొక్క; తోయానామ్ = నీళ్ళ యొక్క; స్తవవిధౌ = స్తుతి చేయు విధానములో; వాచాలతామ్ = బహుభాషిత్వమును (ఎక్కువగా మాటలాడుటను); కః యాతి = ఎవఁడు పొందును? వాచాలత్వముతో నిన్ను స్తోత్రము చేయుట కెవ్వఁడును సాహసింపఁ డని భావము. యేషు = ఆ జలములలో; వినిమజ్జ్య = బాగుగా మునిఁగి; వరాకః = మూర్ఖుఁ డైన; నరః = మానవుఁడు; ద్రాక్ = శీఘ్రముగా; రంభా = రంభ యొక్క; కర + అంభోరుహ = హస్తపద్మములలో; స్ఫూర్జత్ = ప్రకాశించుచున్న; చామర =

వింజామరముచే; వీజిత = వీవఁబడిన; అమరపదమ్ = దేవతాస్థానమును (స్వర్గలోకమును); జేతుమ్ = జయించుటకు; సజ్జతితరామ్ = ఎక్కువగా సిద్ధమగు చున్నాఁడు గదా!

**తాత్పర్యము :** ఓ యమునానదీ! నీ జలములలో బాగుగా మునిఁగిన మూఢుఁ డగు నరుఁడు కూడ శీఘ్రముగా స్వర్గమును బొంది రంభయొక్క కరకమలములలోఁ బ్రకాశించుచున్న వింజామరములతో విసరఁబడు దేవతాపదవిని జయించుచున్నాఁడు. ఇట్టి మహిమ గలవి, నిత్యము పాపములను బోఁగొట్టి మంగళమును గూర్చునవి, శివుని కంఠకాంతితో సమానమైన నల్లనికాంతులు గలవి యగు నీ జలములను స్తుతించుట కెవఁడు వాచాలుఁడై సిద్ధపడును? యమునా జలమహిమను వర్ణించి స్తుతించుట కెవ్వనికి శక్యము గా దని భావము.

**విశేషములు:** ఆలజాటచౌ బహుభాషిణి (5-2-125) అను పాణినీయసూత్రముచే వాచా శబ్దమునకు 'ఆలచ్ – ఆటచ్' అను ప్రత్యయములు చేరి వాచాలుఁ డని వాచాటుఁ డని రూపము లేర్పడును. కుత్సితముగా నెక్కువగా వాగువాఁడు వాచాలుఁడు. **'స్యా జ్జల్పాకస్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్'** అని యమరము. 'సజ్జతితరామ్' అనునది తరప్ప్రత్యయాంతము.

**అవతారిక:** ఇప్పుడు రాచకొలువునకు నైహికభోగములకు నొక నమస్కారము పెట్టి యమునానదీ దర్శన స్నానాదులనే కాక తత్తీరమునివృత్తిని గూడఁ గోరుకొనుచున్నాఁడు–

**శ్లో॥ దానాన్ధీకృతగన్ధసిన్ధురఘటాగణ్డప్రణాలీమిళద్**
**భృఙ్గాళీముఖరీకృతాయ నృపతిద్వారాయ బద్ధోఽఞ్జలిః।**
**త్వత్కూలే ఫలమూలశాలిని మమ శ్లాఘ్యామురీకుర్వతో**
**వృత్తిం హన్త! మునేః ప్రయాన్తు యమునే! వీతజ్వరా వాసరాః॥ 3**

**ప్రతిపదార్థము:** యమునే! = ఓ యమునానదీ! దాన = దానజలము చేత; అంధీకృత = గ్రుడ్డివిగాఁ జేయఁబడిన; గంధసింధుర = (మదజలము యొక్క) సువాసనలతోఁ గూడిన యేనుఁగుల; ఘటా = సమూహముయొక్క, గండ = చెక్కిళ్ళయందు; ప్రణాళీ = దారిగా (పంక్తిగా) నేర్పడి; మిళత్ = కూడుచున్న (మూఁగుచున్న); భృంగ = తుమ్మెదల యొక్క; ఆళీ = సమూహముచే; ముఖరీకృతాయ = రొదగాఁ జేయఁబడిన; నృపతిద్వారాయ = రాజద్వారమునకు (కోట గుమ్మమునకు); అంజలిః = దోసిలి; బద్ధః = బంధింపఁబడినది (నమస్కారము కావింపఁబడినది). ఫలమూలశాలిని = పండ్లు, దుంపలు గలిగిన; త్వత్ తీరే = నీ యొద్దున; శ్లాఘ్యామ్ = శ్లాఘింపఁ దగిన (పొగడఁ దగిన); మునేః వృత్తిమ్ = మునివృత్తిని; ఉరీకుర్వతః = అంగీకరించుచున్న;

మమ = నాకు; హంత! = సంతోషము!; వీతజ్వరాః = విడిచిపెట్టఁబడిన జ్వరములు గల (దుఃఖములు లేని); వాసరాః = దినములు; ప్రయాంతు = వెళ్ళుఁగాక! కడచుఁగాక!

**తాత్పర్యము:** జగన్నాథుఁ డింత వఱకు నెన్నియో రాజాస్థానములను సేవించి విసుగు చెందినాఁడు. రాజద్వారముల ముం దేనుఁగు గుంపుల బారులు తీర్చి యుండును. ఆ యేనుఁగుల చెక్కిళ్ళ నుండి మదజలము స్రవించుచుండును. సువాసనాభరితమైన యా మదజలమును ద్రావుటకై తుమ్మెదలు బారులుగా వచ్చి ఝంకారధ్వని చేయుచుండును. ఆ రొదతో నున్న రాజద్వారమున కొక నమస్కారము చేసినాఁడు. ఇప్పుడు యమునానదీ తీరమున మునివృత్తి నవలంబించి పండ్లు దుంపలు మొదలగు వానిచే నాఁకలి నణఁచుకొని తపస్సు చేయుచు దుఃఖములులేని దినములను గడపవలయు నని కోరుకొనినాఁడు. క్రమక్రమముగా వైరాగ్యము ముదిరినది.

**విశేషములు :** ఏనుఁగుల గండభాగములనుండి కారు మదజలమునకు **'దాన'** మని పేరు.

ఉ॥ చెక్కుల దాన మక్షులను సీధువు వీనుల సాగరంబు చే
ముక్కున శీర్ణకంబు చనుముక్కున శిక్యము శేఫసిన్ మదం
బక్కున ఘర్మవారి విపులాంఘ్రుల మేఘము జాఱుచుండఁ బెం
బెక్కి కరీంద్ర మొప్పె సెలయేఱుల తోడి నగేంద్రమో యనన్.

(వసుచరిత్రవ్యాఖ్య - 1-62)

ఏనుఁగుల చెక్కిళ్ళ నుండి కాఱు మదజలమునకు **'దాన'** మని; కన్నుల నుండి స్రవించు జలమునకు **'సీధు'** వని, చెవుల నుండి ప్రవహించు జలమునకు **'సాగర'**మని, తుండాగ్రము నుండి జాలువాఱు జలమునకు **'శీర్ణక'** మని, స్తనాగ్రము నుండి వచ్చు జలమునకు **'శిక్య'** మని, మేఢ్రమునుండి జాఱు జలమునకు **'మద'** మని, వక్షఃస్థలమునుండి యూరు జలమునకు **'ఘర్మ'** మని; పాదములనుండి చెమరించు జలమునకు **'మేఘ'** మని పేరులు చెప్పఁబడినవి. ఈ మదజల పరిమళముతో సువాసించు నేనుఁగులు గంధసింధురములు. ఈ సువాసనలు కాకృష్టములై తుమ్మెదలు మూఁగి రొదచేయుచు మదద్రవమును ద్రాగుట లోకప్రసిద్ధము.

శ్లో॥ **కల్యాణం వో విధత్తాం కరటమదధునీ లోలకల్లోలమాలా**
**ఖేలల్లోలంబకోలాహలముఖరితదిక్చక్రవాకాంతరాళమ్।**
**ప్రత్నం వేదండరత్నం సతతపరిచలత్కర్ణతాళప్రరోహద్**
**వాతాంకూరాజిహీర్షాదరవికృతఫణాశృంగభూషాభుజంగమ్॥**

(చం.భార.-1-1)

చెక్కిళ్ళ నుండి స్రవించుచున్న దానమదజలనదిలో నున్న పెద్దకెరటముల పంక్తిలో నాడుచున్న తుమ్మెదల రొదలచే మ్రోఁగుచున్న దిక్కుల మధ్య భాగము గలది, మాటిమాటికి నూపుటచేఁ చెవు లనెడి తాటియాకుల నుండి పుట్టుచున్న పిల్ల గాలుల నాహరింపవలె ననెడి కోరికతోఁ గొంచెము చాపిన పడగల కొనభాగములు గల పాములు నగలుగాఁ గలదియు నగు ప్రాచీన మైన గజరత్నము (శ్రీవిఘ్నేశ్వర స్వామి) మాకుఁ గల్యాణములను జేకూర్చుఁగాక! యని చంపూభారత ప్రారంభముతో ననంతభట్టు గజానన ప్రార్థనము.

కం॥ మదగజదానామోదముఁ
గదలని తమకములఁ ద్రావి కడుపుల నిండన్
బొదలుచుఁ దుమ్మెద కొదమల
కదుపులు జుంజు మ్మటంచు గానము చేసెన్.

కం॥ తేఁటి యొకటి యొరు ప్రియకును
మాటికి మాటికిని నాగమదజలగంధం
బేటి కని తన్నుఁ బొందెడి
బోటికి నందిచ్చు నిండు బోఁటుదనమునన్.

కం॥ అంగీకృతరంగన్మా
తంగీ మదగంధ మగుచుఁ దద్దయు వేడ్కన్
సంగీతవిశేషంబుల
భృంగీగణ మొప్పె మ్రానుపెట్టెడి మాడ్కిన్.

కం॥ వల్లభలు వాటి మునుపడ
వల్లభ మని మునరి రేని వారణదానం
బొల్లక మధుకరవల్లభు
లుల్లంబులఁ బొంది రెల్ల యుల్లాసంబుల్. (భాగ – 8స్క – 30....33)

అని పోతనగారి భాగవతము లోని గజేంద్రమోక్షకథాపద్యములు.

అంధ + కృత; ముఖర + కృత = అంధీకృత; ముఖరీకృత యనునవి యంధ– ముఖర శబ్దములకు 'డుకృఞ్ – కరణే' యను ధాతువు పరమైనప్పుడు **కృభ్వస్తియోగే చ్విః (5–4–50)** అని యభూతతద్భావార్థములో చ్విప్రత్యయము; **చ్వౌచ** (7–4–26) అను సూత్రముచే దీర్ఘము రాఁగా నేర్పడిన రూపములు.'అంధీకృతము' లనఁగా నింతకు ముందు గ్రుడ్డివి కానివి యిప్పుడు గ్రుడ్డివిగాఁ జేయఁబడిన వని యర్థము.

**అవతారిక :** ఇప్పుడు యమునలో స్నానము చేయు వానికి హరిహరాద్వైతసిద్ధి కల్గు నని చెప్పుచున్నాఁడు–

**శ్లో॥ అన్తర్మౌక్తికపుఞ్జమఞ్జిమ బహిః స్నిగ్ధేన్ద్రనీలప్రభమ్**
**మాతర్మే ముదమాతనోతు కరుణావత్యా భవత్యాః పయః।**
**యద్రూపద్వయధారణాదివ నృణామాచూడమామజ్జతాం**
**తత్కాలం తనుతేతరాం హరిహరాకారాముదారాం తనుమ్॥ 4**

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! యమునా! అంతః = లోపల; మౌక్తిక = ముత్యాల, పుంజ = రాశివలె; మంజిమ = తెల్లనివన్నెతోనందమైనది; బహిః =బయట; స్నిగ్ధ = చిక్కని; ఇంద్రనీలప్రభమ్ = ఇంద్రనీలమణుల వంటి నల్లని కాంతి కలది యగు; యత్ = ఏ నీరు; రూపద్వయధారణాత్ ఇవ= నలుపు తెలుపు లైన రెండు రూపములను ధరించుటవలన వలె; ఆచూడమ్ = శిఖదాఁక; ఆమజ్జతామ్ = స్నానము చేయు; నృణామ్ = మనుష్యుల యొక్క, ఉదారామ్ = గొప్ప దైన; తనుమ్ = దేహమును; ఇది జాత్యేకవచనము గొప్ప వైన దేహముల నని భావము. తత్కాలమ్ = ఆ స్నానసమయము నందే, హరిహరాకారామ్ = శివకేశవుల యాకృతిని; తనుతేతరామ్ = ఎక్కువగాఁ గల్గఁజేయుచున్నదో, తత్ = ఆ; **'యత్తదోర్నిత్యసంబంధః'** అను వచనమునే యచ్ఛబ్ద ప్రయోగము వలనఁ దచ్ఛబ్దము నధ్యాహరము చేసికొనవలయును. కరుణావత్యాః = దయావతివైన; భవత్యాః = నీ యొక్క; పయః = నీరు; మే = నాకు; ముదమ్ = సంతోషము; ఆతనోతు = విస్తరింపఁజేయుఁగాక!

**తాత్పర్యము:** తల్లీ! నీ నీరు లోపల ముత్యాలరాశివలె స్వచ్ఛముగాఁ దెల్లనిరంగుతో నంద మైనది. ఆ నీరే బయట నింద్రనీలమణులవలె నల్లని కాంతి గలది. ఆ రెండు రంగుల రూపములను ధరించుటవల్లనే నీలో శిరః స్నానము చేసిన మానవులు హరిహరాకారమును వెంటనే పొందుచున్నారు. అంతటి దయావతివైన నీ నీరు నాకు సంతోషము నెక్కువ విస్తారముగాఁ గలగఁజేయుఁగాక! విష్ణువు నల్లని వాఁడు. శివుఁడు తెల్లని వాఁడు. యమునాజలములు బయటి నల్లనివి. లోనఁ దెల్లనివి. అందుచే యమునలో స్నానము చేసిన వారికి హరిహరాకారము లభించుచున్నదని భావము.

**విశేషము :** నీళ్ళ రంగు తెలుపని తర్కశాస్త్రసిద్ధాంతము కాని యమునానదీ జల ప్రవాహము నల్లని దగుట ప్రత్యక్షసిద్ధము. దీనిని దార్కికు లిట్లు సమన్వయము చేసినారు.–

శ్లో॥ వర్ణః శుక్లో రసస్పర్శౌ జలే మధురశీతలే. (కారికావళి)
నను శుక్లరూపత్వమేవ కుతః? కాలిన్దీజలాదౌ నీలిమోపలబ్ధేరితి చేన్న;

నీలజనకతావచ్ఛేదికాయాః పృథివీత్వజాతేరభావాజ్జలే నీలరూపాసంభవాత్।
కాలిందీజలే నీలత్వప్రతీతిస్త్వాశ్రయౌపాధికీ. అత ఏవ వియతి
విక్షేపే ధవలిమోపలబ్ధిః ॥ (ముక్తావళి)

నీటి యందలి రంగు తెలుపు. రసము తీఁపి. స్పర్శము చల్లఁదనము. నీటికి శుక్లరూపత్వము మాత్రమే యెట్లు సంభవించును? కాలిందీ (యమునా) జలము మొదలగు వానిలో నలుపు గలదు గదా! అన్నచో నది సరిగాదు. నీలత్వాదివర్ణములు పృథివి యందే కలవు గాని జలము నందు లేవు. నల్లని రంగు గల్గియుండుట యను ధర్మము పృథివిది. అట్టి పృథివీత్వజాతి నీటియందు లేకపోవుటచే జలము నందు నీలరూప మసంభవము. కాలిందీజలములలో నీలత్వప్రతీతి యుపాధి వలనఁ గల్గుచున్నది. అందు వల్లనే కాళిందీజలములను బై కెగఁజిమ్మి నపుడు తక్కిన జలముల వలెనే తెల్లగానే యుండు నని శ్రీవిశ్వనాథ పంచాననుని న్యాయసిద్ధాంత ముక్తావళి. ఈ తర్కశాస్త్ర సిద్ధాంతము ననుసరించి జగన్నాథుఁడు యమునాజలము లోపలఁ దెల్లఁగా బయట నల్లఁగా నున్నట్లు వర్ణించినాఁడు.

కాశీమరణాదికమువలన శివసాయుజ్యము లభించు నని శైవపురాణము లుపదేశించుచున్నవి. మధురాదిమరణమువలన విష్ణుసాయుజ్యము లభించు నని వైష్ణవపురాణము లుపదేశించుచున్నవి. మరణాదికము లేకుండ స్నానమాత్రముచే హరిహరాకారరూప మగు నుభయసాయుజ్యమును యమునానది ప్రసాదించుచున్న దని జగన్నాథుఁడు చెప్పినాఁడు. ఈ శ్లోకములో జీవబ్రహ్మైక్యము తోపాటు హరిహరాద్వైతము కూడఁ బ్రతిపాదింపఁబడినది.

పయః శబ్దమునకు నీరని పాలని రెండర్థములు గలవు. **'పయః క్షీరమ్ పయోఽ మ్బు చ'** అని యమరకోశము. ఈ శ్లోకములో మాతః 'తల్లీ' యని సంబోధించి 'తవ పయః' నీయొక్క పయస్సని పయశ్శబ్దము వాడుటచే భక్తులకు యమునానదీ జలము తల్లి పాల వంటి దని ధ్వనించుచున్నది. 'తనుతేతరామ్' అను నది 'తరప్' ప్రత్యయాంతము.

**అవతారిక :** ఉపదేశదార్ఢ్యమునకై మఱల యమునానదీ దర్శనమహిమను బ్రతిపాదించు చున్నాఁడు –

**శ్లో॥ తావత్ పాపకదమ్బడమ్బరమిదం తావత్ కృతాన్తాద్ భయం**
**తావన్మానసపద్మసద్మని భవభ్రాన్తేర్మహానుత్సవః ।**
**యావల్లోచనయోః ప్రయాతి న మనాగమ్భోజినీబన్ధుజే!**
**నృత్యత్తుఙ్గతరఙ్గభఙ్గిరుచిరో వారామ్ ప్రవాహస్తవ॥ 5**

**ప్రతిపదార్థము:** అంభోజినీ బంధుజే! = పద్మినీ మిత్రుఁడైన సూర్యునకుఁ గొమార్తెవైన యమునానదీ!; నృత్యత్ = నర్తించుచున్న; తుంగ = ఎత్తైన; తరంగ = కెరటముల యొక్క; భంగి = రీతిచే; రుచిరః = అందమైన; తవ = నీయొక్క; వారామ్ = నీళ్ళ యొక్క; ప్రవాహః = ప్రవాహము; మనాక్ = కొంచెముగా నైనను; యావత్ = ఎంత వఱకు; లోచనయోః = (భక్తుల) కన్నులకు; న ప్రయాతి = గోచరముగాదో; తావత్ = అంతవఱకే; ఇదమ్ = ఈ; పాప = పాతకముల; కదంబ = సమూహముయొక్క; డంబరమ్ = ఆడంబరము; తావత్ = అంతవఱకే; కృతాంతాత్ = యముని వలన; భయమ్ = భయము; తావత్ = అంతవఱకే; మానసపద్మసద్మని = మనఃపద్మ మనెడి గృహమునందు; భవ = పుట్టుక; సంసారము మొదలగువాని; భ్రాంతేః = భ్రమ యొక్క; మహాన్ = గొప్ప; ఉత్సవః = పండుగు; సా భవతి = కల్గుచున్న దని శేషము. అస్తి పర్యాయమగు భవతి శబ్దము ప్రమోగింపఁబడకపోయినను నున్నట్లే.

**తాత్పర్యము :** ఓ సూర్యపుత్రీ! యమునా! నృత్యము చేయుచు నెత్తుగాఁ బొంగి పొరలెడి కెరటముల పంక్తిచే నొప్పిదమైన నీ జలప్రవాహము జనుల కంటి కెంతవఱకు గోచరము గాదో యంతవఱకే పాపసమూహముల యాడంబరము, అంతవఱకే యముని వల్ల భయము, అంతవఱకే హృదయపద్మ మను గృహములో సంసారభ్రాంతి మహోత్సవము నుండును. యమునాజలమును జూచినంతనే పాతకములు తొలఁగును, యముని వలన భయముండదు. మనస్సులో సంసారభ్రాంతి నశించును – అని భావము.

**అవతారిక :** ఇప్పుడు యమునానది నామమహిమను, స్నానమహిమను వక్కాణించు చున్నాఁడు –

**శ్లో॥ కాళిన్దీతి కదాపి కౌతుకవశాత్ త్వన్నామవర్ణానిమాన్**
**వ్యస్తానాలపతాం నృణాం యది కరే ఖేలన్తి సంసిద్ధయః ।**
**అన్తర్ధ్వాన్తకులాన్తకారిణి! తవ క్షిప్తామృతే వారిణి**
**స్నాతానామ్ పునరన్వహం స మహిమా కేనాధునా వర్ణ్యతే ॥ 6**

**ప్రతిపదార్థము :** అంతర్ధ్వాంత కులాంతకారిణి, అంతః = లోపలనున్న; ధ్వాంత = చీఁకటి యొక్క; కుల = వంశమును, అంతకారిణి = అంతము (నాశనము) చేయు దానా! యమునానదీ!; కదా అపి = ఎప్పుడైనను; కౌతుకవశాత్ = కుతూహలేచ్ఛతో; త్వత్ = నీయొక్క; ఇమాన్ = ఈ; నామవర్ణాన్ = పేరులోని యక్షరములను; వ్యస్తాన్ = విడి విడిగా నైనను; ఆలపతామ్ = ఆలాపించెడి; నృణామ్ = నరుల యొక్క; కరే = చేతియందు; ఇది జాత్యేకవచనము – చేతుల యందని యర్థము. సంసిద్ధయః =

అణిమాదిమహాసిద్ధులు; ఖేలంతి యది = ఆడుచున్న వన్నచో; క్షిప్త + అమృతే = నిక్షేపింపఁ బడిన యమృతము గల; తవ = నీయొక్క; వారిణి = నీటి యందు; అను + అహమ్ = అన్వహమ్ = ప్రతిదినము; స్నాతానామ్ = స్నానముచేసిన వారి యొక్క; సః = ఆ; మహిమా = గొప్పతనము; పునః = మఱల; కేన = ఎవనిచే; అధునా = ఇప్పుడు; వర్ణ్యతే = వర్ణింపఁబడుచున్నది. ఎవ్వరికిని వర్ణించుటకు శక్యము గాదని భావము.

**తాత్పర్యము :** దీపము మొదలగు వాని వెలుఁగు బయట నున్న చీఁకటిని బాఱఁద్రోలఁ గలదు గాని లోపల నున్న యజ్ఞాన మనెడి చీఁకటిని బోఁగొట్ట లేదు. యమునా నది యన్ననో మనస్సులో నున్న చీఁకటిని గూడఁ బాఱద్రోల గలదు. కాఁబట్టి **'అంతర్ధ్వాంతకులాంతకారిణి'** యని యమునానదికి సంబోధనము. ఈ విశేష్యము సాభిప్రాయ మగుటచేఁ బరికరాంకుర మలంకారము **'సాభిప్రాయే విశేష్యే తు భవేత్ పరికరాంకురః'** యని చంద్రాలోకలక్షణము.

ఎప్పుడైనను (ఎల్లప్పుడును గాదు) కుతూహలముగా వినోదమునకై (నియమముతోఁ గాదు) కాళింది, యమున మొదలగు నామముల లోని యక్షరములను (పూర్తి నామములను గాదు) విడివిడి గా (కలిపి గాదు) ఆలాపించు (జపించుట గాదు) నరుల యొక్క చేతులలో నణిమ, గరిమ, లఘిమ, మహిమ మొదలగు గొప్ప సిద్ధులు క్రీడించుచున్న వనఁగా నింక నిత్యము నమృత మయమైన యమునానదీ జలములోఁ గ్రుంకెడు వారి మహిమను వర్ణించుట కెవరికి శక్య మని భావము.

**అవతారిక :** ఇప్పుడు యమునానదీజలములు పంచమహాపాతకములను సంహరించు నని చెప్పుచున్నాఁడు –

**శ్లో॥ స్వర్ణస్తేయపరానపేయరసికాన్ పాథఃకణాస్తే యది**
**బ్రహ్మఘ్నాన్ గురుతల్పగానపి పరిత్రాతుం గృహీతవ్రతాః ।**
**ప్రాయశ్చిత్తకులైరలం తదధునా మాతః! పరేతాధిప-**
**ప్రౌఢాహంకృతిహారిహుంకృతిముచామగ్రే తవ స్రోతసామ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! యమునానదీ! స్వర్ణస్తేయపరాన్ = బంగారమును దొంగిలించుట యందుఁ దత్పరులైన వారిని; అపేయరసికాన్ = త్రాగరాని కల్లు మొదలగు వానిని బానము చేయుట యందే రసజ్ఞు లైన వారిని; బ్రహ్మఘ్నాన్ = బ్రాహ్మణులను జంపు వారిని; గురుతల్పగాన్ అపి = గురువు యొక్క శయ్యపై కేఁగు వారిని (ఆచార్యభార్యతో సంగమించు వారిని); ఇది యుపలక్షణము. ఈ నాలుగు

మహాపాతకములను గావించు వారితోఁ గూడు వారిని గూడ; పరిత్రాతుమ్ = బాగుగా రక్షించుటకు; తే = నీయొక్క; పాథః కణాః = నీటి బిందువులు; గృహీతవ్రతాః యది = గ్రహింపఁబడిన నోము గల వన్నచో; పరేత్ అధిప = యముని యొక్క; ప్రౌఢ = నేర్పు గల; అహంకృతి = అహంకారమును, హారి = హరించు; హుంకృతిముచామ్ = హుంకారములను విడిచిపెట్టు; తవ = నీయొక్క; స్రోతసామ్ = జలప్రవాహముల; అగ్రే = ముందు; అధునా = ఇప్పుడు; తత్ = ఆ; ప్రాయశ్చిత్తకులైః = ప్రాయశ్చిత్త సమూహములతో; అలమ్ = చాలును. నీ ప్రవాహములో స్నానము చేసిన వారికిఁ బాయశ్చిత్తము లన్నియు వ్యర్థము లని భావము.

**తాత్పర్యము :** తల్లీ! ఓ యమునానదీ! నీ జలకణములు (నీటి బొట్లు) (1) బంగారము దొంగిలించు వారిని, (2) సురాపానము చేయు వారిని (3) బ్రహ్మహత్య చేయు వారిని (4) గురుతల్పగాములను (ఈ నలువురు మహాపాతకులతోఁ గూడిన వారిని); సంరక్షించుటయే వ్రతముగా గ్రహించిన వన్నచో నింక యముని యొక్క ప్రగల్భములతోఁ గూడిన యహంకారముల నడ్డగించు హుంకారములు చేయు నీ ప్రవాహముల యందుఁ దేలువారికి బ్రాయశ్చిత్తము లింకఁ జాలును. నీ ప్రవాహములో మునిఁగిన వారికి ధర్మశాస్త్రకారులు విధించిన ప్రాయశ్చిత్తములతోఁ బని లే దని భవము.

శ్లో॥ బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమః।
మహాన్తి పాతకాన్యాహుః సంసర్గశ్చాపి తైః సహ॥ (మను- 11- 54)

(1) బ్రాహ్మణులను వధించుట (2) కల్లు త్రాగుట (3) బంగారమును దొంగిలించుట (4) గురుభార్యాగమనము మహాపాతకములు. ఈ నలువురతోఁ గూడుట యైదవ మహపాతకము. ఇక్కడ స్తేయశబ్దముచే సువర్ణాపహరణమును గ్రహింపవలెను. "బ్రహ్మహత్య, నిషిద్ధసురాపానమ్, బ్రాహ్మణసువర్ణహరణం, గురుభార్యాగమనమ్, ఏతైశ్చ సంసర్గః సంవత్సరేణ పతతీత్యేతాని మహాపాతకాన్యాహుః" - అని కుల్లూకభట్టు మన్వర్థముక్తావళి. ఈ పంచమహాపాతకములు నరుని నరకములోఁ గూలఁ ద్రోయును- **'పాతకత్వం నరకహేతుత్వమ్, మహత్త్వం చ ధర్మానధికారితా ప్రయోజకత్వమ్'** - అని వీరమిత్రోదయము. మహాపాతకులకు ధర్మము నాచరించుటలో నధికారము లేదు. ఆచరించినను ఫలింప దని భావము.

**'ప్రాయశ్చిత్తశబ్దశ్చాయమ్ పాపక్షయార్థే నైమిత్తికే కర్మవిశేషే రూఢః'** పాపక్షయము కొఱకుఁ జేయు నైమిత్తిక మను కర్మవిశేషమునందుఁ బ్రాయశ్చిత్తశబ్దము రూఢ మని విజ్ఞానేశ్వరుని మితాక్షర.

శ్లో॥ ప్రాయో నామ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే ।
తపోనిశ్చయసంయుక్తమ్ ప్రాయశ్చిత్తం తదుచ్యతే ॥

ప్రాయ స్సనఁగాఁ దపస్సు. ఆ తపస్సు వలనఁ బాపములు పోవునను నిశ్చయాత్మకమైన బుద్ధి చిత్తము. నిశ్చయబుద్ధితోఁ గూడిన తపస్సే ప్రాయశ్చిత్త మని **యాంగిరసస్మృతి.** ద్వాదశవార్షికతీర్థయాత్రాదివ్రతవిశేషములు కృచ్ఛ్రచాంద్రాయణాదులు ప్రాయశ్చిత్తములు. తెలియక చేసిన పాపములకుఁ బ్రాయశ్చిత్తము లుండును గాని, బుద్ధిపూర్వకముగాఁ గోరికతోఁ దెలిసి చేసిన పాపములకు బ్రాయశ్చిత్తము లుండవు.

ఈ పంచమహాపాతకములకు మను - యాజ్ఞవల్క్య - విష్ణ్వాది స్మృతి గ్రంథములలో **'ఛిత్వా లింగం వధ స్తస్య'** యని ప్రాణాంతప్రాయశ్చిత్తములు చెప్పఁబడినవి. ఈ ప్రాయశ్చిత్త విధానములను హేమాద్రిప్రాయశ్చిత్తకాండ - ప్రాయశ్చిత్తేందుశేఖర - ప్రాయశ్చిత్తప్రకాశాది ధర్మశాస్త్రగ్రంథములలోఁ దెలియవలయును.

ఇట్టి పంచమహాపాతకములను గావించి నరకములోఁ బడినవారిని యముఁడు పెద్ద పెద్ద బొబ్బలతో దండించును. ఇవియే యముని ప్రౌఢాహంకారములు. యమునానదీజలములు తనలో స్నానము చేసిన వారిని మహాపాతకు లైనను యమలోకములోఁ బడకుండ నుద్ధరించి యముని ప్రౌఢాహంకారములను గూడ హుంకారముతో నెదుర్కొని స్వర్గమునకుఁ గొంపోవును. కావున యమునానదీ స్నాతు లగు వారు మహాపాతకు లైనను వారికిఁ బ్రాయశ్చితములతోఁ బని లేదని భావము.

జగన్నాథకవి యీ భావమునే గంగాలహరిలో(34) ఁగూడఁ జెప్పినాఁడు -

శ్లో॥ అపి ఘ్నంతో విప్రానవిరతముశంతో గురుసతీః
పిబంతో మైరేయమ్ పునరపహరంతశ్చ కనకమ్ ।
విహాయ త్వయ్యంతే తనుమతనుదానాధ్వరజుషా
ముపర్యంబ క్రీడం త్యఖిల సురసంభావితపదాః ॥

**అవతారిక :** ఇప్పుడు యమునానదీపయఃపానమును, శ్రీకృష్ణసందర్శనమును, కృష్ణ సంకీర్తనమును, యమునాతటసంచారమును గోరుకొనుచున్నాఁడు -

**శ్లో॥ పాయం పాయమపాయహారి జనని! స్వాదు త్వదీయమ్ పయో**
**నాయం నాయమనాయనీమకృతినామ్ మూర్తిం దృశోః కైశవీమ్ ।**
**స్మారం స్మారమపారపుణ్యవిభవం కృష్ణేతి వర్ణద్వయం**
**చారం చారమితస్తతస్తవ తటే ముక్తో భవేయం కదా? ॥ 8**

**ప్రతిపదార్థము :** జనని! = తల్లీ! యమునా! అపాయహారి = అపాయములను హరించు; త్వదీయమ్ = నీ యొక్క; స్వాదు = రుచికరమైన; పయః = నీటిని; పాయం పాయమ్ = త్రావి త్రావి; అకృతినామ్ = పుణ్యములు చేయనివారికి; అనాయనీమ్ = నయనగోచరము గాని; కైశవీమ్ = కేశవసంబంధ మైన; మూర్తిమ్ = రూపమును; దృశోః = కన్నులకు (గోచరముగా); నాయం నాయమ్ = పొందఁజేసి పొందఁజేసి; అపార = దరిలేని; పుణ్య = సుకృతములకు; విభవమ్ = వైభవమైన; కృష్ణ + ఇతి = కృష్ణా అను; వర్ణద్వయమ్ = అక్షరముల జంటను; స్మారం స్మారమ్ = స్మరించి స్మరించి; తవ = నీ యొక్క; తటే = ఒడ్డునందు; ఇతః తతః = ఇటు – అటు; చారం చారమ్ = తిరిగి తిరిగి; కదా = ఎప్పుడు; ముక్తః = ముక్తి పొందిన వాఁడను; భవేయమ్ = అగుదునో కదా!

**తాత్పర్యము :** తల్లీ! యమునానదీ! అపాయములను బాఱఁద్రోలు తియ్యని నీ నీటిని మాటిమాటికిఁ ద్రాగిత్రాగి, పాపాత్ములకు గోచరము కాని శ్రీకృష్ణుని రూపమును గనులకు మాటిమాటికిఁ జూపించి చూపించి, యంతులేని పుణ్యములకు వైభవస్థానమైన కృష్ణా! యను నక్షరద్వయమును మాటిమాటికి స్మరించి స్మరించి, నీ తీరభాగములో నిటు నటు సంచరించి సంచరించి యెప్పుడు ముక్తుఁడ నగుదునో కదా! యని భావము.

**విశేషములు :** ఈ శ్లోకము నందలి 'పాయమ్పాయమ్' 'నాయం నాయమ్' 'స్మారం స్మారమ్' 'చారం చారమ్' అనునవి ణములంతములగు క్రియారూపములు.

'పా–పానే'; 'ణీఞ్–ప్రాపణే' 'స్మృ–ఆధ్యానే' 'స్మృ–చిన్తాయామ్' 'చర–గతౌ' అను ధాతువులకు **ఆభీక్ష్ణ్యే ణముల్ చ** (4–4–22) అను సూత్రముచే ణముల్ ప్రత్యయము వచ్చి 'పాయమ్పాయమ్' మొదలగు రూపము లేర్పడును. అభీక్ష్ణ్య మనఁగాఁ బౌనఃపున్యము. మాటిమాటికి నని యర్థము. సమానకర్తృకములై పూర్వకాలమును బోధించు ధాతువులకుఁ బౌనఃపున్యార్థములో ణముల్ ప్రత్యయము వచ్చును. **'ఆభీక్ష్ణ్యే ద్వే భవతః'** పౌనఃపున్యార్థములో ణములంతములగు ధాతువులకు ద్విర్వచనము వచ్చి 'పాయమ్ పాయమ్' మొదలగు రూపములేర్పడును. ఈ ణములంతము లగు ధాతువు లెప్పుడును జంటలు జంటలు గానే ప్రయోగింపఁబడును. చకారముచే క్త్వా ప్రత్యయము చేరి 'పీత్వా పీత్వా' మొదలగు రూపము లేర్పడును.

ఈ ప్రౌఢప్రయోగములు జగన్నాథపండితరాయల మహావైయాకరణత్వమును వెల్లడించుచున్నవి.

**అవతారిక :** ఇప్పుడు యమునలో మృతిచెందిన వాఁడు యమలోకము నుల్లంఘించి

సూర్యమండలమును భేదించికొని పుణ్యలోకములను బొందునని చెప్పుచున్నాఁడు –

శ్లో॥ మాతర్వారిణి పాపహారిణి తవ ప్రాణప్రయాణోత్సవం
సంప్రాప్తేన కృతాం నరేణ సహతేఽవజ్ఞాం కృతాన్తోఽపి యత్ ।
యద్వా మణ్డలభేదనాదుదయినీశ్చణ్డద్యుతిర్వేదనా–
శ్చిత్రం తత్ర కిమప్రమేయమహిమా ప్రేమా యదౌత్పత్తికః ॥ 9

**ప్రతిపదార్థము :** మాతః = తల్లీ! యమునానదీ!; పాపహారిణి = పాపములనుఁ బోఁగొట్టు; తవ = నీయొక్క; వారిణి = జలమునందు; ప్రాణప్రయాణ = ప్రాణములయొక్క ప్రయాణము చేయుట యను; ఉత్సవమ్ = పండుగును; సంప్రాప్తేన = పొందిన; నరేణ = మానవునిచే; కృతామ్ = చేయఁబడిన; అవజ్ఞామ్ = తిరస్కారమును; కృతాంతః అపి = యముఁడు కూడ; సహతే = సహించుచున్నాఁడు; యత్ = అనునదేదియున్నదో; యద్వా = ఇంకను; చండద్యుతిః = సూర్యుఁడు; మండలభేదనాత్ = తన మండలమును భేదించుటచే; ఉదయినీః = పుట్టిన; వేదనాః = దుఃఖములను; సహతే = సహించు చున్నాఁడు; యత్ = అనునదేది యున్నదో (తత్ = అది); అప్రమేయ = మితి లేని; మహిమా = నీ గొప్పతనము; ఔత్పత్తికః = నీయందుఁ బుట్టిన; ప్రేమా = ప్రీతి; తత్ర = అక్కడ (ఆ విషయములో); చిత్రం కిమ్? = ఆశ్చర్యమేమున్నది?

**తాత్పర్యము :** తల్లీ! యమునా! పాపములను బోఁగొట్టు నీ జలమునందు మృతి చెందిన నరుఁడు నరకలోకమున కేఁగక యమునిఁగూడ నవహేళనముగాఁ జూచుచున్నాఁడు. దానిని యముఁడు కూడ సహించుచున్నాఁడు. అట్లే యా నరుఁడు సూర్యమండలమును భేదించుకొని పుణ్యలోకముల కేఁగుచున్నాఁడు. ఆ భేదనసమయమునఁ బుట్టిన వేదనలను సూర్యుఁడు కూడ సహించుచున్నాఁడు. ఆ నరున కట్టి శక్తి వచ్చుటకు నీయొక్క యూహాతీతమైన మహిమ కారణము. ఆ యముఁడు, సూర్యుఁడు నట్లు సహించుటకు యమునకు నీవు చెల్లెల వనియు సూర్యునకు నీవు కూఁతురనియు వారిద్దఱకు నీయం దుత్పన్న మైన ప్రేమము కారణము.

**విశేషములు :** పాపహారిణి! = పాపములను బోఁగొట్టుదానా! యని యమును సంబుద్ధిగాఁ గూడ నన్వయింపవచ్చును. 'పాపహారిణి' యనునది సంబోధనమైనచోఁ బ్రథమావిభక్తియు; 'వారిణి' యను దానికి విశేషణమైనచో సప్తమీవిభక్తియు నగునని వివేకము.

యమునాజలము నందు మరణించిన మానవుఁడు యోగియై నరకలోకమున కేఁగక యమునిఁ గూడఁ జులకనగాఁ జూచుచు సూర్యమండలమును బ్రద్దలుకొట్టుకొని యేఁగి పుణ్యలోకము లొందును.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమణ్డలభేదినౌ ।
పరివ్రాడ్ యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః ॥

(పరాశరస్మృతి-3-32)

యోగయుక్తుఁడగు పరివ్రాజకుఁడు, యుద్ధములో వెన్నుచూపక శత్రువున కెదురుగా నేఁగి మరణించిన యోధుఁడు నను నిద్దఱే సూర్యమండలమును భేదించువా రను వచనము ననుసరించి యిక్కడ నిట్లు వర్ణింపఁబడినది.

**అవతారిక :** ఇప్పుడు యమునా నామసంకీర్తనఫలమును జెప్పుచున్నాఁడు -

**శ్లో॥ సంజ్ఞాకాన్తసుతే! కృతాన్తభగిని! శ్రీకృష్ణనిత్యప్రియే!**
**పాపోన్మూలిని! పుణ్యధాత్రి! యమునే! కాళిన్ది! తుభ్యం నమః ।**
**ఏవం స్నానవిధౌ పఠన్తి ఖలు యే నిత్యం గృహీతవ్రతా-**
**స్తానామన్త్రితసంఖ్యజన్మజనితమ్ పాపం క్షణాదుజ్ఝతి ॥ 10**

**ప్రతిపదార్థము :** సంజ్ఞాకాంతసుతే = సంజ్ఞాదేవికి భర్తయైన సూర్యునకుఁ గుమారీ! కృతాంతభగిని! = యముని చెల్లెలా!; శ్రీకృష్ణనిత్యప్రియే! = శ్రీకృష్ణున కెల్లప్పుడు ప్రేయసి వైన దానా!; పాప + ఉత్ + మూలిని = పాపోన్మూలిని = పాపములను బయటకుఁ బెకలించు దానా!; పుణ్యధాత్రి! = పుణ్యములకు భూమివైన దానా; లేక: పుణ్యములను ధరించి పోషించుదానా!; యమునే! = యమునా!; కాళిందీ! = కళిందపర్వతము నుండి పుట్టినదానా! కాళిందీ!; తుభ్యమ్ = నీకొఱకు; నమః = నమస్కారము; అస్తు = అగుఁగాక! యని శేషము. ఏవమ్ = ఈ విధముగా; స్నానవిధౌ = యథావిధిగా స్నానము చేయు సమయములో; యే = ఎవరు; నిత్యమ్ = ప్రతిదినము; గృహీతవ్రతాః = గ్రహింపఁబడిన వ్రతముగలవా రనఁగా నియమమును గ్రహించినవారై; ఖలు = నిశ్చయముగా; పఠంతి = నీ నామమును జదువుచున్నారో; తాన్ = వారిని; ఆమంత్రిత = పిలిచిన పిలుపుల యొక్క; సంఖ్య = లెక్క యెంత గలదో; జన్మ = అన్ని జన్మములలో; జనితమ్ = పుట్టిన; పాపమ్ = పాపము; 'సంధ్యాకాంతసుతే' యను పేరు మొదలుకొని 'కాళింది' యను పేరు వఱకు నేడు పేరులు గలవు. అన్ని సంఖ్యల జన్మములలోఁ బుట్టిన పాపమనఁగా నేడు జన్మములలోఁ జేసిన పాపము; క్షణాత్ = క్షణములో; ఉజ్ఝతి = విడిచిపెట్టును.

**తాత్పర్యము :** (1) సంజ్ఞాకాంతసుతా! (2) కృతాంతభగినీ (3) శ్రీకృష్ణనిత్యప్రియా (4) పాపోన్మూలినీ (5) పుణ్యధాత్రీ (6) యమునా! (7) కాళిందీ! నీకు నమస్కారమని యీ విధముగా స్నానము చేయు సమయములో నిత్యము నెవ్వరు నోముగా నీ నామములను

నిశ్చయముగాఁ బఠింతురో వారి నేడు జన్మములలోఁ జేసిన పాపము క్షణములో విడిచిపెట్టునని భావము.

**విశేషములు :** ఆమంత్రణమనఁగాఁ బిలుపు. ఇం దెన్ని యామంత్రణములున్నవో యన్ని జన్మములలోఁ జేసిన పాపమనఁగా నేడు జన్మములలోఁ జేసిన పాప మని యర్థము.

సూర్యునకు సంజ్ఞాదేవి, ఛాయాదేవి యను నిద్దఱు భార్యలు గలరు. సంజ్ఞాదేవి విశ్వకర్మప్రజాపతి కూఁతురు. సంజ్ఞాదేవికి వైవస్వతమనువు, యముఁడు, యమునయు జనించిరి. బడబారూపములో నున్న సంజ్ఞకు బడబరూపమును ధరించిన సూర్యునకు నశ్వినీదేవతలు, రేవంతుఁడు జన్మించిరి. సూర్యునకు ఛాయాదేవి యందు సావర్ణి, శనైశ్చరుఁడు నను కొడుకులు, తపతి యను కూఁతురు పుట్టిరి. ఈ కథ మార్కండేయ పురాణములోఁ గలదు. కాళిందిని శ్రీకృష్ణుఁడు వివాహమాడెను. ఈ కథ భాగవతములోఁ గలదు. ఈ విధముగా యమున సంజ్ఞాకాంతసుత, కృతాంతభగిని, శ్రీకృష్ణనిత్యప్రియ యైనది.

'కృతాంతభగిని' యనునది సాభిప్రాయమగు సంబోధనము.

## యమద్వితీయ – భగినీహస్తభోజనము

కార్తికమాసములో శుక్లపక్షములో వచ్చు విదియకు **'యమద్వితీయ'** యని పేరు.

శ్లో॥ ఊర్జే శుక్లద్వితీయాయామపరాహ్ణేఽర్చయేద్యమమ్ ।
స్నానం కృత్వా భానుజాయాం యమలోకం న పశ్యతి ॥

కార్తికశుక్లద్వితీయ నాఁడపరాహ్ణములో యముని బూజింపవలెను. ఆనాఁడు యమునలో స్నానము చేసిన వాఁడు యమలోకము చూడఁడని స్కాందపురాణవచనము.

శ్లో॥ కార్తికే శుక్లపక్షస్య ద్వితీయాయాం యుధిష్ఠిర! ।
యమో యమునయా పూర్వమ్ భోజితః స్వగృహేఽర్చితః ॥

శ్లో॥ అతో యమద్వితీయేయం త్రిషు లేకేషు విశ్రుతా ।
అస్యాం నిజగృహే విప్ర! న భోక్తవ్యం తతో నరైః ॥

శ్లో॥ స్నేహేన భగినీ హస్తాద్ భోక్తవ్యమ్ పుష్టివర్ధనమ్ ।
దానాని చ ప్రదేయాని భగినీభ్యో విధానతః ॥

శ్లో॥ స్వర్ణాలంకారవస్త్రాన్నపూజాసత్కారభోజనైః ।
సర్వా భగిన్యః సంపూజ్యా అభావే ప్రతిపన్నకాః ॥

పూర్వకాలములోఁ గార్తికశుక్లపక్షద్వితీయ నాఁడు యమున తన సోదరుఁడగు యముని స్వగృహములో నర్చించి భోజనము పెట్టినది కావున నిది **యమద్వితీయ** యని మూఁడు లోకములందు విశ్రుతమైనది. ఆ దినమున నెవ్వరు స్వగృహములో భుజింపరాదు. స్నేహముతో భగిని స్వహస్తముతోఁ బెట్టిన భోజనమును భుజింపవలెను. ఆనాఁడక్కాచెల్లెండ్రకు బంగారు నగలు, బట్టలు మొదలగు సత్కారములతో దానములు చేయవలయును. అక్కాచెల్లెండ్రను బూజింప వలయును. కాసా యక్కలు కాసా చెల్లెండ్రు లేని వారు, వరుస యక్కలను గాని, వరుస చెల్లెండ్రను గాని లేక పిన్నులను గాని సత్కరింపవలెను.

శ్లో॥ భ్రాతస్తవానుజాతాహమ్ భుంక్ష్వ భక్తమిదం శుభమ్ ।
ప్రీతయే యమరాజస్య యమునాయాం విశేషతః ॥

"అన్నా! నేను నీకుఁ దోఁబుట్టువను. ఈ శుభమైన యన్నమును భుజింపుము. దీని వలన యమధర్మరాజునకు, యమునకుఁ బ్రీతి గల్గును' అను సంకల్పముతో సోదరునకు భోజనము పెట్టవలయును.

శ్లో॥ యా తు భోజయతే నారీ భ్రాతరం యుగ్మకే తిథౌ ।
అర్చయేచ్చాపి తామ్బూలైర్న సా వైధవ్యమాప్నుయాత్ ॥
భ్రాతురాయుఃక్షయో రాజన్న భవేత్తత్ర కర్హిచిత్ ॥

ఏ స్త్రీ కార్తిక శుద్ధద్వితీయ నాఁడు తన సోదరు నర్చించి భోజనము పెట్టి తాంబూలాదు లర్పించునో యామె వైధవ్యమును బొందదు. ఎవరు భగినీహస్త భోజనమును భుజింతురో వారు దీర్ఘాయుష్మంతు లగుదు రని బ్రహ్మాండపురాణము.

ఈ వ్రతము చతుర్వర్గచింతామణి, నిర్ణయామృతము, నిర్ణయసింధువు మొదలగు ధర్మశాస్త్రగ్రంథము లన్నింటి యందు నుపదేశింపఁబడినది. ఈ యమద్వితీయా ప్రాశస్త్యమును వెల్లడించుటకై దీని నంతటిని మనస్సులో నుంచుకొని జగన్నాథ మహాకవి యమునను 'కృతాంతభగిని' యని సంబోధించినాఁడు.

**అవతారిక :** ఇప్పుడు కవి గ్రంథాంతమునఁ గర్తృత్వజ్ఞానమునకై తన పేరు చెప్పుచున్నాఁడు

శ్లో॥ అయమ్ పణ్డితరాజేన శ్రీజగన్నాథశర్మణా ।
స్తవః కలిన్దనన్దిన్యా నిర్మలో నిరమీయత ॥

**ప్రతిపదార్థము :** శ్రీజగన్నాథశర్మణా = శ్రీజగన్నాథశర్మచే; పండితరాజేన = పండితరాయలచే; అయమ్ = ఈ; కలిందనందిన్యాః = కళిందపర్వతసుతయైన

యమునానదియొక్క; నిర్మలః = నిర్మలమైన; స్తవః = స్తుతికావ్యము; నిరమీయత = నిర్మింపఁబడినది.

**తాత్పర్యము :** పండితరాయ లను బిరుదు గల శ్రీజగన్నాథశర్మచే నిర్మలమైన యీ యమునాస్తవము రచింపఁబడినది.

**విశేషములు :** ఇది యనుష్టుప్ పద్యము.

శ్లో॥ పంచమం లఘు సర్వత్ర సప్తమం ద్విచతుర్థయోః ।
షష్ఠం గురు విజానీయాదేతత్పద్యస్య లక్షణమ్ ॥

అని కాళిదాసుని శ్రుతబోధలక్షణము. అనుష్టుప్పద్యములోఁ బ్రతిపాదమునందు నెనిమిది యక్షరము లుండును. నాలుగు పాదము లందు నైదవ యక్షరము లఘువుగా నుండును. రెండు నాలుగు పాదములలో నేడవ యక్షరము లఘువుగా నుండును. నాలుగు పాదము లందు నాఱవ యక్షరము గురువుగా నుండును.

**గద్యము :** ఇతి పణ్డితరాజ శ్రీజగన్నాథకృతామృతలహరిః సమాప్తా ॥

ఇతి యను శబ్దము గ్రంథసమాప్తిని సూచించును. ఇతి = ఈ విధముగా; పండితరాజ = పండితరాజను బిరుదము గల; శ్రీజగన్నాథ = శ్రీ జగన్నాథకవిచే; కృతా = చేయఁబడిన; అమృతలహరిః = అమృతలహరి యను యమునా స్తుతి కావ్యము; సమాప్తా = పూర్తియైనది.

తే॥గీ॥ పుష్పగిరి శంకరాచార్య – పూజ్యపాద
దత్త విద్యావిభూషణో –ద్దండ బిరుద
శాలి శ్రీశర్మ శ్రీయము–నాలహరికి
నమృతధారాఖ్యటీక నాం–ధ్రమునఁ జెప్పె.

గద్యము : ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధకవితావిచిత్ర పరాశరసగోత్రపవిత్ర శ్రీగరిమెళ్ళకృష్ణావధానిపౌత్త్ర శ్రీసూర్య కాంతాంబికా శ్రీసూర్యనారాయణపుత్త్ర సకలసుకవిబుధజనవిధేయ సహజపాండిత్య అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ నామధేయ ప్రణీతంబైన యమృతధార యను యమునాలహరీ వ్యాఖ్య సర్వము సమాప్తము.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ